

# సాధనారహస్యాలు

డా॥ వేదవ్యాస I.A.S., Ph.D.,

# వి ష య సూ చి క



—o—

# మీతో ముందు ఒక్కమాట !



యోగమిత్రు లందరికీ మంగళాశాసనములు !

ఈనాడు ప్రపంచంలో ఎక్కడచూచినా కనిపించేది అవినీతి, అరాచకత్వమూనూ ! సామాన్యునిలో నిరాశ, నిస్పృహ జీవితంలో అడుగడుగునా సంఘర్షణలతో నిండివుండి. ఎందుకు జీవిస్తున్నారో తెలియని అయోమయంలో జీవితాన్ని నెట్టుకొస్తున్న వైనమూ కనిపిస్తూంది. దీనికి ప్రధానంగా కనిపించే కారణం రాజకీయవ్యాపారుల పురోగమనం, రాజకీయమనేది పాలన నిమిత్తమైనది — సేవా భావంతో కూడుకొన్నదికాక, కేవలం వ్యాపారంకన్న హీనంగా తయారయి ఉండటం చూస్తున్నాము. ఇది అగ్రస్థానములోనున్న వారికి పట్టిన కాలదోషమనిపిస్తుంది. అగ్రస్థానంలో ఉన్న వారి నుండి సామాన్య మానవుని వరకూగల మానవతాశాతం, మానవత్వపు విలువ బాగా తగ్గిపోయింది. అంటే Human Quality దిగజారి పోయిందన్నమాట.

పూర్వకాలంలో అధ్యాత్మికత అంటే పూజలు, జపాలు, ఆలయాలు అనేభావన ఉంది. అదేభావం ఈనాటికీ వేళ్ళూని పాతుకు పోయింది. అసలు నిజంగా ఆధ్యాత్మికత అంటే ఏమిటో తెలియని స్థితిలో ఉన్నారు మనవాళ్ళు. ఈనాడు దేవునిమీద, నమ్మకం

అనేదానిమీద, గౌరవంమీద నమ్మకం నశించింది. కొందరికి దేవుని మీద నమ్మకం ఉన్నా మనుష్యుల మీద, మానవత్వం మీద గౌరవం శూన్యం. దైవాన్ని గూర్చిన చింతన ఉన్నా మనుష్యుల గురించి, మానవ సమాజమును గురించిన చింతనలేకుండా ఉన్నారు.

అసలు అధ్యాత్మికత అనేది భగవంతునికోసం కానేకాదు ! మానవుల ఉద్ధరణకోసం ఉద్దేశింపబడింది. అధ్యాత్మికతయొక్క (Aim and Purpose) మానవ జాత్యుద్ధరణ మాత్రమే! ఈనాటి సంఘం, సంఘంలోని కుళ్ళు, అవినీతి, స్వార్థం, మొదలైన వాటితో నిండిపోయిన దురవస్థలనుండి ఉద్ధరించడానికి అధ్యాత్మికత ఒక్కటే సాధనం. అధ్యాత్మికత తప్ప మరోమార్గంగాని, గమ్యం గానీ లేదు. Human Quality తగ్గడమంటే అధ్యాత్మికత తగ్గడమే ! అధ్యాత్మికతా మార్గాలు, సూత్రాలు ఏవైతే ఉన్నాయో అవి సమాజంలో లోపించడమే ఈ అవస్థ – Human Quality లోపించడానికి ముఖ్యకారణం. వాటిని పాదుకొల్పడమే అధ్యాత్మిక లక్ష్యమూ, నిర్వచనమూను !

సాధన అనేది మానవుడు తనకోసం తానుచేయాలి. అలా ఎందుకు చేయాలంటే – ప్రస్తుత మానవుడు నైతికంగా, మానసికంగా, స్వార్థపూరితమైన పతనావస్థలో ఉన్నాడు. గనుక ధర్మం నశించడమంటే ఇదే. ఇక్కడ ధర్మమంటే జపాలు, పూజలు, అర్చనలూ ఇలాంటివికాదు.

తాను మానవునిగా ఏంచేయాలి ? ఏం చేస్తున్నాడు ? మనసు

మనమేమైనా ఉద్ధరించుకుంటున్నామా? ప్రపంచంలోని మానవ జాతికి మనమేమైనా చేయగల్గుతున్నామా? అసలు ఏమైనా చేయ గలమా? — అంతటి అవినీతికి మరికొంత చేర్చడంతప్ప! ఈ ప్రజలు మనలను మనలనుగా ప్రశ్నించుకొంటే వచ్చే సమా ధానమే — ధర్మాన్ని తెలియజేస్తుంది. అందుచేత స్వార్థానికి మించినదీ, అతీతమైనదీ ఏదైతే ఉందో అదే ధర్మము. ఇదినశిస్తే, అంటే స్వార్థంతప్ప, అంతకు మించినదేదీ తట్టక పోవడమే ధర్మం నశించడం అంటే! ఆ స్వార్థానికి పైగా ఆలోచించినవారే ధర్మం గురించి ఆలోచించిన వాళ్ళవుతారు. ఆ స్వార్థచింతనలేని కారణం గానే మేధావులకీ, మంచివాళ్ళకీ కష్టాలు, బాధలు కల్గుతుంటాయి. వారిలో చీకటి (స్వార్థం) శాతం తగ్గి, వెలుగు (జ్ఞానం) శాతం పెర గడమే దీనికీ కారణం. స్వార్థానికి మించి ఆలోచించనినాడు సమా జానికి ఏమేలూ జరగదు. ఈ స్వార్థంలేని ఆలోచన మతంకోసం కాదు, దేవునికోసమూ కాదు! ఎవరికివారే చేయవచ్చు! చేయాలి. అప్పుడే ఈ సంఘం బాగుపడేది.

వ్యాపారం విషయము చూస్తే Good Will & Integrity అనేవి ఉంటాయి. విదేశీయులు వ్యాపారం విషయములో చాలా చక్కని నియమాలు, క్రమశిక్షణ పాటిస్తారు. ప్రపంచ మార్కె ట్‌లో నిలిచేలా మాట తప్పని విధంగా వ్యవహరిస్తారు. మన వ్యాపా రములో విదేశీయులు కోరిన తేయాకు, పొగాకు బేళ్ళలో బండరాళ్లు వస్తూంటే Orders cancel చేసుకొన్న సంఘటనలు ఎన్నో

ఉన్నాయి. అందుచేత వ్యాపారరంగంలో నిలబడాలంటేనే అంతగా Principles, నైతిక విలువలు ఉండాలంటే – మరి ఆధ్యాత్మికతలో మరెంతగా కావాలో ఆలోచించండి! ప్రజలకు శాంతి, ఆరోగ్యం, ఐశ్వర్యం, సుఖం – ఇలాంటివి కావాలంటే — న్యాయం పాటింపబడాలి. సత్యమే ధర్మం కావాలి. అలాంటి ధర్మాల్ని ఆశ్రయించినపుడే వ్యవస్థ కుదుట పడుతుంది. బోధనలనేవి కొంత వరకే ప్రయోజనాన్నిస్తాయి. మనకి లాభం కల్గుతుందనే ఉద్దేశంతోనైనా ధర్మాన్ని, న్యాయాన్ని పాటించాలి. ధర్మం, సత్యం – ఇల్లాంటివి కేవలం సాధకులకు మాత్రమేకాదు. సమాజంలోని అందరూ పాటించవలసిన కనీస ధర్మాలివి. అందుకనే "అభ్యుదయాని శ్రేయసః" అని చెప్పబడింది. ఆ కనీస ధర్మమిపుడు మరుగున పడిపోయింది. అదే ధర్మచ్యుతి. భగవద్గీతలో చెప్పబడింది కూడా యిదే! ఇది అర్థం చేసుకోకుండా భగవద్గీత నెన్నిసార్లు చదివినా, ఎన్నివిధాలుగా వ్యాఖ్యానించినా ప్రయోజనం లేదు.

పదిమందికీ మేలు జరగాలి. అలా జరిగేది ఏదయినాసరే, ఏ ఋజమైనా సరే ఆచరణలోకి రావాలి. ఊరికేనినాదాలుగా ఇస్తే ఫలితాలురావు. మనిషికీ మనిషికీ వ్యవహారంలో సత్యం నశిస్తే ఒకరి నొకరు మోసగించుకుంటున్నారన్నమాట! చివరికి యిద్దరూ మోసపోతున్నామనే జ్ఞానం కలగడం లేదు. అదే కలి వైపరీత్యం!

"హస్తా హస్తేన పరివృషేత్" – అనేది కవి లక్షణంగా చెప్ప బడింది. కుడిచేయి ఎడమచేయిని, ఎడమచేయి కుడిచేతిని మోసం చేస్తుంది అని అర్థం.

ఇప్పుడు యుగం మారింది. ఈ పరిస్థితులు పోయి సత్య యుగం రాకకు నాంది పలకడం జరిగింది. మానవుల ఆలోచనలలో మార్పులు రావాలి. ప్రపంచం బాగుపడాలి. ఎందుకీ ప్రపంచం బాగు పడాలంటే – ఈ ప్రపంచం మనది, ఇది మన కోసం కాబట్టి ! దూరదృష్టితో చూస్తే స్వార్థం కోరినా సరే – Quality ఉండాలి. ఈ Quality అనేది వ్యాపార సూత్రం గాదు, ఆధ్యాత్మిక సత్యం ! ప్రపంచమూ, ఆధ్యాత్మికతా అనేవి – తుదకు వ్యాపారం కూడా సత్యంమీద, Quality మీద ఆధారపడి ఉన్నాయి. ఆ ఆధారమే తీసేస్తే ? ? ?

భగవద్గీతలో "యోగః సుకౌశలం" అని చెప్పబడింది. ఆచ రణాత్మకంగా యోగశాస్త్రాలలో ఏదైతే చూపబడి, చెప్పబడిందో అది విదేశీయులు ఆచరణలో చూపిస్తున్నారు ! అందుచేతనే అంతగా అభివృద్ధి పొందుతున్నారు. విదేశీవస్తువుల కెందుకు విలువనిస్తున్నాం ? Quality ని బట్టిగదా ! ఆ Quality ని మనమే ఎందుకు పోషించకూడదు ? మనం యోగంలోని విష యాలు వల్లిస్తున్నాము – వారు ఆచరిస్తున్నారు – అదీతేడా! ఈ ధర్మం అనేది ఆచరణలోకి వచ్చేంతవరకూ మనకు ఇప్పుడున్న

బాధలు ఏవీతప్పవు. ఈ శతాబ్దపు ప్రశ్నేయిది ! It is the Question of Questions !

ఆచరణలో ఎన్ని Rules మారుస్తున్నామో అన్నిటికన్ని రెట్లు అడ్డుదారు లొస్తున్నాయి. బాహ్యంగా Rules యొక్క రూపాలు మారిస్తే ఏమిటి ప్రయోజనం ? వ్యక్తులు మారాలి, వారి చర్యలు మారాలి ! ! అమలుపరిచే వారిలో మార్పులు రావాలి! ఆ మార్పులు రాకపోతే ఏమీ ప్రయోజనం లేదు. వ్యక్తి తాను ఎలా మారాలి ? Higher Quality ఉన్న వానిగా పెరగాలి. సామాన్యుని నుండి ఉత్తముని సాధించడమే సాధన ! Place Claims Country అనే విషయం గమనించాలి !

వ్యక్తి తనను తాను మార్చుకోవాలి. ఆ మార్పుకోసం చేసే యత్నమే సాధన ! action & reaction అనేవి ప్రతి దానికీ ఉంటాయి. ఒక విషయం గమనించండి; నీవు ఒక వ్యక్తికి ఒక మేలుచేస్తే తిరిగి నీ వొక మేలును పొందగలవు. అదేమేలు సమాజానికి చేస్తే ఆ మేలు నీకు నూరింతలై కనిపిస్తుంది. అదే గనుక నిస్వార్థంగా చేస్తే వేయింతలై ప్రవర్ధిల్లుతుంది ! నీవు ఎదుటి వానిలో ఏదిచూస్తావో వారు అదే నీలోనూ చూస్తారు. స్వార్థంతో చేసింది $1+1=2$ అవుతుంది. సమాజానికి $1 \times 100$ అవుతుంది నిస్వార్థందా చేసింది $1 \times 1000$ అవుతోంది ! ఇదే action & reactionను మన నిజజీవితంలో కూడా పరిశీలిస్తే తెలుస్తుంది !

స్వార్థంతో కూడిన ధర్మమైనాసరే మార్పు తీసుకు రాగలుగుతుంది. కాని యుద్ధాలు, శిక్షలు, జైళ్ళు, ఎమర్జన్సీల వంటివి ఎన్నున్నా – అవన్నీ ప్రయోజనం లేనివే! అందుచేతనే అధ్యాత్మికంగా ప్రయోజనం లేదు.

వ్యక్తిని బాగుచేస్తేనే కలియుగం పోతుంది. ఇప్పుడు సత్యయుగారంభం అయింది. కాబట్టి అనేకుల అధ్యాత్మిక కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. ఎందరో సిద్ధపురుషులు, సిద్ధగురువులు, అవతార పురుషులు ఇపుడు ఈ ప్రపంచంలో పని చేస్తున్నారు. ఈ తరుణంలో మీరు పాతికపాలు (1/4) చేస్తే తక్కినది (3/4) వారు చేస్తారు. ప్రయత్నమే మీది. ఆచరణలోకి తెచ్చి సఫలం చేసే బాధ్యతను వారు తమ తలలమీది కెత్తుకున్నారు. ఇపుడున్న మహనీయులందరూ మానవజాతి నుద్ధరించడానికి శాయశక్తులా కృషి చేస్తున్నారు. వారి దివ్యశక్తులన్నీ మీకై ధారపోయడానికి సిద్ధముగా ఉన్నారు.

దైవత్వాన్ని చూసేవాడు అవతార పురుషుడు. మానవునిలోని మాధవుని చూసేవాడు మహనీయుడు. మహాత్ముడు. మహనీయులు, మహాత్ములు, అవతారపురుషులు కాలగతిని బట్టి వస్తారు. ప్రపంచ పరిస్థితిని బట్టి వస్తారు. యుగధర్మాన్ని బట్టి అవతారాలు, స్వరూపాలు మారుతుంటాయి ఏ అవతారం రావడానికయినా Prinicples ఒకటే! జీవితాలను క్రమబద్ధం చేయడం అవతారంయొక్క ప్రధానాశయమై ఉంటుంది. ఈ రహస్యాన్ని భగవద్గీతలో శ్రీకృష్ణుడిలా వివరించాడు.

యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత !

అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం ॥

ఇపుడొక విషయం మీరు గమనించాలి ! మనం చేసే, చేస్తున్న కృషి జగన్నిర్మాణానికి మనం చేస్తున్నా మనే విషయం ఎప్పుడూ గుర్తుంచుకోవాలి.

కృషికి, సాధనకి కొన్ని మూలసూత్రాలున్నాయి. ముందు ఆ సూత్రాలను తెలుసుకోవాలి. మనస్సుని శరీరాన్ని ప్రభావితం చేసేది ఆహారం. ఆహారపదార్థాలు – మానసికోద్రేకాలు పెంచేవి కొన్ని, తగ్గించేవి కొన్ని ఉంటాయి. అందుచేత రుచినిబట్టి, అల వాటునిబట్టి గాక, అవసరాన్ని బట్టి తినాలి. ఆ పదార్థంయొక్క పరిమాణాన్ని బట్టికూడా ప్రభావం మారుతూంటుంది ఉపవాసం, అపక్వాహారం, ఆహార నియమం – వీటివల్ల కలిగే భేదాలు గమ నించాలి. రోగాలు ఎందుకు వస్తాయి ? కాస్త గమనిస్తే, అవి మనం తీసుకొనే ఆహారంవల్ల, మనం చేసే మంచి, చెడు పనుల వల్ల కలుగుతుంటాయని, తెలుస్తుంది. అలవాట్లు మార్చుకో కుండా కేవలం మందులవల్ల ఏరోగమూ నయం కాదుగదా! దానినే మనవాళ్ళు పథ్యమని అన్నారు.

ఒకరు నన్ను దారిద్ర్యం విషయంలోను, ధనార్జన విషయం లోనూ, కొన్ని ప్రశ్నలువేస్తే నేను పరిశీలించి, ఆయా వ్యక్తుల అలవాట్లు మంచివి కాకపోవడంవల్ల, అలాజరుగుతుందని చెప్పాను,

ఆ అలవాట్లు మంచివి కాకపోవడం వల్లనే వారలా అయారనిబుజువయింది తరువాత ! అలాగే అగ్ని మాంద్యంతు కారణంగా ఆయుర్వేద గ్రంథాలలో – ఇతరుల సొత్తులను అపహరించిన వారికి రోగం కల్గుతుందనీ, నివారణకై దానాలు చేయాలనీ చెబుతున్నాయి. అందుచేత మన స్థితికి కారణం మనఅలవాట్లు, మనంచేసిన చేస్తున్న పనులేననే విషయం ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. అలవాట్లను' సాధనా సూత్రాలను గమనించని సాధన వృధా అవుతుంది.

మీరందరూ జాతకం అనేది వినేఉన్నారు కాదా ! జాతకం అంటే ఏమిటి ? అది జీవితానికి Opening Account అన్న మాట ! మరణసమయంలోని గ్రహస్థితులు Closing Balance అన్నమాట ! అది తరువాత జాతకాన్ని, జీవితాన్ని తెలియజేస్తుంది. జాతకం అనేదొక Balance Sheet. చాలామంది జాతకం బాగుండలేదు అనో, గ్రహాలు పీడిస్తున్నాయనో అంటారు. "పరాశర సంహిత" ఏగ్రహమూ పుణ్యాన్నిగానీ పాపాన్నిగానీ, శుభాన్నిగానీ, అశుభాన్నిగానీ ఈయదని చెబుతోంది. వాళ్ళు శుభాశుభ కర్మల పరిపాక ఫలితాన్నిస్తారు అంటూంది. అంటేశని పాపాన్ని ఈయడు, పాపకర్మ పరిపాక ఫలితాన్ని ఇస్తాడు. అంటే ఉదాహరణకి Bank లో నీకొక account ఉంది. డబ్బు కావాలంటే Clerks form పూర్తిచేసి యిస్తావు. ఆ గుమస్తా డబ్బిస్తాడు. నీకు డబ్బు యిచ్చే గుమాస్తా లాటివాడు ఆ గ్రహం ! అయిచ్చే సొమ్ము నీదే కదా ! అలాగే నీవుచేసిన సత్, దుష్ కర్మల ఫలితాన్ని ఆ Clerk

లాగ యివ్వడం మినహాగా వారు దేనికీ కారకులు కాదు ! ఆ dutyలో ఉన్నClerk లాంటివారు కర్తనీవేగాని వారుకాదు. వాళ్లు! రకరకాల కర్మలు – రకరకాల పద్దులు – నవగ్రహాలు కదా ! అందుచేత వాళ్ళు, Accounts వాళ్ళ బాళ్ళ టైము వచ్చినపుడు ఇస్తారు. Tape recorder చూశారా ? ఏవి, ఎలా tape చేశామో అవి అలాగే వస్తాయి. ఆ క్రమంలోనే వస్తాయి. ఆ క్రమంఏదో పట్టుకొనేవిధానమే జాతకమూ, దశలూ, అంతర్దశలూ – ఇవన్నీను.

మనం మనకువచ్చే ఆలోచనలను గమనిస్తూ ఉండాలి! ఆ ఆలోచనలవలన కలిగే ఫలితాలను పరిశీలించాలి దురాలోచనల ప్రభావం – మనస్సుమీదనే గాక, శరీరం మీద, మీ, మీ ఆధ్యాత్మిక సాధనలమీద, ఇంకా లోతుగా పరిశీలిస్తే ప్రపంచంమీదనే పడుతూంటుంది. అలాగే అలవాట్లను కూడా పరిశీలించుకుంటూ ఉండాలి. ఈ అలవాటు అనేది – మనం ఏదయితే కూడదని అనుకుంటామో, దానిని, మనకు తెలియకుండానే మనచేత చేయిస్తుంది. శాంతి వహించాలను కుంటాడు ఆంతలోనే తెలియకుండానే కోపం వచ్చేస్తుంది. ఏది మానాలనుకుంటాడో అదే చేసి వస్తాడు. ఎన్నో అలవాట్లు ఏమీ తెలియని అజ్ఞానదశయైన బాల్యంలో, కరిగిన సిమెంటులోవలె ఏర్పడిపోతాయి. అందుచేత మన పిల్లలకు అలవాట్లు ఏర్పడే కాలంలోనే సరియైన రూపమివ్వాలి. శరీరం తేలికగ సుఖానికి అలవాటు పడుతుంది. మనసుకూడా ఎన్నింటికో తెలియ

కుండా అలవాటుపడిపోతుంది. మంచి ఆలోచన వస్తేనే భయపడే స్థితికి దిగజారిపోతుంది – ఆ మంచి దానితీవ్రతకు తట్టుకోలేనంతగా కుళ్ళిపోయిందన్నమాట అది. అందుచేత అలవాట్లని, ఆలోచనలని ముందు బాగా పరిశీలించాలి. ఆ పరిశీలనలోంచి ముందు శ్రద్ధగా తను duty చేయటం రావాలి. ఆ dutyని Sincere గా చేయడం రావాలి. విద్యుక్తధర్మాన్ని ఆచరించడమే సాధన, సాధన మీరు చేయాల్సినదేగాని, భగవంతుడు చేసేదేమీలేదు! భగవంతుని మీద వేయడం ఎంత పొరబాటో ఇప్పుడొకసారి ఆలోచించండి మరి!

యోగమిత్రులందరూ 'నిత్యజీవితంలో యోగసాధన' పుస్తకం రోజుకొక అధ్యాయం చదవండి. ఏరోజు చదివిన దానికారోజున దాని కనుగుణంగా నడుచుకునేలా యత్నించండి. ముందు ఆలోచనలంటే ఏమిటో తెలుసుకొనండి. వాటిని Trace చేయాలి. వాటిలో పనికిరాని వాటిని Eliminate చేయాలి. వాటిని మనసు లోంచి మనసుతోనే తీసెయ్యాలి.

కర్మ మనసుతో చేయకూడదు. మనసుతో చేసినవే కర్మలై ఫలితాన్నిస్తాయి. అందుచేత "యోగః చిత్తవృత్తి నిరోధకః" అని యోగశాస్త్రం చెబుతూంది. వచ్చినది, వచ్చేది అంతా మనసుతోనే. మన చర్యలూ, మాటలూ చాలాజాగ్రత్తగా ఉండేవిగా చూచుకోవాలి! మహాత్ములు యిచ్చేశక్తిని మరింత జాగ్రత్తగా వాడుకోవాలి! మీ గురువులు కూడా మీ కర్మల ఫలాన్ననుభవించాల్సి

ఉంటుంది. కాబట్టి ఎంతో జాగ్రత్తగా ఉండాలి ! నిత్యం మీకు అధ్యయనం (కేవలం చదివి పారెయ్యటం కాదు. మననం చెయ్యటమూ, రోజూ ఆచరించటమూ) చెయ్యటానికి నిత్యజీవితంలో యోగసాధన తర్వాత 'పాఠ్యగ్రంథం'గా ఈ "సాధనారహస్యాలు" యిస్తున్నాము. భక్తితో అందుకోండి. నిత్యం చదవండి. ఇందులో భగవద్గీత, ఉపనిషత్తులు, సంస్కృత భాగవతంయొక్క సందేశము యిచ్చాను సరళమైన తెలుగులో మనస్సుకు పట్టించుకోండి !

మీ కందరకు ఈ శుభసమయంలో – నిస్వార్థసేవలో మీ జీవితాలు తరించాలని, మీ జీవిత పుష్పాలు నూతనసౌరభాలతో వికసించాలని ఆశీర్వదిస్తూ మంగళా శాసనాలిస్తున్నాను.

ప్రజోత్పత్తి ఉగాది,
హైద్రాబాదు,
17–3–1991.

వేదవ్యాస

—o—

**1**

# జన్మ లక్ష్యము - ఆత్మసాక్షాత్కారం

ఈనాడు ప్రపంచమతాలు (World Relegions) ముఖ్యంగా నాలుగు! బౌద్ధమతము, పార్సీమతము. క్రీస్తుమతము. ఇస్లాము. ఈ నాలుగు మతాలూ పుట్టక ముందుకాలంలో ఉండేది. "మతం" కాదు! జ్ఞానం!! అందుకనే దానికి ఒక ప్రత్యేకమైన "మతము" అన్న పేరులేదు. ఈనాడు దానిని మనం "అధ్యాత్మిక విజ్ఞానము" అనిచెప్పుకోవచ్చు ?

ఎందువల్లనంటే, ఈనాడు "మతాలుగా" చలామణీ అవుతున్న వన్నీ ఒక "ప్రవక్త" (Prophet) యొక్క జననం తరువాత అతడి పేరుమీద ఏర్పడినవే - గౌతమబుద్ధుడు, జొరాష్టరు (Zorastar) క్రీస్తు, మహమ్మదు [వంటి ప్రవక్తల వ్యక్తిత్వాన్ని అధారం చేసుకొని - వారిపేరున ప్రపంచంలో ప్రచారం కాబడినవే ఈనాలుగు మతాలూ!

కాని, వేదమతం మాత్రం అలాగా ఒక వ్యక్తి జన్మతో ప్రారంభించినది కాదు. దీనికి ఒక ప్రత్యేకమైన పేరు లేదు. "హిందూమతం" అని ఈనాడు దీనికి పెట్టిన పేరుకూడ విదేశీయులు తగిలించిన పేరుమాత్రమే! సింధునదిని దాటి భారతదేశంలో ప్రవేశించి దీన్ని— "సింధుదేశము" అన్న పేరు ఉచ్చారణ

దోషంవల్ల హిందూదేశంగా మార్చి, ఆ దేశంలో ఉన్న మతం కాబట్టి హిందూమతంగా విదేశీయులు పెట్టిన పేరే ఇవి.

అందుకే వేదంలోను, ఉపనిషత్తులలోనూ, భగవద్గీతలోనూ కూడా ఎక్కడా ఇది ఫలానా మతం అన్నపేరుకూడా కనబడదు. అంతేకాదు. ఇతర మతాలలో కనిపించే మతం లక్షణాలు హిందూ మతానికి కనిపించవు, అవి ఏవంటే -

1. ఈ మతం పుట్టిన ఫలానా కాలం అనీ, సంవత్సరము అనీ లేక పోవటం.

2. ఒక మతగ్రంథము (Single Religious Book)

3. ఈమతంలోకి "మార్పిడి" (Conversion)

4. ఇతర మతాలను తననుంచి వేరుగా చూడటం.

పై నాలుగు అంశాలూ హిందూమతంలో కనిపించవు : ఎందు కంటే ఇది ఏ ఒక్క ప్రవక్తాపుట్టినప్పటి నుంచీ ప్రారంభించిన మతం కాదు. హిందూమతానికి ఒక 'మతస్థాపకుడు' (Founder) లేడు ! ఇది ఈ సనాతనమతంలోని విచిత్రం. అవతార పురుషులైన రాముడు, శ్రీకృష్ణుడు కూడా హిందూమతాన్ని స్థాపించామని చెప్ప లేదు. వారు జన్మించే సరికే కొన్నివేల సంవత్సరాలుగా "ఈ సనాతనధర్మం" - నెలకొని ఉన్నది. అందువల్లనె హిందూమతం ఈనాటి ప్రపంచమతాల దృష్ట్యా చూస్తే నిజానికి 'మతం' కాదు. అందుకనే ఇతరులని హిందూమతంలోకి మార్చడం ఎలాగ అన్న విధానం—

వేదాలలో ఎక్కడా వ్రాసిలేదు! ఇతర మతాలన్నింటిలోనూ ఇతరులను తమ మతంలోకి చేర్చుకోవడం కోసం పద్ధతులు చెప్పబడి ఉన్నాయి! ఇలా 'హిందూ' మతంలోకి మార్పిడిచేసుకునే పద్ధతి వేదాల్లోకానీ, పురాణాల్లోకానీ, ఉపనిషత్తులలోకానీ లేకపోవడం విశేషం. ఇలా ఈనాడు భూమ్మీద ఇంకొక మతమేదిలేదు! అందుకే వేదమతం విలక్షణమైంది. ప్రపంచమంతటా మానవజాతి ఒక్క కుటుంబంగా **(Single Family)**గా అనుసరిస్తూ వచ్చిన ఆధ్యాత్మికసత్యాల సమగ్ర స్వరూపమే ఈనాటి హిందూమతం. ఇది 'హిందూమతం' అనడంకన్న, 'సనాతనధర్మం' అనికానీ లేక 'ఆధ్యాత్మికవిజ్ఞానం' అనిగానీ చెప్పడం నిజానికి ఎక్కువదగ్గరగా ఉంటుంది. ఎందుకంటే మతంలోకి మార్పిడి ఉంటుంది. కానీ ఒక విజ్ఞానంలోకి 'మార్పిడి' **(Conversion)** ఉండదు. ఒక వ్యక్తి ఒక సత్యాన్ని గ్రహించినపుడు అతనికి జ్ఞానోదయం **(Realisation)** అవుతుంది. అపుడతనికి కలిగే జ్ఞానమే – ఆధ్యాత్మిక విజ్ఞానము.

## ఆధ్యాత్మిక విజ్ఞానము :-

"ఆధ్యాత్మిక విజ్ఞానం" అంటే ప్రపంచంలో ఎవరైనా, ఏకాలంలోనైనా, ఏదేశంలోనైనాసరే ఒకే విధంగా దర్శించే "శాశ్వత సత్యం" అనిఅర్థం! ఇది పుస్తకాలలోని విజ్ఞానం కాదు.

మనిషి మానసికంగానూ, ఆత్మలోనూ పరిణతి పొందినపుడు అతనికి సహజంగా గోచరించే జ్ఞానమే ఆధ్యాత్మిక విజ్ఞానము. దీనిని మతం మార్పిడిలాగా ఇంకొకరు బయట నుంచి తగిలించే బురఖా కాదు. మామిడికాయ పండి రంగూ, రుచీ మారినట్లు వ్యక్తియొక్క

అనుభవం పండి జ్ఞానంగా ఫలించటమే ఈ ఆధ్యాత్మిక విజ్ఞానం యొక్క స్వభావం.

అయితే ఈ "ఆధ్యాత్మిక విజ్ఞానం" దేనికి సంబంధించినది? అదిమన వ్యవహారిక జగత్తునకు (Mundane World) సంబంధించినది కాదు. అంటే మన నిత్యజీవితంలో సంపాదించుకునే తిండీ, బట్టా, ఇల్లూ, సంసారం, పిల్లలూ, వంటి అవసరాలకు సంబంధించిన జ్ఞానం కాదది. దీనికి సంబంధించినది "లౌకికమైన తెలివి"- ఇది మనిషికి జీవితమే నేర్పుతుంది. జంతువులు కూడా సహజంగానే వేటాడటం, ఆహారం, సంతానం వంటివి సంపాదించుకోటం చేస్తున్నాయి. మానవుడి శారీరక జీవితంకూడా ఈ జంతువుల కన్న ఏమీ వేరుకాదు. అందుకని ఆధ్యాత్మిక విజ్ఞానము ఈ శరీరానికి సంబంధించిన జ్ఞానంకాదు.

## కంటికి కనిపించని "తాను" :

పైకి కనిపించే ఈ శరీరం లోపల పైకి కనిపించని వ్యక్తిత్వం ఒకటి ఉన్నదని ప్రాచీన మహర్షులు తమ అనుభవం ఆధారంగా గ్రహించారు.

ఈ శరీరంలో ఉన్న వ్యక్తిత్వానికి "తాను" అన్నభావం ఉంటుంది దీనికి "ఆత్మ" అని పేరు పెట్టారు. 'ఆత్మ' అనే సంస్కృతపదానికి - తాను అని అర్థం. మనిషికి ఒక వ్యక్తిత్వం ఈ శరీరంలోపల కంటికి కనిపించకుండా అదృశ్యంగా ఉండి శరీరంలోనుంచి ఎలా పనిచేస్తున్నదొ - సరిగ్గా అలాగే ఈ పైకి కనిపించే

భౌతిక ప్రపంచం వెనకాలకూడా - ఒకమహత్తరమైన "తాను" (Personality) నిలిచి ఉన్నదని వేదకాలపు ఋషులు కనుగొన్నారు. దీనికికూడా 'ఆత్మ' అనే పేరు!

అయితే శరీరంలో వ్యక్తిగా జీవించే 'ఆత్మ' వేరు, ఈ ప్రపంచం అంతా వ్యాపించి కంటికి కనిపించకుండా పనిచేసే గాలి వంటి 'విశ్వాత్మ' వేరు. ఒకటి నీటిబిందువు – ఇంకొకటి నీటి సముద్రం వంటివి!

పరిమితమైన 'తాను'కు 'జీవాత్మ' అనిపేరు. అమితమై ప్రపంచమంతా వ్యాపించి ఉండే వ్యక్తిత్వానికి 'జగదాత్మ' లేక విశ్వాత్మ లేదా "బ్రహ్మ" అని పేరు.

## లోపలి గమనికయే సాధన :

యోగసాధకుడు బయట జరిగే వస్తువులను గమనించినట్లే తనలో జరిగే 'మార్పులు' గమనించినట్లయితే ఈపైకి కనిపించే – పదార్థ శరీరం లోపల క్షణానికి వెయ్యిరంగులు మారుతూ లోపలి 'మనస్సు' లేక తన "వ్యక్తిత్వం" పనిచేస్తూ ఉంటుంది. ఇలా బయటివైపుకు అన్ని వస్తువుల వైపు పరుగెత్తే మనస్సును ఒక్క వస్తువుమీద కేంద్రీకరించి లోపలికి చూడటం అలవాటు చేస్తే ఈ ఆధ్యాత్మిక విజ్ఞానం కలుగుతుంది. దీనినే "అంతర్ముఖత్వం" అంటారు.

లోపలి విషయాలను గురించిన జ్ఞానమే అధ్యాత్మిక జ్ఞానము. మనస్సును లోపలికి త్రిప్పి అంతర్ముఖుడై తనను తాను దర్శించితే

మెట్లు మెట్లుగా అనేక విషయాలు యోగికి గోచరమవుతాయి! ఇలా గోచరించే విషయాలు యేమిటో ఇక్కడ మనం సూచనగా పరిశీలిస్తే ఈ 'అధ్యాత్మిక విజ్ఞానము' యొక్క స్వరూపం యేమిటో క్లుప్తంగా తెలుస్తుంది. ఇలా తనలో కనబడే వాటిని ఈక్రింద పేర్కొందాము.

(1) ఇంద్రియములు :- మన మనస్సు బయట ప్రపంచం లోకి ప్రసరించాలంటే-కన్ను, ముక్కు, చెవివంటి 'ఇంద్రియాల' ద్వారానే ప్రసరించాలి. ఈ ఇంద్రియాలు శరీరానికి కిటికీల వంటివి.

ఒక ఇంటిలో వెలుగుతున్న దీపంయొక్క వెలుగు కిటికీల ద్వారా బయటికి ప్రసరించినట్లే, మన శరీరంలో ఉన్న ఈ 'మనస్సు' – ఇంద్రియాలద్వారానే బయటికి పనిచేస్తుంది! ఈ మనస్సు వెనకగావుండి, ఆలోచనలు గమనించే 'చిత్తం' ఉన్నది. ఈ చిత్తము యొక్క స్వరూపము చిదాకాశం = చిత్ + అవ కాశము' అంటే మన మనస్సులోకి చూచినపుడు కనిపించే 'ఆకాశం' ఇది! అంటే టెలివిజనులోని బొమ్మలుపడే అద్దంవంటి 'దర్పణం' ఈ చిత్తము! సినిమా తెరలాగ దానిపైన మెదిలే ఆలోచనలు – తెరమీద బొమ్మలులాగ కదులుతూ ఉంటాయి: ఇలా కదిలే బొమ్మలతో ఆడుకుంటూనే, ఈ మనస్సు జీవితకాలం అంతా వ్యర్థంగా గడిపేస్తుంది.

2) మనస్సూ – బుద్ధీ : ధ్యానం ద్వారా మనస్సును గమనిస్తూ వెడితే, మనస్సుకు పైన ఉన్న 'బుద్ధి' గోచరిస్తుంది. కేవలం ఆలోచనలువచ్చేది మనస్సునుండి, మనస్సును గమనించేది బుద్ధి, 'ఇది నా మనస్సు' అని ఆలోచించేది ఎవరు ?

కన్ను కన్నును చూడలేనట్లు – మనస్సుతో మనస్సును దర్శించటం సాధ్యం కాదు. బుద్ధిద్వారానే మనస్సును ధ్యానించటం సాధ్యం.

3) అహంకారం లేక జీవుడు :– ఈ బుద్ధి వెనకాతల మన కోరికలను, ఇష్టాలనూ అనుభవించేది 'జీవుడు.'

ఈ జీవుడు ఆలోచనలు, కోరికలు, సంస్కారాలు, వాసనలు అన్న ముసుగులతో కప్పబడి – అపుడు మాత్రం అహంకారంగానే దర్శనమిస్తాడు. ఈ అహంకారమే తర్వాత 'ఆత్మగా' వెలిగి సాక్షాత్కార మిస్తుంది.

4) ఆత్మ :– ఆలోచనలు గమనిస్తే మనస్సు అంతర్ముఖం అవుతుంది. అపుడు ఆత్మయొక్క స్వరూపం కనిపిస్తుంది. అంటే మనస్సు వెనుకకు పనిచేస్తుంది. అంటే మనిషికి లోపలినుంచి బయటకి - పనిచేసే మనస్సు, యోగికి - 'బయటినుంచి లోపలికి' (అంతర్ముఖత్వం) పనిచేస్తుంది.

అపుడు మనస్సు కాలంలో వెనక్కు ప్రయాణిస్తుంది. కాలంలో ముందుకు ప్రయాణిస్తే భవిష్యత్తూ (Future) - అదే మనస్సు కాలంలో వెనక్కి ప్రయాణిస్తే మనయొక్క గతజన్మలూ (Past) గోచరిస్తాయి; అపుడే ఈ జన్మలో అనుభవించే కష్ట సుఖాలకు కారణమయిన గతజన్మలోని "కర్మ" ఏ విధంగా ఈ జీవితంలోని సుఖదుఃఖాలను కలిగిస్తున్నదో ప్రత్యక్షంగా అర్థ మవుతుంది.

## దివ్యదృష్టి :

ఇంకా ఈ అంతర్ముఖమైన యోగదృష్టితో చూస్తే లభించే "ఆధ్యాత్మిక విజ్ఞానం"లో ముఖ్యమైన అంశాలు :—

1) ఈ ప్రపంచంయొక్క పుట్టుక, గతంలో జరిగిన చరిత్ర-టెలివిజన్‌లో లాగ బొమ్మలతో కనిపిస్తుంది.

2) ఇపుడు జరుగుతున్న కర్మయొక్క "భవిష్యత్ఫలితాలు" –రానున్న భవిష్యత్తుగానూ, ముందు జన్మలుగానూ గోచరిస్తాయి! ఇది రానున్న కర్మ!

ఇలా గడచిన కర్మ యావత్తూ ఖర్చు అయిపోయినపుడు ఇన్ని జన్మలూ ఎత్తిన "ఆత్మ" స్వరూపం గోచరిస్తుంది.

ఈ "ఆత్మ" స్వరూపం ఎలా ఉంటుంది ? ఇది వేయి సూర్యులతో సమానమైన తెల్లని కాంతి కలిగి దిక్కులు నిండించే ప్రకాశంవలె గోచరమవుతుంది. అన్ని వస్తువులను చూడటంవేరు. ఈ ఆత్మను చూడటంవేరు; ఈవిధానం చాలా చిత్రంగా ఉంటుంది.

## అంతా తానై చూసే దృష్టి :

అన్ని వస్తువులను మనంవేరుగా ఉండిచూస్తాము (బయటికి చూచే చూపుతో బాహ్యదృష్టితో). కాని ఆత్మను దర్శించేటపుడు మనమే తానైచూస్తాము. అంటే అనుభవంతో చూస్తాము! అనుభవమే తానై; చూచేదీ, చూడబడేది ఒకటై ఈ కనిపించే విశ్వమే తానై - చూచేవాడు వేరే లేక - చూచే పద్ధతియే ఆత్మ సాక్షాత్కారంలోని సొగసు.

## మాయ :

ఈ ఆత్మను జన్మ పరంపరలో కట్టివేసేది, కాలంతో బంధించేది, శరీరంలో ప్రవేశపెట్టేది "మాయ" అనబడే ఒక విచిత్రమైన శక్తి !!

ఈ మాయ దాని ప్రభావాన్ని మనపై ముఖ్యంగా ఆరువిధాలుగా చూపెడుతుంది.

1. కోరిక
2. భయము
3. అసహ్యము
4. దుఃఖము
5. సుఖభోగము
6. మృత్యువు.

ఈ ఆరు భావనలు (పశుభావాలు; ఆరు శతృవులు) అంతరాత్మని కట్టిపడేసి జీవుని బద్ధునిగా చేస్తున్నాయి.

## పంచకోశాలు :

ఈ మాయవల్లనే శరీరంలో చక్రాలూ, నాడులూ ఏర్పడుతున్నాయి. దీపం చుట్టూ లాంతరుగ్లాసువలే ఆత్మను చుట్టుకొని, 'సూక్ష్మశరీరము' –కారణ శరీరము, మనోమయ శరీరము, 'విజ్ఞానమయ శరీరము'– ఇలా ఉల్లిపాయలోని పొరల్లాగ ఏర్పడతాయి

వానివల్లనే జన్మపరంపరలు కలుగుతాయి. ఇవి పంచకోశాలని వేదము తెలుపుతోంది.

అనేక జన్మలలో విజ్ఞానిగా, సాధకుడిగా, ముందుకు ప్రయాణించే జీవుడు తనమనస్సు పావనం చేయబడి స్వార్థంపోయి అంతరాత్మగా నిలిచి, తన గతకర్మ నశించి ఆత్మ సాక్షాత్కారాన్ని చేరుకోగలడు. అది లేనివాడు సుడిగుండంలో చిక్కుకున్న తెప్ప లాగ గుండ్రంగా తిరుగుతూ కాలంలో చిక్కుకుని జననం, మరణం అనే సుడిలో లాగబడి భయం, బాధలు అనబడే 'నరకం' లోకి ఈడ్చుకుపోబడు తున్నాడు.

శరీరానికి జరిగే సుఖదుఃఖాలు తనకే తరుగుతున్నట్లు భయ పడతాడు. మరణిస్తున్నానని దుఃఖిస్తున్నాడు. క్రమంగా బాధలు భరించలేని తీవ్రతను పొంది. జీవితాన్ని నరకం చేస్తాయి. ఇది మోక్షానికి వ్యతిరేకమైన స్థితి. బంధము మోక్షానికి వ్యతిరేకము.

జీవించడానికి కావలసిన తెలివితేటలతోనే బ్రతుకుతూ ? ఈ జీవితానికి సంబంధించని ఆధ్యాత్మికత అనేది ఒకటి ఉంటుం దని, అది బ్రతుకుతెరువుకు సంబంధించినది కాదనిన్నీ, తానెవరో, ఎందుకు పుడుతున్నాడో అనుభవంతో తెలుసుకునే విజ్ఞానమని తెలియకపోవడమే ఈ దుర్భరకష్టాలతో నిండిన భయంకరమైన బంధస్థితి (జీవుడు బద్ధుడు), జీవిత లక్ష్యం గురించి యోచనలేని వారికి ఈ నరకం తప్పదు.

## జీవిత లక్ష్యం :

'జీవిత లక్ష్యం' అంటే మనం పెట్టుకున్న లక్ష్యం అని కాదు అర్థం! మనం ఏర్పాటు చేసుకున్న లక్ష్యం, ఉద్యోగం, చదువూ, తిండి ఈ శరీరానికి సంబంధించినవి. అసలు జీవితలక్ష్యం అంటే ఈ శరీరంలోపల, మన వెనుక, బుద్ధికిపైన అంతరాత్మ ఎలావెలుగు తున్నదో తెలుసుకోవడం!! ఇది తానై అనుభవంలో ఐక్యభావం పొంది చూసేది, తానై చూసే అమృతానుభవము ఇది.

అతిసూక్ష్మంగా, అతిక్లుప్తంగా ఆధ్యాత్మిక విజ్ఞానం గురించి చెప్పాలంటే దీనిలో వివరాలు, విశేషాలు శాఖలుగా విస్తరించి ఉన్నాయి. ఈ ఆత్మజ్ఞానం యొక్క వ్యాప్తియే ఆధ్యాత్మిక విజ్ఞానం! దాన్ని గురించి తెలిపేదే సనాతన ధర్మం. వేదకాల ఋషులు అనుభవంతో దర్శించిన జాతి, మత విభేదాలకు అతీత మైన శాశ్వతమైన "అనుభూతి" ఇదియే!.

సనాతన ధర్మమైన హిందూమతము యొక్క సందేశంఇదే!!

దీన్ని అనుభవించినవాడు విశ్వవ్యాప్తి పొందిన మానవుడవు తాడు (Universal Man). అతడు ఏ ఒక్క కాలానికి, ఏ ఒక్క దేశానికి చెందడు. మానవజాతి యావత్తు అతడి శరీరమే. ఈవిశ్వం యావత్తూ అతని వ్యక్తిత్వమే. ఇదే సనాతన ధర్మంలోని చిత్రం.



## 2

# సాధన అంటే ఏమిటి?

సాధనపైకి చేసేదికాదు. లోపల జరుగుతుంది.

ఈ సాధనకు అవసరమైనవి రెండేరెండు పరిస్థితులు. అవి సాధకునికి పైనుండి పనిచేసె దైవానుగ్రహమూ, సాధకునివైపు నుంచి పరిపూర్ణ శరణాగతి! అంటే దైవమువైపునుంచి దిగి సాధకునిపై హర్షించే అనుగ్రహ దృష్టి. దానికి సాధకుడు తనను తాను సమర్పించు కోవటం. ఈ రెండింటి సమ్మేళనమే పరిపూర్ణ సిద్ధిని ప్రసాదిస్తుంది.

## ఆత్మసమర్పణ - లేక శరణాగతి :

ఇందులో ఒకటి సాధకుని బాధ్యత - అది "శరణాగతి". శరణాగతియొక్క నిజమయిన స్వరూపం తెలియక చాలామంది అది కేవలం సాష్టాంగ నమస్కారమని, లేదా గురువుముందు శ్రద్ధతో నమస్కరించడమని గాని లేక దేవునిముందు తలవంచి భక్తితో నమస్కారం పెట్టడం మాత్రమేననీ అనుకుంటారు. కాని శరణాగతి అంత చిన్న విషయం కాదు. ఎందుకంటే అది ఒక్క నిముషంలో చేసేపని కాదు. ప్రతి నిత్యం మనస్సుతో చేస్తూండవలసిన పని. ఒక్కసారి నమస్కరించి, ఆ తరువాత మళ్ళీ తన మామూలు ఆలోచనలకు లొంగి పనిచేస్తాడు. మామూలు సాధ

కుడు. "శరణాగతి" ఆ నిమిషంలోనే పూర్తి అయిందని భావిస్తాడు. ఎందుకంటే మరుక్షణంలోనే అతని మనస్సులో తన నిజస్వరూపం మళ్ళీతల ఎత్తుతోంది. దానితో తక్కినవన్నీ మళ్ళీ మామూలే. అందుకని "శరణాగతియొక్క నిజస్వరూపం అంతర్ దృష్టితో అర్థం చేసుకోవడం సాధనకు చాలా అవసరం. అదిజాగ్రత్తగా తెలుసుకుందాం.

## దైవశక్తి-ప్రకృతిశక్తి :

ఈ ప్రపంచంలో రేండే రెండు శక్తులు పనిచేస్తూ వుంటాయి. అందులో ఒకటి పైనుండి క్రిందకు ప్రసరించే "దైవశక్తి". దీని స్వరూపము సత్యమయినదీ, సూటి అయినదీ; దాపరికానికి, ఆల స్యానికీ, చెడుకూ తావులేనటువంటిది. దీని మొదటి లక్షణం పరి పూర్ణ 'ప్రజ్ఞ' (Consciousness) లేక 'పూర్తి ఎరుక'. దాని స్వరూపము సత్యము. విశ్వమంతా వ్యాపించియుండి 'తాను' అన్న వ్యక్తిత్వము లేని ఒకసత్యము.

ఇక రెండవది బయటకు కనిపించే పదార్థమయ సంబంధ మనుకున్న 'భౌతికశక్తి' (Material Force), దీని స్వరూపమే మన స్వభావము – అనగా మనలోని వ్యక్తిగత కోరికలూ, ఇష్టా ఇష్టాలూ, ఇచ్ఛాద్వేషాలు మొదలయిన మనలో నిత్యం కనిపించే గుణాలన్నింటితో పనిచేసే ప్రకృతి! "నాది, నాకు" అనబడే మమ కారము దీనియొక్క పూర్తి స్వభావము.

ప్రపంచంలో ఏ మంచిని గ్రహించినా, అది తన కెంతవరకూ ఉపయోగిస్తుంది? లేక నాకు ఎలా ఉపయోగిస్తుంది? అన్న ప్రవృత్తిని కల్పించేది తనయొక్క ఈ ప్రకృతి స్వభావమే!

ఈ రెండింటిలోనూ ఒకటి క్రిందనుంచి పనిచేసేది ! అంటే శరీరంలోంచి (పదార్థంనుంచి) పదార్థంతో ఏర్పడిన ప్రాణం, బుద్ధి మనస్సులతో పనిచేసే – వ్యక్తిగత మనస్సు. అంతా దీని క్రిందికే వస్తుంది. దీని నంతటిని కలిపి 'ప్రాణచైతన్యం' (Vital Force) అని పిలవవచ్చు. రెండవది పైనుంచి పనిచేసే 'అనుగ్రహశక్తి' లేక 'భగవత్‌శక్తి'. ఈ రెండింటిలో సాధకుడు దేనిని ఎన్నుకుంటాడో అతని జీవితం ఆ మార్గాన్నే అనుసరిస్తుంది. జీవిత యాత్రకు అదే నాయకత్వం వహిస్తుందన్నమాట !

## ఏది ఎన్నుకుంటే - అలాగ :

తనయొక్క వ్యక్తిగత ప్రవృత్తిని పూర్తిగా విడదీసి తన స్వార్థమును వదిలివేసి. తన మనస్సులోకి, హృదయంలోకి పైనుంచి ప్రవహించి వచ్చే – దైవశక్తికి – పూర్తిగా తన స్వభావాన్ని సమర్పణ చెయ్యుటమే 'శరణాగతి' అంటే. ఇదే ఆత్మసమర్పణం అంటే !

ఇది పూర్తిగా చెయ్యటం చేతకానంతవరకూ మధ్యమధ్యలో మళ్ళీ మళ్ళీ తనయొక్క స్వభావం అడ్డుతగులుతూ పైనుంచి 'దైవానుగ్రహశక్తి'కి ఆటంకాలు కల్పిస్తూ వుంటుంది.

సాధకుడు తన స్వభావాన్ని ప్రతిక్షణం గమనించుకుంటూ ఎప్పుడు తనలో పరిపూర్ణ శరణాగతి లోపించిందో; ఎప్పుడు తన వ్యక్తిగత ఆలోచనలకూ, ఇష్టాయిష్టాలకూ, గర్వానికీ, ఈర్ష్యకూ, అసూయలకూ లొంగిపోవుట జరుగుతున్నదో, ప్రతి చిన్న విషయంలోనూ గమనించుకుంటేనేగాని ఇది సరిదిద్దుకోవటం సాధ్యంకాదు !

ఇలా తన జీవితంలోని తన స్వభావం పూర్తిగా లొంగిపోయి శాంతించి 'దైవానుగ్రహానికి' పూర్తిగా లోబడేవరకూ సాధకుడు తీవ్రమైన కృషిచేస్తేనేకాని "పూర్తి శరణాగతి" (Total Surrender) చేయడం చేతకాదు. ఎందుకంటే ఈ 'శరణాగతి'కి అడ్డుపడే అనేక విఘ్నాలు తన స్వభావంలోంచి పనిచేసే ఈ ప్రకృతి వల్లనే వస్తాయి!

## ఆత్మసమర్పణ ఎలా చేయాలి ?

దైవశక్తి పనిచేస్తూ వుంటే తనలో దానికి అనుకూలంగా పూర్తిగా తన స్వభావాన్ని సమర్పించుకోవడం, ఆ దైవశక్తి తనలో తీసుకువచ్చే మార్పులకు తాను వ్యక్తిగత కారణాలవల్ల అడ్డంకులు కల్పించుకోకుండా చూసుకోవడం చాలా ముఖ్యం. వ్యక్తిగత కారణం అంటే తన వ్యక్తిత్వమే అడ్డంపడిన కారణం. ఇదే 'ఆధ్యాత్మిక' పరిణామం (Inner Evolution). ఇది కేవలం మన శరీరంలోనే కాదు, బయట ప్రపంచంలోనూ జరుగుతున్న లోపలి 'పరిణామం' (Inner Change).

## సాధనలోని సంఘర్షణ :

సృష్టిలోకి వచ్చిన ప్రతిదానికీ, తాను ముందుకు వెళ్ళడానికి జరిగే ప్రతి మెట్టులోనూ ఈ రెండు శక్తుల సంఘర్షణా కన్పిస్తుంది. ఆ సంఘర్షణలోనుంచి ముందుకు చొచ్చుకుపోయే పురోగతికి సహాయం దైవభక్తి (Divine Power.) అడ్డుపడేది ప్రకృతిశక్తి (Vital Force) అంటే ఏమిటో ఉదాహరణ యిస్తాను.

మట్టిలోనుంచి చెట్టు మొలకెత్తేటప్పుడు మట్టియొక్క అడ్డంకిని తొలగించుకుంటూ తన్నుకొని పైకివచ్చే 'ప్రాణశక్తి' ఒకవైపు పనిచేస్తూ ఉంటే ఆ మొలకను అడ్డగించే రాళ్ళూ, మట్టీ, వడగాడ్పులు వంటి 'సంహారక శక్తులు' మరో ప్రక్కనుంచి దానిని జడ ప్రకృతిలోకి లాగుతూ వుంటాయి.

అలాగే భూమియొక్క ప్రకృతిశక్తి ఆకర్షణశక్తిగా ప్రతిజీవిని కూడా పైకి పోనీకుండా తన ఆకర్షణతో క్రిందకు లాగినట్లే. (చెట్లను పైకి పెరగనియకుండా క్రిందకు లాగుతున్నట్లే,) పైకి 'ఎదిగేశక్తి' లేక దైవశక్తి పైకినెట్టుతున్నది. అలా ప్రతి జీవిని కూడా క్రిందికి లాగుతుంటుండేది ప్రకృతిశక్తి! దీనిని ఎదిరించి పైకి రావడమే జీవుల పరిణామం కోసం జరిగే ప్రాణ సంఘర్షణ. ఇదే సాధన! ఇలాంటి సంఘర్షణ సాధకుని లోపల జరగడానికి గల మూలకారణం ఇదే! తనలోని ప్రకృతిశక్తి, దైవశక్తికి పూర్తిగా వశమై లొంగి పోవడమే సాధనయొక్క పూర్తివిజయం.

అలా గెలిచిన సాధకునికి కలిగే లాభం ఏమిటి? ఆధ్యాత్మికంగా ఎదిగిన ఒక దివ్యమైన స్వభావాన్నీ, నిస్వార్థతనూ,శాంతినీ, ప్రేమనూ (విశ్వప్రేమ), సమానతను, ఎక్కడా లోటులేని ఆధ్యాత్మిక సౌందర్యాన్నీ (అంటే కేవలం బయటి సౌందర్యం కాకుండా)- ఆలోచనలో ఒక సుకుమారంగా విశ్వాన్ని ప్రేమించి జగత్తుకు మేలుచేసే స్వభావాన్ని, ఆలోచనలను క్రమక్రమంగా తనలో పెంపొందింప చేసుకుంటాడు. ఇదే పురోగతికి లాభం. ఇది జరగాలంటే 'దైవశక్తి' పూర్తిగా మనలో మన స్వభావం బదులుగా పని

చేయాలి. ఈదైవశక్తి చేసేపనికి అడ్డులేకుండా మనలో దివ్యమైన ఈమార్పులు తీసుకురావాలంటే, దానిపని అది చేయడానికి మన స్వభావం అడ్డుపడకుండా – పైనుంచి తనలోకి దిగే దైవసంకల్పాన్ని ఎదిరించకుండా – ఎంతో జాగ్రత్త పడాలి.

తన సంకల్పానికీ, దైవసంకల్పానికి ఎట్టి పరిస్థితిలోనూ పోటీ రాకుండా స్వభావం తలవొగ్గి 'దైవశక్తి' పనిచేయడానికి తాను లొంగి దారి ఇచ్చినప్పుడే పరిపూర్ణ దైవత్వం మనలోకి అవతరించగలుగుతుంది. మానవ స్వభావంలోకి దైవత్వం దిగివచ్చి, పరిపూర్తిగా మనలోని మానవత్వాన్ని మార్చివేసి దైవత్వాన్ని చేయడమే ఆధ్యాత్మిక పరిపూర్తి ! ఇది సహజమైన సాధన. ఇదేమన స్వభావంలో జరిగేమార్పు. దానిలో "శరణాగతి" అన్నది మొట్టమొదటి మెట్టు.

మనస్వభావం మనహృదయంలో అడ్డుగా నిలిచివున్న మనలోకి – ఒక 'తలుపు' వంటిది. దాన్ని తెరుచుకొని విశ్వహృదయంలోకి ప్రవేశించి మన వ్యక్తిగత ఆలోచనలు తొలగించగలిగితే, అది ఒక కిటికీ తెరుచుకున్నట్లుగా బయటనుంచి మనలోకి ప్రవేశించే దైవశక్తికి ద్వారం తెరుచుకుంటుంది. ఈ రహస్యం తెలియకుండా చేసే సాధన కేవలం కాలయాపన, వ్యర్థప్రయాస మాత్రమే !

సాధన అంటే మార్పు. తనయొక్క మార్పు ఈ ప్రపంచంలోని పరిణామంలాగ మట్టినుండిచెట్టు, చెట్టునుండి క్రిమికీటకాదులూ, వాటినుంచి జంతువులూ, జంతువులనుండి మనుష్యులూ ఏర్పడినట్లే మన స్వభావంకూడ జంతుప్రవృత్తి నుండి మానవ

ప్రవృత్తికి, అక్కడనుండి ఆలోచనశక్తి విస్తరించి విజ్ఞానదశకు పెరుగుతుంది. సైన్సుయుగం అయిన ఈ కాలంలో మానవజాతి విజ్ఞానదశలనుంచి ఇంకా పైకి వెళ్ళ వలసిన మెట్టు. విజ్ఞానదశల నుండి ఆధ్యాత్మిక దశలకు మారాలంటే వ్యక్తిలో, మనస్సులో. శరీరంలో, మాటలో, స్వభావంలో, సమాజంలో మార్పులు రావాలి. ఈ మార్పులు రావడానికి పైనుంచి పనిచేసే దైవశక్తి అనుగ్రహం ఎంతో అవసరము. ఆశక్తిని పనిచేయకుండా అడ్డుతగిలే మనలోని ప్రకృతిశక్తి లేక జంతు స్వభావంలేక వ్యక్తిగత స్వార్థం అనే అడ్డుతొలగించాలి! దీనికి ఉపాయం శరణాగతి మాత్రమే!



3

# సాధన అంటే ఏమిటి ?-II

శరణాగతి అంటే మనలోని దోషాలను, మన స్వభావంలోని బలహీనతలను, కోరికలను, విడిచి పెట్టటమే. నిత్యజీవితంలో దానిని అలవాటుగా అంటిపెట్టుకునే ప్రవర్తిస్తాము. ఇది రోజూ కొంతసేపు సాధకుడు తన ఆలోచనలను పరిశీలించుకొని, తనలోని సంఘర్షణను గమనించి తనలోని అహంకారం, సుఖం కావాలనే పేరాశ; ఇష్టమయినవీ, సుఖమైనవీ లాభమైనవీ తను ఒక్కడే పొందాలనే కోరిక (పైకి చెప్పకపోయినా) ఇదే అలవాటుగా ప్రవర్తించే రహస్య ప్రవృత్తిని విడిచిపెట్టటమే – అంటే గమనించటమే సాధన !

ఒక విషయాన్ని మనలో నిష్పక్షపాత దృష్టితోచూచి ఆ తర్వాత దానిని సమర్థించుకోవడానికి చూడకుండా ఇతరులలోని తప్పులను ఎలాగైతే కనిపెడతామో అలాగ మనల్ని మనమే బయట వ్యక్తిగా పరిగణించి 'ఎక్సురే' (X Ray) తీసినట్లు మన స్వభావాన్ని చూసుకోగలిగితేనే, మన తప్పులు అంటే మన స్వభావములో వుండే 'ప్రకృతి' లక్షణాలు, అంటే దైవానుగ్రహానికి అడ్డుపడేవి ఏమిటో మనము చూసుకోగలుగుతాము. సాధకుడు చాలాకాలం దాకా తనలోని దోషాలను చూసుకోవడానికి ఇష్టపడడు· దీనికి కారణం స్వార్థమే ! 'స్వార్థం' అంటే ఇతరులకు కన్పించేలాగ డబ్బు కాజేయుటమే కాదు. ఇది చాలా చిన్నరకం స్వార్థం. అసలు ఇంతకంటే నిగూఢంగా మనలో జీర్ణించుకొని మనలో ఉన్న అతి

ప్రమాదకరమైన స్వార్థం ఏంచేస్తుందంటే, మనం దానివైపు చూసు కోవడానికి కూడా ఇష్టపడకుండా, బాధగా వ్యక్తిత్వంలో అడ్డుపడు తుంది. మనకష్టాలు, వాటికి కారణాలు, మన లోపాలు మనకే కన బడినప్పుడు ఈ బాధ కలిగిన దానిని అణచుకోవడానికి తమ తప్పు లను గురించి ఆలోచించరు! దానిని పైకి రంగుపూసి పెద్దపెద్ద మాటలలో మంచిగా వర్ణించే లక్షణం పూర్తిగా త్యజించినవాడే నిజంగా సాధనకు యోగ్యుడు. తమలోని దోషాలనుముందు తను చూసుకుంటే కదా — దానిని నిర్మూలించడం తరువాతమాట?

అసలు తనలో దోషాలే కనబడనివాడు సాధకులందరిలో అడుగుమెట్టున వున్నట్టు లెక్క. తన దోషాలు తనకు తెలియటం మొదటి మెట్టు. వాటిని నిర్మూలించలేక తననితాను నిందించు కుంటూ, సతమతమయ్యేవారు సాధనలో రెండవమెట్టు. తనలోని అసత్యాన్ని త్యాగం చెయ్యడానికే నిశ్చయించుకుని తన సుఖాలకు ఎంతబాధ కలిగినాసరే, తన అహంతు ఎంతదెబ్బ తగిలినాసరే, చివ రికి తనవ్యక్తిత్వానికి అవమానం జరిగినాసరే, ఏమైనాసరే తన దోషా లను నిర్మూలించడానికి చూసే వ్యక్తి సాధకులలో మూడవమెట్టు. తన దోషాలు కేవలం తన ప్రయత్నంతోనే కాకుండా వాటిని పూర్తిగా నిర్మూలించాలంటే ఇతరుల సహాయం (గురువుకాని, దైవముకాని) గుర్తించి సాధనలో మరికొంత ముందుకు వెళ్ళినట్లు. గురువు దొరక గానే అన్నీ గురువే చూసుకుంటాడు అని తన ప్రయత్నం తాను చేయకుండా తప్పించుకోవడానికి ప్రయత్నించే సాధకులు సాధనలో కొంతకాలం ఆగిపోతారు. అలా సాధనలో మరుగున పడినవారు మళ్ళీ తన సుఖాలలోవున్న దోషాలను గమనించి, తన మార్పుకు

ప్రయత్నం అవసరమని గమనించక గురువు అనుగ్రహం తన మీద లేదని భావిస్తాడు.

## గురువు చేసే సహాయం ఏమిటి ?

గురువు అనుగ్రహం, అంటే– "సహాయం" అంటే లాభాలు పొందటమా? మనకు కావలసిన కోరికలు సిద్ధింప జేసుకోవడం, మనకు వచ్చిన ఇబ్బందులనూ, కోరికలనూ నివారణ చేసుకోవడం కోసం దైవాన్ని, గురువునీ కేవలం ఒక పనిముట్టుగా పెట్టుకోవడం అనే చాలామంది భ్రమపడతారు. సాధనలో గురువు లేక దైవం యొక్క సహాయం అంటే తనలో దైవశక్తి ప్రవేశించి పనిచేస్తూ వుండేదానికి అడ్డంగా నిలిచి పోరాడే తన వ్యక్తిత్వానికీ, తన స్వభావానికీ జరిగే సంఘర్షణలో దైవశక్తికి ఇచ్చే సహాయమే నిజమైన ఆధ్యాత్మిక సహాయం. తన స్వభావంలో జరిగే పోరాటంలో దైవత్వానికే సహాయం చేకూర్చితే తనలో స్వార్థం పరాజయం అవ్వవలసిన అవసరం ఏర్పడుతుంది. వ్యక్తిగతకోర్కెలు సిద్ధించనపుడు తనలో స్వార్థం ఏర్పడి తన కష్టాల నివారణ కోసం పడే తాపత్రయంలో తనకు స్వార్థం పరాజయం అవ్వవలసిన అవసరం ఏర్పడుతుంది ! వ్యక్తిగత కోర్కెలు సిద్ధించనపుడు తనలో స్వార్థం ఏర్పడి తన కష్టాల నివారణకోసం పడే తాపత్రయంలో తనకుస్వార్థం, సుఖమునందు లోభం పెరిగిపోతాయి. ఇది సాధనకు నిజమైన ఆటంకం. అపుడు దైవం పరిస్థితులద్వారా ఇబ్బందులూ, కష్టాలూ, బాధలూ కొన్ని కల్పించి, మనలోవున్న స్వార్థాన్ని మనకు బాగా కనబడేలాగ వెలికి తీస్తాడు. అందుకే కష్టాలన్నీ (చెడు) దైవకల్పితము కాదు. సుఖాలన్నీ దైవానుగ్రహము కాదు.

## స్వార్థంయొక్క పరాజయంలో గురువు సహాయం :

అందుకే దైవం లేక గురువు ఏదోసహాయం చేస్తాడంటే అర్థం మనలో దైవత్వం వృద్ధి పొందించి వ్యక్తిగత స్వార్థంలో అవసరమైన మార్పులు బయట జీవితంలో ఏర్పాటు చేయడమే.

సాధన దృష్టితో బయట జీవితాన్ని చూడటం చాల మందికి చేతకాదు. అందుకే జీవితంలో తనమేలుకు ఏంకావాలో తెలియక ఇష్టమయినవే కోరుకుంటాడు. కాని అతని ఆత్మలో అంతర్యామిగా వున్నదైవం అలాంటి అన్ని కోర్కెలకు అనుమతించడు.

ఇది గమనించని సాధకుడు ఎన్నాళ్ళు సాధన చేసినా సహాయం చేయలేదని నిందిస్తాడు ! తన కోరికలు సిద్ధించడంకోసం శరణాగతి నటిస్తాడు. అప్పటికీ తన కోర్కెలు తీరకపోతే దైవాన్ని నిందిస్తాడు. ఆ తరువాత దైవానుగ్రహమే అసత్యమని వాదిస్తాడు. చివరికి 'దైవం' అనేది లేదని గట్టిగా వాదించి అది తను నమ్మడానికి, ఇతరులను నమ్మించడానికి ప్రయత్నిస్తాడు. అప్పుడు అతనిలోని అసంతృప్తి నవ్వుకుంటుంది.

కాని అదే సమయంలో బలీయమైన "దైవానుగ్రహశక్తి" తన "అహం"ను నశింపజేసి, తనలోని మానవ స్వభావాన్ని నిర్మూలించి, దానిస్థానే వ్యక్తిగతస్వార్థానికి చోటులేని, వీలులేని "దైవికమగు స్వభావాన్ని" పెంపొందింపజేయడమే అని సాధకుడు కూడా గ్రహిస్తాడు.

ఇలా జరిగే సంఘర్షణలో దైవస్వభావానికి అడ్డుగా తానే నిలుస్తాడు. తన స్వభావాన్ని మమకారం లేకుండా విడిచిపెట్టి తన

ఇష్టాయిష్టాలూ, కోర్కెలు. తమ అభిప్రాయాలు, వాటిమీద మమ కారం గల ఇష్టాయిష్టాలలో, కష్టసుఖాలలో తనకు పనిలేకుండా నిర్లిప్తతగా తనకర్తవ్యాన్ని నిర్వర్తించు కుంటూ జీవించడం ద్వారా నిజమైన శరణాగతిని సాధకుడు సాధిస్తాడు.

ఆశ లేకుండా పనిచేయడం, కోరిక లేకుండా కృషి చేయడం, ఎవరి మెప్పుకోరకుండా సేవచేయడం, ప్రతివారినీ ప్రేమించి సహాయంచేసి దానికి ప్రతిఫలంగా వారు తను చెప్పిన మాటలు వినాలని కోరకపోవటం, అందరికి తాను అందుబాటులో వుండాలన్న కోరిక వుండటం – శరణాగతి చేసిన నిజమైన సాధకునిలో కనబడే లక్షణం.

'శరణాగతి' అంటే తాను జీవితంలో చేయవలసిన పనులు (Duty) మానివెయ్యడం కాదు. అలా మానివెయ్యడం సోమరి తనం అవుతుంది.

అసలు పని మానేయడం కానేకాదు శరణాగతి లక్షణం. ప్రతిపనిలోనూ తనకు కలిగిన ప్రయోజనం మీదవుండే అపేక్షను వదలడమే శరణాగతి. ఏ పని ఎందుకు చేస్తున్నాడో ఆ వ్యక్తిగత ప్రయోజనాన్ని వదలిపెట్టి ఆపనిని మాత్రం పూర్తిగా సక్రమంగా నిర్వర్తించడం పూర్తి శరణాగతియొక్క లక్షణం. శరణాగతి పొందిన అసలయిన సాధకుడు శ్రమ అనుకోకుండా శ్రమ పడ తాడు. కష్టం అనుకోకుండా కష్టపడతాడు. నావాళ్ళు, పైవాళ్ళు అన్నభేదం లేకుండా అందరికీ సహాయం చేస్తాడు. తనకు అపకారం,

నష్టం కల్గించినా, వారివల్ల బాధ కలిగినా, ఆ బాధ తనలో కలగ డానికి కారణము అయిన తన స్వభావాన్ని నిర్మూలించుకుంటాడు.

## మనస్సును పావనం చేయుట :

మనస్సు పావనం చేయటం అంటే తను అనుభవించే ప్రతి వస్తువునీ దైవసమర్పణ చేసి దానిని అనుభవించడం, ఆనందమైనదీ, రుచికరమైనదీ, సుఖమయమైనది. అందరితో పంచుకోవడం – ఇలాంటే వాటి ద్వారానే 'శరణాగతికి' అడ్డు తగిలే తన స్వభావం తొలగిపోతుంది. ఇది ఎంత నిక్కచ్చిగా ఆచరిస్తే అంత నిక్కచ్చిగా ఫలితాలు పొందుతాడు.

పైన ఆచరించినట్లుగానే, లోలోపల చెడుతలంపులు మానక పోతే సాధనరూపంతో ఆత్మవంచనే ?

## మారు వేషాలతో దోషాలు :

తనలోని దోషాలను వాటి నిజ స్వరూపాల్ని అనేక రకాల ముసుగుల్తో, అనేక రూపాలతో, చాలకాలం దాచితే అవి వేరు రూపాల్లో బయట పడతాయి. దేవుడిపేర చేసే అన్యాయాలు – తల్లి ఎవరిమీదనో కోపంతో పిల్లవాణ్ణి చావకొట్టి వాడి మంచికి శిక్షిస్తు న్నానని తన్ను తాను మోసగించుకోవడం, తాను తన భార్యాపిల్లలకూ బంధువులకూ ఆస్తులు, ఇళ్ళూ, ఉద్యోగాలు సంపాదించిపెట్టి అది పరోపకారమని, నిస్వార్థసేవ అని నటించడం, అన్యాయం పేరిట, రాజకీయాల పేరిట, మతంపేరిట ఒకరినొకరు పీడించుకోవటం – ఇదంతా వ్యక్తిస్వభావాల సంఘర్షణే! ఇవన్నీ ఎన్నికల పేరిట వంచించడం వంటివే.

మానవ సమాజంలోని ద్వేషాలు, రోషాలు నిజమైన "దైవ ప్రకృతి"కి ఈ దోషపూరితమయిన వ్యక్తిలోని "మానవ" స్వభావానికి తేడా చూడగలగడమే సాధనలో రావలసిన గమనిక. ఈ దృష్టితో తనను తాను చూడడమంటే సమాజంలో వున్న దోషాలన్నీ తనలో ఎలా సంభవిస్తున్నాయో కనుగొనడము అన్నమాట!

జీవితంలో తనకు ఎంతో నష్టం, అవమానం, అన్యాయం, మోసము జరిగినట్లు తీవ్రంగా బాధపడిపోయే గుణం మనలో ఎప్పుడు తలఎత్తినా అది మనలోని స్వభావం చేసే నాటకంలోని పాత్రలే. అన్ని రూపాల వెనుక కనబడే మనలోని మానవ ప్రకృతి లేక పశుప్రకృతి లేదా పైశాచిక ప్రకృతి వాటి తేడాను గమనించాలి.

తనకున్నది లేనివాడితో పంచుకోవడం మానవప్రకృతి.తనకు లేకుండా ఎదుటివానికి త్యాగం చేయటం దైవికప్రకృతి! ఎదుట వారి దాన్ని తాను లాక్కోవడం పశుప్రకృతి. తనకు లాభం లేక పోయినా ఎదుటవానికి వున్న దానిని నాశనం చెయ్యడం అసుర ప్రకృతి. తనకు లోటు జరిగిందని లోకం అందరినీ హింసించ పూనడం పైశాచిక ప్రకృతి. ఈనాటి రాజకీయ పద్ధతిలో నాయకులు అనేక రంగులు పూసుకొని, మానవజాతిని ఏడ్పించే స్వభావం, మనలో ఎన్ని రూపాలలో వున్నదో ఈ దృష్టితో చూస్తే గమనించ వచ్చు. పైనుంచి దైవశక్తి తన స్వభావంలోకి క్రమక్రమంగా అవ తరించి తన స్వభావాన్ని మెట్లుమెట్టుగా పైకి తీసుకుపోయే ప్రక్రి

యుయే సాధన. దానిలో తన దోషాలు, తన స్వభావం, తన మాన వత్వం తొలగించిన కొద్ది పైనుంచి క్రిందికి తనలోకి పనిచేసే ప్రక్రియ దైవత్వంయొక్క శరణాగతి.

పైనుంచి తనలోకి పనిచేసే దైవశక్తికి లోబడి తన స్వభావం తలవొగ్గి లొంగిపోవడమే శరణాగతి అంటే అర్థం. ఇది ఒక్క క్షణంలో చేసేది కాదు. పూవు విచ్చుకున్నట్లుగా క్రమక్రమంగా జరిగే – 'వ్యక్తిత్వం'లో నుంచి జగద్వ్యాపక మయిన "తాను" పుష్పించడమే సాధన! తనలోని మానవత్వపు ఓటమియే దైవత్వపు విజయం. ఈ రెండింటి సంఘర్షణయే మానవజీవితం.



4

# సాధనయొక్క లక్ష్యము

## శకునములు లేక దైవసూచనలు :

మనము ఏదైనా పనిచేసేటప్పుడు కొన్ని సూచనలు కన్పిస్తాయి. అంటే ఇది శుభమైనదా లేక అశుభమైనదా అన్న దానిని తెలియజేయడానికి సూచనలు కన్పిస్తాయి. అలాగే భగవంతుడు మనల్ని అనుగ్రహించ బోయే ముందు సూచన ద్వారా తన అనుగ్రహాన్ని తెలియజేస్తాడు. ఇది ఎలాగంటే – సీతమ్మవారిని రావణాసురుడు ఎత్తుకు వెళ్ళినపుడు "నేను యిక్కడినుండి ఎలాబయటపడగలను ? రాములవారు నన్ను ఎప్పుడు తీసుకొని వెళ్తారు ?" అని చింత పడుతున్న సమయంలో ఆమెకు కొన్ని సూచనలు కన్పించాయి. అప్పుడే హనుమంతుడు సముద్రందాటి ఆమె కూర్చునిఉన్న చెట్టుమీదకు వచ్చి ఆమె కలలో దర్శనమిచ్చాడు. సీతమ్మవారు ఆ రూపం చూచి "ఏమిటా రూపం ? పచ్చని శరీరం, ఎఱ్ఱని మూతి !" అని ఆశ్చర్యపడింది. మన పెద్దవాళ్ళు కోతి కలలోకి వస్తే కష్టాలు కలుగుతాయంటారు. సీతమ్మవారు కూడ, "అసలే నేను కష్టాలలో ఉన్నాను. ఇప్పుడు కోతి కలలోకి వచ్చింది ఏం జరుగుతున్నదో" నని దుఃఖిస్తున్న సమయంలో ఆవిడ ఎడమ కన్ను శుభసూచకంగా మూడుసార్లు అదిరింది ! ఆడవాళ్ళకు ఎడమకన్ను అదిరితే శుభసూచకమని శాస్త్రము.

శ్లో॥ "దృశ్య తేచ స్ఫురచ్చక్షుః పద్మపత్రమివాయతమ్
ఈషచ్చహృషితో వ్యాస్యా దక్షిణాయా హ్యదక్షిణః"
...అర్థసిద్ధింతు వై దేహ్యా పశ్చిమ్యాహ ముప స్థితాం
రాక్షసేంద్ర వినాశంచ విజయం రాఘవస్యచ॥
—వాల్మీకి రామాయణం (సుందరకాండ)

అంటే త్వరలో శుభం జరగబోతోందన్న సూచన అన్నమాట. ఈవిడ ఏ సమస్య గురించి ఆలోచిస్తోందో, ఆసమస్యకు సంబంధించిన సూచన అది. ఈ విషయాన్ని వాల్మీకి చాలాచక్కగా వర్ణించాడు. 'లక్ష్మీదేవికి తామర పూవులవంటి కన్నులు ఉన్నాయి. నీటిలో వికసించిన పద్మం ఎలా ఉంటుందో, అలాంటి కన్నులు కలది. కాని ఈపువ్వుకాడ నీటి అడుగున ఉండి, పైకి కనిపించదు. లోపల కాడ కంపిస్తేనే పైన పద్మం కంపిస్తుంది. అలాగే పద్మం కంపించినట్లు సీతాదేవి కన్నులు కొంచెం కంపించాయి. అంటే శుభం జరుగనున్నదో లేక అశుభం జరుగనున్నదో సూచనల ద్వారా భగవంతుడు తెలియ జేస్తాడు. జరగబోయే సంకల్పం మనకు కనబడదు కాని దాని నిమిత్తం మాత్రం కనబడుతుంది.

అనుభూతులంటే ఈ శుభమైన నిమిత్తాలే. సాధన ప్రారంభించిన రోజుననే భగవత్సాక్షాత్కారము కలుగదు. భగవంతుని చూడాలన్నా, చేరుకోవాలన్నా కొన్ని సంవత్సరాలు తపస్సు చేయాలి. అనేక జన్మలనుండి చేసిన పాపాలు నశిస్తే తప్ప – అంటే కర్మ పరిపాకమైతే కాని భగవంతుడు కన్పించడు. అంటే భగవంతునికీ మనకీ మధ్య 'కర్మ' అనేతెర అడ్డు ఉన్న దన్నమాట. కాని ఈ లోపల తనని చేరుకోవడానికి ఇంకా కొంత ఆలస్యం ఉన్నప్పటికీ,

భక్తుని ఆవేదన గ్రహించి (ఆవేదన అంటే తనకు భగవంతుడు కన్పిస్తాడా ? తను చేస్తున్న సాధన సరియైనదేనా ? అసలు తనకు భగవంతుని అనుగ్రహం కలుగుతుందా ? తను సరైన మార్గంలో వెళ్తున్నాడా ? – అన్న తీవ్ర అందోళన వున్నవారికి) భగవంతుడు ప్రత్యక్షంగా కన్పించకుండా పరోక్షంగా తన ఉనికిని గురించి సూచనల ద్వారా, అంటేఅనుభూతులద్వారా తెలియజేస్తాడు.ఇలా ప్రత్యక్షంగా ఎందుకు కనబడడంటే-తనకి, భక్తునికి మధ్య 'మాయ' అనే తెరఅడ్డు ఉండుటవలన. అందుకే పేళ్ళిలో పెళ్ళికుమార్తెకు పెండ్లి కుమారునికి మధ్య 'తెర' అడ్డుపెడతారు.జీవుడు పెళ్ళికుమార్తె, భగవంతుడు పెళ్ళికుమారుడు. వీళ్ళిద్దరికి మధ్యనున్న తెరే 'మాయ'. ఆ తెర తొలగిస్తే కాని పెళ్ళికుమార్తెకు పెళ్ళి కుమారుని యొక్క దర్శనం కలుగదు. అదే శుభముహూర్తము. అంటే జీవునికి, పరమాత్మునికి జరిగే నిత్యకళ్యాణము ఏదైతే ఉన్నదో అదే లోక కళ్యాణము. అదే జీవేశ్వరుల యొక్క ఐక్యత. ఇదే రామాయణంలో చెప్పబడింది. పెళ్ళికుమార్తె పెళ్ళికుమారుని దర్శించటానికి మధ్య 'మాయ' అనే తెర ఉన్నది. తెర తొలగించితే తప్ప జీవునికి భగవంతుని దర్శనం కలుగదు. ఈ తెర తొలగించే ముందు కొన్ని సూచనలు కనబడతాయి. అంటే ముందుగా పెళ్ళి కుమారుని పాదాలు యువతలకు పెట్టి కడుగుతారు. ముందుగా పాదాలు కన్పించినట్లే భగవంతుని సాక్షాత్కారానికి ముందుగా ఆయన చరణారవిందాలు కనబడుతాయి. చరణాలు దొరికితే అంతా దొరికినట్లే.

ఇక్కడ చరణం అంటే ఏమిటీ ? చాలమంది పాదాలంటే కాళ్ళనుకుంటారు. భగవంతుని పాదాలు భౌతికంగా కన్పించవు.

పాట పాడేటప్పుడు చరణాలుంటాయి. ఒక్కొక్క చరణం ఒక్కొక్క పాదమన్న మాట. భగవంతుని నామం – 'ఓం నమో నారాయణాయ' కొన్ని పదముల సముదాయం. అవి భగవంతుని చరణాలు. భగవంతుని చరణాలు ఎలా ఉంటాయి? మన ఎదురుగా కనిపించే వస్తువుల్లాగ (కుర్చీ, బల్లమాదిరిగా) పదార్థంతో కాకుండా, భగవంతుడు శబ్దంతో తయారై ఉంటాడు. ఆయన శబ్దబ్రహ్మం, శబ్దం చేత ఆకారం దాల్చినవాడు కదా! మరి పాదాలెలాఉంటాయి? అవికూడా శబ్దరూపంలోనే ఉంటాయి. అయితే వాటిని పట్టుకోవడం ఎలా? ఉచ్చారణ ద్వారా పట్టుకోవాలి. భగవన్నామమును ఉచ్చరించుటమే భగవంతునిపాదాలను స్పృశించడం.

అందువలన ఈ అనుభూతులెలా ఉంటాయనడానికి ఒక ఉదాహరణ చెప్పవచ్చును. ఒక భక్తుడు ఒక పనిని ప్రసాదించమని భగవంతుని ప్రార్థించినపుడు, అది నిస్వార్థమైనదైతే తప్పక దైవసహాయం లభిస్తుంది. అన్ని పనులకు దైవసహాయం లభించదు. ఏపనినైనా తనకోసం కాకుండా లోకంలో అందరి శ్రేయస్సు కొరకు అంటే లోకకళ్యాణం కోసం చేస్తున్నట్లయితే భగవంతుడు సంతోషపడి ఒక్కని వల్ల యింతమంది తరిస్తున్నారని, వాడు ఒక అడుగు ముందుకు వేస్తే భగవంతుడు పది అడుగులు ముందుకు వేస్తాడు. అలా చెయ్యడంలో అంటే దైవకార్యం చేపట్టినప్పుడు లభించే భగవంతుడి సహాయం కొన్ని శుభసూచనలద్వారా కన్పిస్తాయి. ఈ సూచనలు (శకునాలు) అనేక రకాలుగా ఉంటాయి. అందులో ఒకరకం – కలలో కనిపించడం.

మనవాళ్ళు తెల్లవారుఝామున వచ్చే కలలు నిజమవుతా

యంటారు. ఎందుకంటే ఆ సమయంలో, అనగా బ్రాహ్మీముహూర్తంలో మూడు గంటలకు దేవతలు, ఋషులు, మహర్షులు బయల్దేరడం ప్రారంభించి ఆకాశంలో తూర్పుదిశగా ప్రయాణించి, అదృశ్యరూపంలో ఉదయించే సూర్యునికి స్వాగతం చెప్పి, అర్ఘ్యం, పాద్యం సమర్పిస్తారు. ఇలా వెళ్తున్నప్పుడు, దారిలో ఎవరైనా మేల్కొని ప్రార్థన చేస్తూంటే వాళ్ళందరినీ చూసి ఆశీర్వదిస్తారు. ఆ సమయానికి ఎవరైతే ఒళ్ళు మరచి నిద్రపోతుంటారో వారికి ఆ ఆశీర్వచనం లభించదు. తెల్లవారుజామునే లేచి శుచిగా స్నానం చేసి, ప్రార్థన చేయాలని మన పెద్దవాళ్ళు చెప్తారు. స్నానం చేయకుండా ఆవులిస్తూ కూర్చుంటే దేవతలు, ఋషులు వాళ్ళను తప్పించుకొని వెళ్తారు. మనం దేవాలయానికి వెళ్తున్నప్పుడు దారిలో ఎవరైనా శౌచకార్యాలు లేక మైలబట్టలతో ఉంటే వాళ్ళను ఎలా తప్పించుకుంటూ వెళ్తామో, అలాగే దేవతలూ, ఋషులూ తప్పించుకొని వెళ్తారు. ఎవరైతే స్నానం చేసి భగవంతుని ప్రార్థిస్తారో వారిని చూసి భూత, ప్రేత, పిశాచాలు భయపడతాయి. అంటే దేవతలకూ, భూత ప్రేత పిశాచాలకూ, ఎంతతేడా వుందంటే దేవాలయంలో తీర్థం పుచ్చుకున్న వాడికి, కల్లుపాకలో కల్లు తాగినవాడికి ఉన్నంత తేడా వుంది. అటువంటి సమయంలో మెలకువతో సాధనచేస్తే అనేక అనుభూతులు కలుగుతాయి.

ఒక్కొక్కసారి అరుదుగా దేవతలు ఆయా రూపాలలో అంటే శాస్త్రాలలో ఏ విధంగా దేవతల రూపాన్ని వర్ణించారో ఆవిధంగా దర్శనమిస్తారు. భక్తుడి ఆసక్తి నిజమైనదైతే, భక్తిలో కనుక తీవ్రత ఉంటే ప్రత్యక్షంగా భగవంతుని దర్శనం కలుగుతుంది. కలి

యుగంలో ఎవరైతే కోరికలేమీ లేకుండా, నిజమైన ఆవేదనతో సాధన చేస్తారో వారికి భగవంతుడు ప్రత్యక్షంగా దర్శనమిస్తాడు. ఇదివాళ్ళంతట వాళ్ళు సాధించాలంటే కొన్ని సంవత్సరాలు, లేక కొన్ని జన్మలు పట్టవచ్చు. కాని గురువు సహాయంతో నయితే త్వరగా సాధించవచ్చు. గురువు సాధన వడ్డీతో కూడినటువంటిది. బ్యాంకులో డబ్బు వేసినపుడు ఎలా, వడ్డీ పెరుగుతుందో అలాగే గురువు యిచ్చింది అసలు అయితే, సాధకుడిది వడ్డీ అవుతుంది. గురువు యిచ్చింది రూపాయకు రూపాయి ఉంటుంది. తనది రూపాయకు పావలా ఉంటుంది. అందువల్ల పది జన్మలు, పది సంవత్సరాలు పట్టేది గురువుద్వారా పదినెలల్లోగాని, పది వారాల్లోగాని లేక పదిరోజుల్లోగాని సాధించ వచ్చు.

అసలు సాధన ఎలా చేయాలి ? సాధకుడు పాటించ వలసిన ముఖ్య విధులేమిటి ? నియమాలేమిటి ? అన్నిటికన్నా ముఖ్య మైనది – సాధన ఎందుకు చేస్తున్నామో, సాధనలో లక్ష్యమేమి టనేది గ్రహించాలి. చిన్న విషయాలకు దేవుడిని ఆశ్రయించ కూడదు. పుట్టిన తరువాత ఎన్ని జబ్బులు చేసినా, ఎన్ని మందులు వాడినా మరణం తప్పదు. అన్నింటికన్నా పెద్దమందు మృత్యువు. ఎందువల్లనంటే మనం అంటే 'శరీరం' కాదు. మనం శరీరంలో ఉన్నాము. జ్ఞాని అయిన వాడు నా శరీరానికి రోగం వచ్చిందంటాడు. కాని అప్పుడు నాకు రోగం వచ్చిందంటాడు. తాను వేరు, తన శరీరం వేరు. చొక్కా చిరిగితే చొక్కా చిరిగిందంటాంగాని, మనం చిరగామని అనము. చొక్కా చిరిగితే ఆ చిరుగు చిన్నదైతే,కుట్టుకుని తొడుక్కుంటాము. చిరుగు పెద్దదైతే, పనికిరాకపోతే తీసివేసి క్రొత్త

చొక్కా తొడుక్కుంటాము. అలాగే శరీరానికి కలిగిన నష్టం చిన్న దైతే మందుతో నయం చేసుకోవచ్చు. నష్టం పెద్దదైతే ఈ శరీరాన్ని వదిలేసి ఆత్మ క్రొత్త శరీరాన్ని ధరిస్తుంది. ఆత్మ శాశ్వతమైనది. నష్టమైనా, కష్టమైనా శరీరానికేగాని ఆత్మకు కాదు. ఒక శరీరం కాకపోతే ఆత్మ మరొక శరీరాన్ని ధరిస్తుంది.

శ్లో॥ "వాసాంసి జీర్ణాని యథా విహాయ ।
తథా శరీరాణి అన్యాని సంయాతి నవానిదేహీ ॥

(జీర్ణించుకుపోయిన పాత బట్టలను విడిచి కొత్తగుడ్డలు మనిషి కట్టుకున్నట్లే 'దేహి' ముసలివైన దేహములు వొదిలి కొత్త దేహాలను ధరిస్తుందని తాత్పర్యము.) 'దేహి' అంటే దేహంలో ఉన్న జీవుడు— అదే ఆత్మ.

మనిషిలో రెండు భాగాలున్నాయి. ఒకటి భౌతికంగా పైన కన్పించే శరీరం, రెండవది శరీరంలో కన్పించకుండా ఉండే ఆత్మ. ఇక్కడ శాశ్వతమైన ఆత్మ అశాశ్వతమయిన శరీరాన్ని ధరిస్తుంది. అశాశ్వతమని ఎందుకన్నానంటే మనం జీవితంలో ఏమయినా కోరికలు పెట్టుకుంటే, వాటితో మనం చచ్చిన పదవరోజు వరకు మాత్రమే మనకు సంబంధం ఉంటుంది. ధన, వస్తు, వాహనాలెన్నివున్నా – దహనం చేస్తే ఈ శరీరం 45 నిమిషాలలో తగలబడిపోతుంది. అయితే ఈ శరీరాన్ని ఎందుకు ధరిస్తున్నాడంటే ఈ శరీరంతో పొందవలసిన అనుభవాలు కొన్ని ఉన్నాయి. నేర్చుకోవాల్సిన గుణపాఠాలు కొన్ని ఉన్నాయి. శరీరం ద్వారా ఈ ప్రపంచంలో సాధించవలసిన సాధన కొంత ఉన్నది. అనుభవించవలసిన సుఖ

దుఃఖాలు కొన్ని ఉన్నాయి. ఈ శరీరంతో దైవాన్ని ఆశ్రయించి కొన్ని దివ్యానుభూతులను పొందవచ్చు. అవన్నీ అయిపోయిన తరువాత 'ఆత్మ' ఈ శరీరాన్ని వదిలివేసి మరొక శరీరాన్ని ధరిస్తుంది. కాబట్టి శరీరం అంత ముఖ్యమైనది కాదు.

మన శరీరం ముఖ్యంగా రెండు విధులు నిర్వర్తించాలి. ఒకటి పూర్వకర్మఫలితాన్ని పూర్తిచేసికోవాలి, రెండవది ఈ శరీరాన్ని పనిముట్టుగా చేసి మంచి సాధన ద్వారా పురోగతిని పొందాలి. ఈ రెండుపనులు చెయ్యడానికి శరీరం యివ్వబడింది. అంతేగాని దీనికి అలంకారాలు చేసి దేవుడిని కొలిచినట్లు కొలవకూడదు. ఎలాగంటే బిల్డింగు కట్టేటప్పుడు స్ట్రాంగ్‌గా కట్టాలిగాని, బలంలేకుండా ఎన్ని రంగులు వేసినా లాభంలేదు. రంగులు ఉన్నా లేకపోయినా బిల్డింగు పదికాలాలపాటు ఉండేటట్టు కట్టాలి. అలాగే ఆత్మ ముఖ్యమైనది. అయితే శరీరాన్ని కొంతవరకూ మాత్రమే చూసుకోవాలి. ఆహారం యివ్వాలి. ఆరోగ్యం చూసుకోవాలి. విశ్రాంతి తీసుకోవాలి. అంతకు మించి శరీరానికి గారాబం చేయకూడదు. శరీరానికన్నా ముఖ్యమైనది ఆత్మ, చావుబ్రతుకులకు సంబంధించిన విషయం సాధన. దైవధ్యానం, జపం, అన్నీ చావుబ్రతుకులకు సంబంధించినవి. కాబట్టి జీవితంలో సాధనకు, దైవకార్యాలకూ ప్రత్యేక ప్రాముఖ్యతనివ్వాలి. అందువల్ల ముఖ్యంగా మనం ఎందుకు మరణిస్తున్నాం' అన్నవి ముందు తెల్సుకోవాలి. తెల్సుకోనటువంటివాడు మూర్ఖుడు! శంకరాచార్యులువారి భజగోవింద శ్లోకాలలో ఇలా చెప్పారు.

శ్లో॥ "కాలో గచ్ఛతి. నశ్యత్యాయుః
...యావద్దేహే తిష్ఠతి వాయుః తావద్గేహే

పృచ్ఛతి వార్తా ... భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ, మూఢమతే"

అంటే 'కాలం గడచిపోతోంది. మృత్యువు దగ్గర పడుతోంది. సూర్యోదయం అయేటప్పటికి యింకొక క్రొత్తరోజు వచ్చిందని సంతోషిస్తాము. నిజానికి కేలండర్‌లో రోజులు తగ్గిపోతున్నాయి. ఒక్కొక్క రోజు తగ్గిపోతుంటే విచారించాలి. ఆందోళన చెందాలి.

చాలామంది పుట్టినరోజు జరుపుకుంటారు. షష్ఠిపూర్తి పండుగ చేసుకుంటారు. షష్ఠిపూర్తి అయితే మృత్యువు దగ్గర పడిందన్నమాట. కాలం గడిచిపోతున్నా విలువ తెలియక యిలా చేస్తుంటారు. ఎవరికాలం ? ఇది తన కాలమే. 'సాధన ఎందుకు చేస్తున్నాం ?' అన్న ప్రశ్నకు సమాధానం జీవితంలో తన లక్ష్యం ఏమిటి ? చిల్లర విషయాలకు భగవంతుని ప్రార్థించకూడదు. సమస్యలన్నీ దాదాపు తాత్కాలికమైనవే. మరణించిన తరువాత ఏ జబ్బు ఉండదు గదా ! అందరికన్నా గొప్పవైద్యుడు మృత్యువు. అందుకే కాళహస్తీశ్వరుడు, "రేపు మృత్యువు ఉన్న మానవుడు ఏమందు వాడాలి ? ఈ రోగం తగ్గుతుందా ?" అని తాపత్రయ పడుతూ ఉంటాడని చెప్పాడు. "తాను" అనేది లేనప్పుడు ప్రపంచంలో ఏ వస్తువుకు విలువ ఉంటుంది ?

ఈ మధ్య ప్రమాదాలల్లో చాలమంది చనిపోతూండడం మనం నిత్యం చూస్తూనే ఉంటాము. వాళ్ళుకట్టుకున్న బట్టలు గాని పెట్టుకున్న నగలుగాని చెక్కు చెదరవు. శరీరం పాడయి నట్లూ కనబడదు. వాళ్ళు చచ్చిపోయినట్లుండరు. కాని వాళ్ళలో పోయిందేమిటి ?

లోపలనున్న ఆ చిన్న దీపారాధన ఆరిపోయింది. ఆచిన్న దీపం లేనప్పుడు యింత పెద్ద శరీరానికి విలువ ఏమీ లేదు. అది తెలియక పిచ్చివాళ్ళు శరీరానికి ఎన్నో అలంకారాలు చేస్తారు. ఆభరణాలు తగిలిస్తారు. కాని వెళ్ళేటప్పుడు ఆ శరీరాన్ని, ఆభరణాలని అన్నింటిని యిక్కడే విడిచి వెళ్తారు. అవన్నీ ఈలోకంలో భూమి మీద ప్రయాణానికే పనికివస్తాయి. కాని పై ప్రయాణానికి పనికి రావు, పై ప్రయాణానికి ఏం కావాలి ? దాని నెలా సాధించాలి ? ఈ విషయం తెలిసికోవటానికే 'సాధన' అవసరం

## లక్ష్యంలేందే సాధన లేదు :

ముఖ్యంగా అందరూ గుర్తించుకోవలసిన విషయం – మనం సాధన ఎందుకు చేస్తున్నాము ? మన లక్ష్యం ఏమిటీ ? పుట్టిన వాడు చావక తప్పదు. చచ్చేలోపల యిన్ని వ్యామోహా లెందుకు? జన్మనిచ్చినపుడే జీవితానికి సంబంధించిన విజ్ఞానాన్ని భగవంతుడు ప్రసాదిస్తాడు.

'అమ్మాయి పెళ్ళి అయ్యేటట్లు చూడు – భగవంతుడా !' అంటే అమ్మాయి పుట్టినప్పుడే ఆవిడ భర్తకూడా ఎక్కడో పుట్టి ఉంటాడు. ఆ సమయం వచ్చినపుడు ఎలాగూ పెళ్ళి అవుతుంది. దానికొరకు తాపత్రయమెందుకు ? ఒకడు సూర్యుడు ఉదయించాలని ధ్యానం చేశాడట. వీడు ధ్యానం చేసినందుకు సూర్యుడు ముందుగా ఉదయిస్తాడా ? వీడు జపం చెయ్యలేదని మానేస్తాడా?

వీడు జపంచేసినా, చెయ్యకపోయినా సూర్యుడు టైముకే ఉద యిస్తాడు. అలాగే ప్రతిదానికి కాలనిర్ణయమనేది ఒకటి ఉంది. కాలంతోనే కొన్ని విషయాలు సర్దుకుంటాయి. కాలం వచ్చినపుడు సర్వేశ్వరుడు అన్నీ చేస్తాడు. దానికి మనతాపత్రయం దేనికి ? మన విధి మనం సక్రమంగా చేయడం వరకేమనపని.

పూర్వం పెద్దలు యిలాగే ఆలోచించేవాళ్ళు. ఈ తాపత్రయా లన్నీ ఈ కాలంలో చిన్నవాళ్ళకే. అందువల్ల అనుష్ఠానంలోకి ఈ తాపత్రయాలు రాకూడదు.

## ప్రార్ధనా ? - కోరికల లిస్టా ?

ఈ కాలంలో ప్రపంచంలో అంతా వ్యతిరేకంగాఉంది. భగ వంతుడిని ఉద్యోగం యిప్పిస్తావా ? పెళ్ళి చేస్తావా ? రోగం తగ్గి స్తావా ? అని రాజకీయ నాయకులదగ్గర, మంత్రుల దగ్గర రిక మెండేషన్ అడిగినట్లు అడుగుతున్నారు. అందుకే 'రామదాసు, అన్నాడు.

చక్కెర మాని వేము తినజాలిన కైవడి మానవాథముల్
పెక్కురు బక్క దైవముల వేమరు కొలిచెదరట్లు కాదయా
మ్రొక్కిననీకు మ్రొక్కవలె – మోక్ష మొసంగిన నీవ ఈవలెన్
దక్కిన మాటలే మిటికి దాశరథీ ! కరుణాపయోనిధీ !

ఇక్కడ 'బక్కదైవము' అంటే బలము గురించికాదు చెప్పేది బక్కదైవములంటే కోరికలు మాత్రం తీర్చే దేవతలు ! వీళ్ళు

త్వరగా తీరుస్తారు. ఇంకా భూత ప్రేత పిశాచాలను ఆశ్రయించి కొన్ని మహిమలు సంపాదించిన స్వాములు కొందరున్నారు. వాళ్ళు అయితే యింకా త్వరగా కోరికలు తీరుస్తారు. కాని భగవంతుడు కోరికలు త్వరగా తీర్చడు.

ఎందుకంటే కోరికలనేవి జీవితానికి సంబంధించినవి. కాని అంతకన్నా ముఖ్యమైనది జన్మ మృత్యువుల నుండి తరుణోపాయాన్ని భగవంతుడు ప్రసాదిస్తాడు. జన్మ మృత్యువులు లేకుండా ఉండడమనేది ఒక్కటే నిజమైన లక్ష్యం. ఆ లక్ష్యం నెరవేర్చడానికి ఒక్కటే బాణం. ఆ బాణానికి ఒక్కటే ప్రయోగం. ఒక్క బాణము మాత్రమే ప్రయోగిస్తాడు. అంటే యింక బాణాలు లేవని గాదు. ఒక్క బాణం చాలు. ఈ బాణం ఏంచేస్తుంది ? ఈ సంసారంలో ఉన్నటువంటి కర్మ లన్నింటిని క్షయముచేసి మనం ఏర్పరచుకొన్న లక్ష్యాన్ని చేరుస్తుంది. అందుకని రామునికి ఒకేబాణం — మోక్షం. అందుకే ఆయన ఐక్క దైవం కాదు.

"ఈ వివరం తెలిసిన నరులకు మ్రొక్కెద" అన్నాడు త్యాగరాజు. 'రామ' మంత్రంయొక్క ప్రత్యేకత ఏమిటి ? శివమంత్రమున్నది, విష్ణుమంత్రమున్నది. అయినా రామ మంత్రంయొక్క గొప్పదన మేమిటి ? త్యాగయ్య పాడినట్లు —

మాధవమంత్రమునకు 'రా' జీవము
శివమంత్రమునకు 'మ' జీవము

విష్ణుమంత్రము అంటే 'ఓం నమో నారాయణాయ' – ఇందులో 'రా' అనే అక్షరం కనుక తీసివేసినట్లయితే 'ఓం నమో నాయణాయ' అవుతుంది. అది ఉచ్చారణకు వీలుకాదు. అసలు పనికిరాదు. అందువలన విష్ణుమంత్రానికి 'రా' అనే అక్షరం ప్రాణం. అట్లాగే 'ఓం నమశ్శివాయ' అనే శివమంత్రంలో 'మ' అనే అక్షరం కనుక తీసివేస్తే 'నశ్శివాయ' అవుతుంది. అంటే అర్థం శివుడు లేడన్నమాట. అందువలన 'శివ' మంత్రానికి 'మ' అనే అక్షరం జీవం. ఈ రెండు అక్షరముల సముదాయమే 'రామ' అనే మంత్రము.

అటువంటి 'రామ' మంత్రం వుండగా యింక వేరే మంత్రము లెందుకు ? తారకమంత్రం కోరిన దొరకదు. రామమంత్రం 'తారకమంత్రం' – దానిని తారకమంత్రమని ఎందుకన్నారు ? తరింపజేస్తుంది గనుక – 'తారాయతీతి తారకమ్' అని, అది కోరికలు తీర్చదు.

కోరికలు తీరిస్తే ఏమవుతుంది ? కోరికను తీర్చడమనేది గొప్ప విషయం కాదు. ఈ వేళ కోరికలన్నీ తీరిపోతే మానవులు అంతటితో సంతృప్తి చెందుతారా ? లేదు. రేపు ఉదయాన్నే మళ్ళీ క్రొత్త కోరికలు ! వాటికి అంతమనేది లేదు.

కోరికలు బావిలోని నీళ్ళవంటివి. బావిలోని నీళ్ళను రోజంతా తోడిపోసినా, మళ్ళీ గంటలో అన్ని నీళ్ళు ఊరతాయి. కోరికలు ఊటవంటివి. ఒకటి ఉంటే మరొకటి కావాలి. ఇలా ఆయుష్షు ఉన్నంతవరకు కోరికలు ఉంటూనే వుంటాయి. పూర్వం ఋషులు

ఏం చెప్పారంటే – ఈ కోరికలను తీర్చడమనేది పెట్టుకోగూడదు. వాటిని తీరుస్తూ ఉంటే అలా పుడుతూనే వుంటాయి ! కాబట్టి వాటిని నివారించాలి.

## జీవితము కోరికలనే రోగముల పుట్ట!

ఈ కోరికలు ఒక రోగం వంటివి చేతిమీద కురుపు ఉంది. రోజుకు కొంత చీము కారుతూ ఉంటుంది. శుభ్రంగా కడిగినా మళ్ళీ చీము కారుతూనే ఉంటుంది. చీము పోవడానికి మందు వేసుకుంటే మంచిదా ? లేక అసలు కురుపే పోవడానికి మందు వాడితే మంచిదా ? కురుపే పోవాలి – కురుపును నశింపచేసినట్లు కోరికలను నశింపచెయ్యాలి.

అదే ఈభవరోగము అంటే – 'భవము' అంటే కళ్ళకు కన్పించే యావత్తు సృష్టి. అంటే ఈ ప్రపంచము సంభవమై ఉన్నదే 'భవము'. ఈ సృష్టే ఒక రోగం. రోగం అంటే నిత్యం బాధ కలిగించేది. మనకున్న పెద్దరోగం ఆకలి ! దానికి మందు-కడుపు పట్టినంత ఆహారం ! భవమై ఉన్న శరీరంలో ఆకలి అనే రోగానికి 'మందు' లేక 'మాత్ర' పిడికెడు ఆహారం. ఆకలివేసి నప్పుడు యింత అహారంవేస్తే అప్పటికి శాంతిస్తుంది. మళ్ళీ సాయంత్రం యింకొక డోసు వెయ్యాలి ! ఇలారోజుకి రెండు డోసులు వెయ్యాలి. సూర్యోదయం, అయ్యేటప్పటికి ఈరోగం మళ్ళీ పెరిగి పోతుంది. ఎన్ని సంవత్సరాలు భోజనం చేసినా ఈ రోగం యిలానే ఉంటుంది. ఇది శారీరకమైన రోగం. అంతేగాకుండా పూర్ణాహారం, అల్పాహారం యిస్తున్నాసరే. ప్రొద్దున్నే ఒక కోరిక, మధ్యాహ్నం

ఒకకోరిక, మళ్ళీ రాత్రికి ఒకకోరిక ! ఊపిరిపీల్చి వదిలే లోపల కోరికలన్నీ తీర్చినా అంతటితో సంతృప్తి పడి ఊరుకుంటుందా ? దీనికి అంతేది ?

శ్లో॥ 'దుష్పూ రేణానలేనచ'

అని భగవద్గీతలో అన్నారు – ఈ కోరికలు అగ్ని వంటివి. అగ్ని మండుతుంది. అందులో ఒక కట్టెవేస్తే సంతృప్తి చెంది ఊరుకుంటుందా ? లేదు. మళ్ళీ పదికట్టెలు వేయాలి. ఒక కట్టె ఎంతసేపట్లో కాలిందో పదికట్టెలుకూడ అంతసేపట్లోనే కాలిపోతాయి కాబట్టి మంట తగ్గాలంటే ఏంచెయ్యాలి.

కట్టెలు వెయ్యడం మాని వెయ్యాలి. అలాగే కోరికలు తగ్గాలంటే వాటిని తీర్చడం అన్నది పెట్టుకోకూడదు ! కోరికల కోసం సాధన చేసేవాడు మూర్ఖుడు. అటువంటివాడు ఆత్మను అమ్ముకున్నవాడు.

శరీరాన్ని అమ్ముకోవడమే తప్పు. ఆత్మను అమ్ముకోవడం యింకాతప్పు. ఆత్మను అమ్ముకొని కోరికలు తీర్చుకోరాదు. ఒక డికి డబ్బు కావాలంటే ఆత్మను కుదవబెట్టి సంపాదిస్తాడు. ఐదు నిముషాలలో ఆడబ్బు అయిపోతుంది. కాని తాను మాత్రం డబ్బుకి దాసుడై పోతాడు.

## చిల్లరశక్తులు - సిద్ధులు :

చాలమంది అనుష్టానంలో దైవాన్నందుకోలేక నీచమైన, భ్రష్టమైన క్షుద్రదేవతలను ఉపాసించి, సిద్ధులనబడే చిల్లర శక్తు

లను సంపాదించి విభూదులివ్వడం, తలనొప్పులు తగ్గించడం వంటి పనులు జనాకర్షణ కోసం చేస్తుంటారు. జనాకర్షణ ఆధ్యాత్మికత కాదు. ఏదైనా సమావేశానికి సినీతారను పెడితే జనం చాలామంది వస్తారు. జనాకర్షణే కనుక మహాత్ముల లక్షణమయితే ఈరోజు లలో అందరికన్నా సినీతారలే ఆధ్యాత్మికశక్తి కలవారన్నమాట. దేవుని ఉత్సవాలు ఒకప్రక్కనపెట్టి, సినీతార మీటింగ్ ఒక ప్రక్కన పెడితే, సినీతార మీటింగ్‌కే ఎక్కువమంది వెళతారు. అందువలన దేవుని కన్నా సినీతార గొప్పదా? బంగారునగలు బజారులో ఎక్కడబడితే అక్కడ దొరుకుతాయని ఎవరైనా చెప్తే నిజంగా దొరుకుతాయా? బంగారం అన్నిచోట్లా దొరకదు. బంగారం లాగ మెరిసే గిల్టునగలు మటుకు ఎక్కడబడితే అక్కడ దొరుకు తాయి.

కంచుమ్రోగినట్లు కనకంబుమ్రోగునా...

కంచుగంట మ్రోగిస్తే గణగణ మ్రోగుతుంది. ప్రచారం అనేది కంచుగంటలాంటిది. కాని బంగారు గంట అలా మ్రోగదు, పూర్వం ఋషులు, మహర్షులు, మహాత్ములు ప్రచారం చెయ్యలేదు.

## దేవుడు గారడీలుచేసి కోర్కెలుతీర్చె విషనుకాదు :

జనాకర్షణేకనుక భగవంతుని గొప్పదనాన్ని తెలియచేసే టట్లైతే ఒక ఉదాహరణ చెప్పవచ్చు. ఒకడు ప్రత్తివ్యాపారం చేస్తాడు. వాడింటి ముందు రోజూ ప్రొద్దుటనుండి సాయంత్రం వరకు ప్రత్తి తీసుకురావడానికి, తీసుకు వెళ్ళడానికి అనేక బండ్లు

ఆగిఉంటాయి. సాయంత్రమయ్యేసరికి ఎంతోకొంతలాభం వస్తుంది. చూచేవాళ్ళకు గొప్పవ్యాపారంలాగ కన్పిస్తుంది. ప్రక్కనే ఒక వజ్రాల వ్యాపారి ఉంటాడు. అతని యింటిముందు బండ్లు ఆగవు! వజ్రాన్ని తెచ్చేవాడు పొట్లంకట్టి జేబులో పెట్టుకుని తెస్తాడు. అతని దగ్గరకు అందరురారు. మినుపబద్దంత వజ్రం లక్షల రూపాయల విలువ చేస్తుంది. దానిని ఎంచిఎంచి, తూచితూచి గీటుగీసి తీసు కుంటాము.

## సద్గురువులు - నకిలీగురువులు :

ఆధ్యాత్మిక గురువులలో కూడ ప్రత్తివ్యాపారస్థులూఉన్నారు, వజ్రాల వ్యాపారస్థులూ ఉన్నారు. ప్రత్తి నిప్పులలో బడితే ఒక్క నిముషంలో భస్మమైపోతుంది ! కాని వజ్రం అలాకాదు. దేనిచేతా విరగకొట్టలేనిది, కాల్చలేనిది. అందుకే బ్రహ్మజ్ఞానాన్ని యిచ్చే వాడు వజ్రాలవ్యాపారి. ఖరీదు యివ్వగలిగితేనే అక్కడకు వెళ్ళాలి. మామూలుగా పావలాకు, అర్ధరూపాయకు మూటకట్టుకు వెళ్ళాలంటే ప్రత్తి పనికివస్తుంది.

శ్లో॥ "నైనం ఛిందతి శస్త్రాణి
నైనం దహంతి పావకః
నచైనంక్లేదయం త్యాపో నశోషయతిమారుతః
...నిత్యః సర్వగతస్థాణు రచలోయం సనాతనః"
—భగవద్గీత.

ఆత్మను యిలా వర్ణించారు. ఏ ఆయుధముతోను ఖండింప లేనిది, అగ్నితో కాల్చడానికి, వాయువుతో ఛేదించడానికి, నీటితో

తడపడానికి వీలుకానిది, నాశనము లేనిది ఆత్మ. అందుకే దీనిని 'వజ్రం' అన్నారు! అటువంటి నాశనము లేని ఆత్మతో వ్యాపారం చేస్తున్నారు! ఈ వజ్రాల వ్యాపారంలో 'వజ్రం' సంపాదించాలంటే సంవత్సరాల తరబడి కష్టబడి, రూపాయి రూపాయి కూడబెట్టి లక్ష రూపాయలు అయిన తరువాత మంచి వజ్రాలు దొరికేచోటుకి వెళ్ళాలి!

మంచివజ్రం తెలిసికోవాలంటే పరీక్ష చెయ్యాలి. అలా చెయ్యాలంటే అనుభవం కావాలి! చూడడానికి పైకి నకిలి వజ్రాలే బాగా మెరుస్తాయి. అసలు వజ్రం అంతగా మెరవదు! కానీ చీకటిలో మెరిసేదే నిజమైన వజ్రం! అలాగే మూలవుండి ప్రత్యక్షంగా ప్రకాశించేవారే మహాత్ములు. ప్రచారంతో ప్రకాశించే వారు కాదు. వీరు సినిమాలో దేవుళ్ళవంటివారు.

"ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
చూడచూడ రుచుల జాడవేరు...
......విశ్వదాభిరామ వినురవేమ"

పైకి చూడడానికి ఉప్పు, కర్పూరము రెండు కూడా తెల్లగా ఉంటాయి. రుచిచూస్తే ఉప్పు ఉప్పుగా ఉంటుంది. కర్పూరం పరిమళం వేరేవిధంగా ఉంటుంది. ఇది దేవుడి నీరాజనంగా పనికి వస్తుంది. ఉప్పు దిష్టి తీయడానికి పనికివస్తుంది. అలాగే అందరూ పురుషులైనప్పటికీ.

"పురుషులందు పుణ్యపురుషులు వేరయా"

అన్నాడు! వేమనయోగి.

## సద్గురువును తెలుసుకోవడం ఎలా ?

'మహాత్ములను తెలుసుకోవడం ఎలా ?' అని చాలమంది అడుగుతుంటారు. దీనికి సూక్ష్మమైన మార్గం ఒకటుంది. రాజకీయ నాయకులు, వ్యాపారస్థులు – వీళ్ళంతా ప్రపంచంనుండి తీసుకొనే వారేకాని యిచ్చేవారు కాదు. వాళ్ళ చేతులు ఎప్పుడూ క్రింద ఉంటాయి. కాని మహాత్ములనబడే వారు ప్రపంచానికి యిచ్చే వారేకాని తీసుకునేవారు కాదు ! వీరు వచ్చిన వారందరికీ ఆశీర్వ చనం యిస్తారు.

చేతులు ఆశీర్వచనం తెలుపుతోంటే – వారు మహాత్ములు ! క్రిందికి వుంటే దురాత్ములు. అందుకే మన అలయాల్లో గరుడా ళ్వారు చేతులు పైకి, భగవంతుని చేతులు క్రిందికి ఉంటాయి ! లోకానికిచ్చేవారు మహాత్ములు – లోకం నుండి పుచ్చుకునేవారు సామాన్యులు.

ఎవ్వరైతే స్వార్థాన్ని త్యాగంచేసి భగవంతుని ముందు కూర్చుంటారో వారికి భగవంతుడు సన్నిహితుడవుతాడు. స్వార్థాన్ని త్యాగం చెయ్యటమంటే ఆత్మను జయించడమే ! ఆత్మను జయిం చినవాడు పరమాత్మను చేరుతాడు. 'నాకదికావాలి' 'ఇది కావాలి' అనేటటువంటి కోరికలను ప్రక్కకు పెట్టి సాధన ప్రారంభించాలి. అంటే, అటువంటి వాటికోసం విద్యుక్తమైన కర్మాచరణ చేసి సంపాదించుకోవాలి. అన్నం కావాలంటే అన్నంకోసం కూర్చుని జపం చేస్తున్నామా ? బియ్యం సంపాదించి వండుకుంటున్నాము ! అలా మనం కర్మను నిర్వర్తించాలి. దానికే భగవంతుడు ఈ శరీరం

యిచ్చాడు. పని చెయ్యటానికి ఓపిక యిచ్చాడు. కాని ఏపని చెయ్యాలో సెలెక్షన్ తెలియనపుడు మనసా శరణాగతి చేసి భగవంతుని ప్రార్థించాలి.

## ప్రార్థన ఎలా చేయవాలి ?

ప్రార్థన అంటే ఏమిటి ? చాలామంది కోరికల కోసం ప్రార్థనలు చేస్తూ ఉంటారు. ప్రార్థనలు ఫలించడం లేదంటారు ! కొందరు పైకి 'రామ, రామ' అంటూంటారుగాని, లోపలమాత్రం యిది అయ్యేదా, చచ్చేదా ?' అనుకుంటారు.

ఎందరో ప్రార్థన చేస్తున్నారు – కొందరు వెంటనే ఫలితాన్ని పొందుతున్నారు. కొందరు సంవత్సరాల తరబడి ప్రార్థన చేసినా ఫలితం ఇవ్వడంలేదు. గవర్నమెంటు కెలా అయితే రూల్సు ఉన్నాయో, భగవంతునికి కూడ కొన్ని రూల్సు ఉన్నాయి. ఆ రూల్సు ప్రకారం ప్రార్థనచేస్తే తప్పకుండా మన కోరికలు సిద్ధిస్తాయి. భగవంతుడు సుఖశాంతులను ప్రసాదిస్తాడు. ఆ రూల్సు ఏమిటి ?

మనిషి ఎందుకు పుట్టాడో భగవంతునికి తెలుసు. అతనికేది అవసరమో కూడా భగవంతునికి తెలుసు. మనం కోరిన వస్తువు మనకవసరమా, అనవసరమా ? అని ఆలోచిస్తాడు. మనకి అవసరమైనవే యిస్తాడు ! మన కోరికలవల్ల మనకు ఏవిధమైన అపకారం జరగకూడనివైతేనే ఇస్తాడు. మనం కోరిన కోరికల్లో చాల వరకు మనకపకారం చేసేవే వుంటాయి. కాని అది మనకు వచ్చే వరకు తెలియదు.

చాలామంది పెళ్ళిళ్ళకోసం మహాత్ములకు పాదపూజ చేస్తా మంటారు. మనసులో కోరికతో పాదపూజ చేస్తే ప్రమాదం. 'పాదాలు' – శరణాగతి చెయ్యడానికే గాని కోరికలు తీర్చుకోవ డానికి కాదు. ఇదెలాగంటే ఒక నిదర్శనం.

మన దగ్గర డబ్బులేదని బ్యాంకుకి వెళ్ళి చెక్ రాసియిస్తే మన డబ్బు యిస్తారా ? మన 'కాష్ అకౌంట్' చూసి డబ్బు ఉంటేనే యిస్తారు. ఈ బ్యాంక్ కాదని యింకొక బ్యాంక్‌కి వెళ్ళి నంత మాత్రాన వాళ్ళు మాత్రం డబ్బు యిస్తారా ? డబ్బు యివ్వడమనేది మన అకౌంటును బట్టి ఉంటుంది. భగవంతుడు ఏ పనైనా ఆలస్యం చేస్తున్నాడంటే దానికి తగిన కారణం ఉంటుంది. ఆ నమ్మకం గనుక మనకుంటే రోజుకి వెయ్యిసార్లు ప్రార్థన చేయ నక్కర్లేదు ! భగవంతుణ్ణి ప్రతి విషయానికి వేధించకూడదు. వేధిస్తే విసుగు వస్తుంది. భగవంతుడు ఉన్నాడన్న విశ్వాసం ఎంత అవసరమో. ఆయన ఎప్పుడూ మనకు మేలే చేస్తాడన్న నమ్మకం కూడా అంతే అవసరం ! అప్పుడు దేనిగురించికూడా భయం ఉండదు. ప్రతిదానికి ఏడ్చి హైరానా పడనక్కరలేదు. భగవంతుడు విశ్వమంతా వ్యాపించి ఉన్నప్పుడు మనల్ని విడిచి ఎక్కడకు పోతాడు ? ఆయన మేలు చేయదల్చుకుంటే మనం ఎక్కడున్నా చేస్తాడు. భగవంతుడు ఏదైనా తీర్చలేదంటే తగినంత కారణం ఉంటుంది. కోరినంత మాత్రాన మానడు !

## ప్రార్థనతో కోరికలు తీరుట ఎలా ?

భగవంతుడు అన్ని విషయాలూ ఎలా అయితే గ్రాంటు

చెయ్యడో, అలాగే ప్రార్థన చేసే విధానం సరిగ్గా తెలియక పోయినా భగవంతుడు గ్రాంటు చెయ్యడు. దానికి ఉదాహరణ ఒకటి చెప్పవచ్చు. మన దగ్గర టెలిఫోను ఉంది. అవతలి వాళ్ళకి మనం ఫోను చెయ్యాలి. ఫోను ఎత్తి మాట్లాడేస్తే వస్తుందా ! ఫోన్ నెంబరు తెలియాలి ! దానికి కొంత టైము పడుతుంది ! ఇలా కొన్ని రూల్సు ఉంటాయి. కోరికలు కోరేటప్పుడు 'రూల్సు' గనుక పాటిస్తే అవి తప్పక నెరవేరుతాయి.

1) మనసులో ఒక్క కోరిక మాత్రమే ఉండాలి ! మిగిలినవి మర్చిపోవాలి అంతేగాని కోరికల లిస్టు పెడితే మట్టుకు జరగదు ! భగవంతుడు మనం అడిగినవి, మనకు అవసరమైనవి యివ్వటమే కాకుండా· అప్పుడప్పుడు చిన్నపిల్లలకి మనం ఎలా అపకారం చెయ్యని వస్తువులు పెడతామో – అలాగ మనం అడిగిన వాటిలో కూడ, మనకు అపకారం చెయ్యని కోరికలనే అనుగ్రహిస్తాడు !

2) దేవుడిని అడిగేటప్పుడు మనస్సంతా ఖాళీచేసి, నిర్మలంగా ఉంచి, నిశ్చింతగా ఉంచి, అప్పుడు ఏకాగ్రతతో మన కోరికను నివేదించాలి

కోరిక కోరడానికి – నివేదించడానికి తేడా ఏమిటంటే అనుగ్రహం ఇమ్మని లాక్కునేది కాదు. అడిగి తీసుకోవాలి కాని డిమాండ్ చెయ్యకూడదు. అందుకే ముస్లింలు ప్రార్థన చేసేటప్పుడు రెండు చేతులు దగ్గరకు పెట్టి దోసిలి పడతారు. అంటే భగవదనుగ్రహం ప్రసాదమన్న మాట.

దీనికి యింకొక కారణం కూడా ఉన్నది. చేతికి వెనకాల నెగెటివ్ కరెంటు, లోపలి ప్రక్క పోజటివ్ కరెంటు ఉంటుంది. అందుకే అరచేతిని ఎప్పుడూ ఆశీర్వదించడానికి, భోజనం చేయ డానికి ఉపయోగిస్తారు. వెనుక వైపు దేనికీ వాడరు.

3) అందువల్ల భగవంతుడిని మనంఏదైనా కోరిక కోరేటప్పుడు రిక్వెస్టుచేసి తీసుకోవాలి ! ఈ 'రిక్వెస్టు' చేసేటప్పుడు మనం భగ వంతుడిని దగ్గరలో ఉన్నట్లుగా భావించుకొని సంబోధించాలి ! ఎక్కడో దూరంగా ఉన్నాడనుకొని ప్రార్థనచేస్తే దానికి అలస్య మవుతుంది.

4) భగవంతుని దగ్గరగా ఉన్నట్లు భావిస్తే త్వరగా ఫలితాన్ని పొందవచ్చు ! నిజానికి భగవంతుడు దగ్గరగానూలేడు, దూరం గానూలేడు. ఎక్కడున్నాడు ? మనశరీరంలో. మనం ఎక్కడున్నాం? మనం ఎక్కడున్నామో ఆయనా అక్కడే ఉన్నాడు. దూరంగా వున్నాడనుకుంటే దూరంగా వెళ్ళిపోతాడు. దగ్గరగా వున్నాడను కుంటే దగ్గరగానే ఉంటాడు. దీనికి ఒక కథఉన్నది.

భారతంలో – ద్రౌపదికి సభలో అవమానం జరుగుతున్న పుడు ఆమె శ్రీకృష్ణుడిని శరణువేడింది. "శ్రీకృష్ణా ! ద్వారకా వాసా ! రక్షమాం శరణాగతిః" అన్నది ! కొంతసేపటికి కృష్ణుడు చీరలిచ్చి రక్షించాడు ! చాలాకాలం తరువాత ఒకనాడు పాండవులు అరణ్యవాసంలో ఉన్నపుడు శ్రీకృష్ణుడు వారిని చూడటానికి వచ్చాడు. అప్పుడు ద్రౌపది ఆయనను ఇలా అడిగింది – "అన్నా !

ఆరోజు నన్ను దుశ్శాసనుడు సభలోనికి జుట్టుపట్టి ఈడ్చుకుని వచ్చే వరకూ ఎందుకు ఆలస్యం చేశావు" ? అని.

అప్పుడు శ్రీకృష్ణుడు, 'అమ్మా ! ఆలస్యానికి కారణం నేను కాదు, నీవే ! నీవు 'ద్వారకావాసా' అన్నావు. ద్వారకకు నీపిలుపు అందేసరికి ఆలస్యమైంది ! నీవు హృదయవాసా అంటే నేను వెంటనే వచ్చేవాడిని ! నేను ద్వారకలోనూ ఉన్నాను. ఇక్కడ నీ హృదయంలోనూ ఉన్నాను. అని సమాధానమిచ్చాడు. కృష్ణుడికి పిలుపు అందలేదంటే శక్తిలేక కాదు. అది మన భావాన్ని బట్టి ఉంటుంది ! అందువలన భగవంతుని ఎప్పుడూ మనకు అతిసన్నిహితునిగా భావించి ప్రార్థించాలి అన్నమాట !

వీటన్నిటికన్నా మొదటిది సాధన ప్రారంభించటానికి కావలసింది ఆత్మపరిశుద్ధి. సద్గురువు దొరకటానికి కూడా మనం చేయాల్సిన సాధన ఈ ఆత్మ పరిశుద్ధే.



5

# సాధనలో ఆత్మపరిశుద్ధి

సాధనలో రెండవ మెట్టు ఆత్మ పరిశుద్ధి. అంటే మనలో ఉన్న దోషాలను పోగొట్టి మనస్సునూ, హృదయాన్నీ, జీవితాన్నీ, పరిశుద్ధంగానూ, పవిత్రంగాను, చేసుకోవడం ఈ దశలోని ముఖ్య సాధనాంశం. అంటే ఏమిటో వివరంగా తెలుసుకుందాం.

మనిషికి భగవంతుడు యిచ్చినవి మూడు పరికరాలు. ఒకటి మనస్సు, రెండవది మాట, మూడవది చేతులు (శరీరం), వీటినే త్రికరణములని అంటారు. యోగశాస్త్రములో ఈ మూడు పరికరములను పావనము చేసుకొనుటయే సాధనలోని ముఖ్యమయిన మెట్టు. ఈ త్రికరణములకు చేసే పరిశుద్ధికే "త్రికరణశుద్ధి"అని పేరు. ఈ మాటలను అందరూ ఉపయోగిస్తారు. కానీ ఈ 'త్రికరణ శుద్ధి' ఎలా ఏర్పడుతుందో ఎవరికీ తెలియదు. అది ఇక్కడ పరిశీలిద్దాం.

మనిషికి భగవంతుడిచ్చిన ఉపకరణములలో మాట ముఖ్యమైనది. ఇది ఒక శక్తి. అంటే మాట ద్వారా మనము ఇతరులకు హాని కలిగించవచ్చు లేదా ఎంతో ఉపకారము చేయనూవచ్చు. ఈ కారణం చేత మాట ఒక మహాశక్తి. ఒక మనిషికి ఒక చెడు వార్త చెప్పగానే – చెప్పినది కేవలం మాటే అయినా కాళ్ళూ

చేతులూ చచ్చుబడి నీరసంగా కూలబడిపోతాడు. ఏదైనా దుర్వార్త వింటే ఈ పరిణామాలు సంభవిస్తాయి. అంటే అవార్త ఆ మాట ద్వారా మనిషిలోంచి ఎంతో శక్తిని లాగివేసి ఆ మనిషికి నీరసం కలుగజేస్తుందన్నమాట. అలానే ఒక వ్యక్తిని మెచ్చుకున్నప్పుడు, అతనిపై విశ్వాసం ఉంచినప్పుడు, లేదా ప్రేమగా ఒకమాట చెప్పినప్పుడు, అతనికి కొండంత బలం కలుగుతున్నది. దీన్ని బట్టి చూస్తే ఒక్క మాటవల్ల శక్తిని పుట్టించనూవచ్చు. మనిషికి నిరుత్సాహము కల్గించనూవచ్చు. అందుకనే సాధకుడు మాటల ద్వారా తన శక్తిని చాలా జాగ్రత్తగా వినియోగించాలి. జీవితంలో చాలామట్టుకు మనిషి సంపాదించుకునే చెడుకర్మ ఎక్కువభాగం తనమాటను, దానిలో శక్తిని దుర్వినియోగం చేయడం వల్లనే కలుగుతుందని సాధకుడు గ్రహించాలి. అందుకే మనలోని వాక్‌శక్తి నియమంగా కంట్రోలుచేసి పెంపొందించితే చివరకు ఆమాటయే ఒక మంత్రంగా పనిచేస్తుంది. ఇదే వాక్కుతో మనంచేసే తపస్సు.

ఈ తపస్సులో ముఖ్యాంశాలు – ఒకటి మనం మాట్లాడేది సత్యంగా ఉండాలి. రెండు – అది వినేవారికి సంతోషకరంగా ఉండాలి (ప్రియంగా), మూడు – అలాగని ఎదుటి వాళ్ళకి ప్రియంగా ఉండాలి కదా అని అబద్ధాలు చెప్పరాదు. నాలుగు– అంతమాత్రంచేత సత్యమే చెప్పాలిగదా అని చెప్పేనిజాన్ని ఎదుటివాడి గుండెలు బ్రద్దలయేలాగ అప్రియంగానూ చెప్పరాదు. ఈ నాలుగు సూత్రాలు పాటిస్తూ మనం మాట్లాడే దానిలో సత్యం ఉండేలాగా అది వీలయినంతమటుకు సౌమ్యంగానూ, వినేవాడికి ప్రియం

గానూ ఉండేలాగ మాట్లాడటం అవసరం. ఆమాట ఎదుటివాని హితం కోరి అంటే కేవలం ముఖప్రీతి కోసం, ఎదుటివారి మెప్పు కోసం మాట్లాడటం కాకుండా; ఎదుటివానికి మేలు చేకూర్చే విధంగా వారి హితాన్ని కోరి తగినంత ప్రియంగా చెప్పాలి. ఇదే వాక్కుతో చేసేసాధన.

## మాటల నియమం :

పై నాలుగు సూత్రాలే కాకుండా అసలు సాధకుడు మాటల వల్ల ప్రపంచంలో ఎన్ని అబద్ధాలు జరుగుతున్నాయో గమనించి అలాంటివి తనవల్ల జరగకుండా శ్రద్ధ తీసుకోవాలి. అన్నింటిలోనూ ముఖ్యమైనది వాకెనియమం. అంటే మాటల కంట్రోలు చేసుకోవడం ఒకటి – (మాట్లాడటం వీలయినంత తగ్గించాలి). మాటల ద్వారా చాలాశక్తి గాలిలోకిపోయి తద్వారా సాధకుని శక్తి వృధాగా ఖర్చు అయిపోతుంది. దీనిని అరికట్టడంద్వారా మనస్సుకు ఏకాగ్రత పెరిగి సంకల్పశక్తి వృద్ధి అవుతుంది. అంతేకాక మాటలు తగ్గించడంవల్ల సాధనకూడా బలపడుతుంది. అందుకే ప్రాచీన ఋషులు మౌనమునే సాధనగా చేసేవారు.

## మౌనం :

మౌనం అంటే కేవలం నోరుమూసుకొని మనస్సులో రకరకాల మాటలు మననం చేస్తూ ఉండటం కాదు, నిజమైన మౌనం ఏదంటే – మనం మాట్లాడకుండా కూర్చున్నప్పుడు మన మనస్సు కూడ మౌనంగా వుండాలి. అంటే బాహ్యమౌనం, అంతర్‌మౌనం

జరిగేలాగ మౌనం చేయాలి. దీనికి ఒక సాధన అవసరం. అదేమి టంటే మనస్సుకు తోచినట్లల్లా మాటను పోనివ్వరాదు. ఆవేశంలో నోటికి వచ్చినట్లు మాట్లాడటం, ఉత్సాహంలోనూ, సంతోషంలోనూ బడాబడా వళ్ళు తెలియక మాట్లాడటం, విరోధం, ద్వేషం కలిగి నప్పుడు పట్టరాని అసూయతో, అక్కసుతో; ఎంత మాటపడితే అంత మాట ఎదుటి వారిపై ప్రయోగించడం. ఏమీ తోచనప్పుడు ఉబుసు పోక అవీ, ఇవీ ప్రోగుచేసి వ్యర్థంగా మాట్లాడటం – ఈనాలుగు దోషాలవల్ల మనిషికి మనసులో మాట్లాడుకునే దురలవాటు కలుగు తుంది. దీనివల్ల రాత్రింబవళ్ళు కలలో మాటలూ, వాక్యాలూ దొర్లుతూ చివరకు నిద్రను పాడుచేస్తాయి. సాధనలో అనుభవం లేని వ్యక్తి ఇవి ఆలోచనలనుకుని భ్రమిస్తాడు. ఇది చాలా తప్పు. ఎందువల్లనంటే మనం చాలా మటుకు ఆలోచనలనుకుని భ్రమ పడేవి మనలో మనం వల్లించుకునే మాటలేకాని ఆలోచనలు కావు.

## నిజమైన ఆలోచనలు ఎలావస్తాయి ?

మనలో మనకు నిత్యం జరిగేది మానసిక సంభాషణే కాని, ఆలోచనకాదు. మరి ఆలోచనలంటే ఏమిటి ? నిజమైన ఆలోచ నకు, మనలోపల మనం మాట్లాడుకునే మాటకూ తేడా తెలియా లంటే ఒకటేగుర్తు ! మనకు వచ్చినది నిజమైన ఆలోచనయితే అప్పుడు మన మనస్సులో ఉన్న సమస్యలకి ఒక నివారణ మార్గం కనబడాలి. అలాగ సమస్యలకు సమాధానమిచ్చేది నిజమైన ఆలో చన. ఈ దృష్టితో చూస్తే మనం చేసేది చాల మటుకు ఆలోచన కాదని మీకే తెలుస్తుంది. ఆలోచనల రూపంలో మన తలలో తిరి

గేది మానసిక సంభాషణ (Internal talking). దీన్ని అరికట్టి నప్పుడే మనిషికి జీవితంలో అన్ని పనులలోనూ జరిగే దురదృష్టం తొలగి అదృష్టము, పనులు కలిసి రావడం ఆరంభమవుతాయి. దీనికి మానసిక మౌనం నేర్వాలి. అంటే మనలో మనం మాట్లాడు కోవడం పూర్తిగా ఆగిపోవాలి.

ఇది మొదట్లో సాధ్యపడటం కష్టం – దీన్ని అరికట్టేందుకు కొన్ని చిన్న చిన్న ఉపాయాలున్నాయి. వాటిని అనుసరించవచ్చు. ఒకటి–మనస్సులో మాటలు (ఆలోచనలు) ఎక్కువగా వస్తున్న ప్పుడు తీవ్రమయిన ప్రాణాయామం చేసి, తద్వారా ఆ ఆలోచన లను భస్మం చేయవచ్చు. రెండవది – వెంటనే ఒక నిస్వార్ధసేవ అంటే ఇతరులకు ఉపయోగించేది, తనకు ఏ ఉపయోగం లేనిదీ మొదలు పెట్టాలి. ఇది అలవాటుగా చేయాలి. అప్పుడే క్రమ క్రమంగా మనలో మనం మాట్లాడుకునే అలవాటు తగ్గిపోతుంది. మూడవది – ఒక ఆరాధ్యమైన గురువును లేదా ఆధ్యాత్మికలక్ష్యాన్ని ఏర్పరచుకోవాలి. అన్నిటికన్నా ముఖ్యంగా గురువు సన్నిధానము మనస్సును పరిశుద్ధం చేస్తుంది. గురువుపైన తనకు పూర్తి విశ్వాసం, గురువుకు తనపై పూర్తి అనుగ్రహం – ఈ రెండు ఉన్నప్పుడే పూర్తిగా మానసిక మౌనం సిద్ధిస్తుంది. అంటే మనస్సులో మాటలు ఆగిపోయి ప్రశాంతత, మౌనము, ఒకానొక మాటల కందని ఆనం దము పొంగివస్తాయి. ఇదే మాటలతో చేసే సాధన.

ఇంతవరకూ మాటలద్వారా చేయవలసిన సాధన గురించి తెలుసుకున్నాము. ఇప్పుడు మాటలద్వారా చేయకూడనిది ఏమిటో

తెలుసుకుందాము. సర్వసాధారణంగా అందరూ చేసే పొరపాటు ఇతరుల దోషాల గురించి మాట్లాడటం. ఇదీ సాధకునికి జరిగే గొప్ప అపకారం. అంటే సాధనలో అంతరాయాలు ఏర్పడటానికి ఇతరుల దోషాల గురించి మాట్లాడటమేనని చాలామందికి తెలియదు అధ్యాత్మికంగాచూస్తే ఒక మనిషి పరోక్షంలో అతని దోషాల గురించి మనం విన్నప్పుడు, ఆదోషాల తాలూకు అచ్చులు కార్బనుపేపరు మీద అక్షరాలవలె మన మనస్సులో ముద్రించుకుంటాయి. ఇది ఎంత వద్దనుకున్నా మనస్సులో జరిగే ఆధ్యాత్మిక ప్రక్రియ. దీని వల్ల మనస్సు పరిశుద్ధత నశించిపోతుంది అంటే మనస్సులో వున్న పవిత్రత పోయి మన మనస్సు ఒక చెత్తకాగితాల కుండీవలె తయా రవుతుంది. అంటే ప్రపంచంలో జరిగే ప్రతి చెడు విషయము మన మనస్సులోకి తీసుకుంటున్నా మన్నమాట! దీనివల్ల నాలుగు నష్టాలు సాధకుడికి కలుగుతాయి. ఒకటి – మనస్సు నిర్మలత పోతుంది. రెండు – మనస్సు ధ్యానం కోసం కూర్చున్నప్పుడు ఏకాగ్రత కుదరక పరిపరి విధాల పరుగెత్తుతుంది. అంతేకాక మనం విన్నవీ, మనం మాట్లాడినవీ మనలో జీర్ణించుకుపోయి; చెడు సంస్కారాల రూపంలో చెడు కర్మకు ఆధారంగా ఏర్పడి దానివల్ల మనస్సు ఏకాగ్రత సాధ్యపడని స్థితికి మనల్ని తీసుకుపోతాయి. మనస్సుని ఇలాగే వదిలేస్తే మనం విన్నవీ, మాట్లాడినవీ అన్నీ కలిసి మనస్సంతా నిండిపోయి ఒకవార్తా పత్రిక లేక న్యూసుపేపరు లాగ ఊరిలో జరిగే చెత్త విషయాలతో నిండిపోతుంది. అందుకని వార్తా పత్రికలు, వారపత్రికలు, కాలక్షేపం రచనలు – వీటిద్వారా మనస్సులోకి ఎక్కించే విషాన్నీ, ఆలోచనలనూ వెంటనే కట్టి వేయాలి.

మనస్సును వీలయినంత సేపు ఖాళీగా, విశ్రాంతిగా వుంచాలి. దీనివల్ల మనస్సుకు బలం కలుగుతుంది. మనస్సు విశ్రాంతిని పొందుతుంది. అవసరమైన ఆలోచనలు చేసే అలవాటు పోతుంది. తద్వారా మనస్సు నిర్మలం అవుతుంది. మనస్సు నిర్మలం అయితేనే ఆ మనస్సు ధ్యానానికి పనికి వస్తుంది.

అన్నిటితో నిండివున్న మనస్సు మలినముతో నిండివున్న ఇల్లు అలికే గుడ్డవంటిది. ప్రతి విషయాన్నీ విని, ప్రతిదీ చదివి మనస్సును ఇల్లు అలికే గుడ్డగా చేసుకోరాదు.

ఇతరుల దోషాలు వినడం ఎంత చెడో, ఒకరి గురించి పుకారులు, అనుమానాలు, వారిలోపాల గురించి (తెలిసినా, తెలియకపోయినా) మాట్లాడటం అంతకంటే ఎక్కువ అపకారం. ఈ అపకారం బయటవ్యక్తికి జరిగేకన్నా అలా వాడిగురించి మాట్లాడే మనకే ఎక్కువహాని. విన్న ప్రతిమాటను కనబడిన ప్రతి వాళ్ళతో ప్రచారం చేయడం, అందులోనూ, "విన్నావా ? ఫలానా వాడు ఇలాగట, అలాగు చేసేట్ట" అంటూ విన్నవీ, కన్నవీ కలబోసి ఏకరువు పెట్టడం తన ఆధ్యాత్మిక జీవితాన్ని నాశనం చేసికోవడానికి సూటి అయిన పద్ధతి.

ఎదుటి వాడిలో తప్పు ఉన్నదా ? లేదా ? అన్నమాట సాధకుడికి అనవసరం. బయట వినే ప్రచారంలో నిజం ఎంత అన్నది కూడా అప్రస్తుతమే. తను మాటాడే చెడులో నిజం వున్నంత మాత్రాన ఆ చెడు తన మనస్సును, తన కర్మను కలుషితం

చేయడం మానదు. మానవుడి అంతరాత్మ ఒక సరిక్రొత్త టేపు వంటిది. విన్న ప్రతిమాట, అన్న ప్రతిమాటా తన హృదయంలో, అంతరాత్మలో టేపు రికార్డు (Tape Record) లాగ ముద్రించుకు పోతుంది. అది తను మరణించిన తరువాత ఆ వచ్చే జన్మలో కూడా తన అత్మమీద ముద్రించబడివున్న ఆ చెడుసంస్కారాల తోనే తిరిగి జన్మిస్తాడు. అవే ధ్యానం చేసేటప్పుడు లోపలనుంచి కలిగే చెడు అలోచనలు. ధ్యానం చేయగా చేయగా, లోపల వున్న ఆచెడు సంస్కారాలన్నీ (విన్నవీ, కన్నవీ, చదివినవి) పూర్తిగా బయటకు వచ్చేయాలి. అప్పుడు మనస్సు స్ఫటికంలాగ నిర్మలం అవుతుంది.

అంతరాత్మ నిర్మలత్వానికి మన మనస్సు నిర్మలంగా వుండటం అవసరం. మనస్సు నిర్మలత్వానికి ఆ మనస్సులోపడే చెడుముద్రలు, చెడు సంస్కారాలూ లేకుండా వుండటం అవసరం. మనలోకి ప్రవేశించే చెడు సంస్కారాలు మనం విన్న వాటివల్ల, చదివిన వాటివల్ల, మనం దానియందు అసక్తి చూపడంవల్ల, ఇతరుల చెడు గురించి మనం మాట్లాడే మాటలవల్ల ముఖ్యంగా ఏర్పడతాయి.

ఇంతవరకూ త్రికరణములలో మొదటిదైన మనస్సును గురించిన సాధనా విషయాలను గమనించాము. ఇక మిగిలిన రెండూ – మనస్సు, చేతలు. వాటి గురించిన వివరాలు ఏమిటో గమనిద్దాము.

sanare

## మనము - మన చేతలు :

సాధనలో మనలను బాగు చేసుకోవాలన్నా, పాడుచేసుకోవా లన్నా ముఖ్యమైన పరికరం మన చేతలు (నడవడిక).

"చేత" అంటే చేసేపనులు – అనగా మన శరీరం పని ముట్టుగా ఉపయోగించి ఈ జీవితంలో చేసే పనులన్ని ఒకతాడు పేనినట్లు చుట్టుకొనిపోయి మన కష్ట సుఖాలకు కారణమయిన కర్మసూత్రాన్ని ఏర్పాటు చేస్తాయి. అందుకే ఈ చేతలు మన భవిష్యత్తులోని జీవితానికంతటికీ కారణమైన కర్మ.

## జీవితంలో కష్టసుఖాలు :

చాలామంది ఈ ప్రపంచంలో కష్టాలు పడటం చూస్తూనే వుంటాము. ఈ కష్టాలు అనేకం. కొందరికి ఆర్థిక ఇబ్బందులు వుంటే మరికొందరికి అనారోగ్యం, మరికొందరికి మానసిక దుఃఖం ఇలా ప్రపంచములో అనేక మంది సమస్యలతో కొట్టుమిట్టాడుతూ వుంటారు. "వీటన్నిటికి కారణం ఏమిటి ?" అని ఆలోచిస్తే – అది దేవుడు చేసినదికాదు. మన కష్టాలకు కారణం మనము చేసు కున్న చెడుకర్మే. అందుకే చేతలు చాలా ముఖ్యమయినవి.

మనకు కష్టాలు, చెడుఫలితాలు రాకుండా ఉండాలను కుంటే మనచేతలలో, మాటలలో, చెడు ఫలితాలు కలిగించే పనులు చేయకుండా ఉండాలి. దేవుడు సాయం చేయడా అంటే– మనిషి చేసుకున్న కర్మ మనిషియే అనుభవించాలి. కనుక సాధ

కుని కర్మతో దైవానికి నిమిత్తము లేదు. ఇదివింటే చాలా బాధగా ఉంటుంది. కాని యిదే కఠోరమైన సత్యం. దానికి కారణం ఏమిటి అని ఆలోచిస్తే ఈ ప్రకృతి వెనుక ఉన్న ఒక మూల సూత్రం – గోడకు గట్టిగా బంతిని విసిరివేస్తే అది తిరిగి మనవైపుకి వస్తుంది. అద్దంలోకిచూస్తూ నమస్కారంపెడితే మనకే తిరిగి నమస్కారం కనిపిస్తుంది. అద్దంలోకిచూచి వెక్కిరిస్తే అదే తిరిగి మనకు వర్తిస్తుంది. ఇదే సైన్సు పరిభాషలో చెప్పాలంటే న్యూటన్ సిద్ధాంతంలో (Newton's Laws of Motion) ప్రతిదానికి ఫలితము సమానముగా వుంటుంది. Action and Reaction equal and opposite. ఈ సూత్రం సైన్సు అంతా ఆమోదించినదే. ఇదే సూత్రం జీవితములో మనం చేసే ప్రతి పనికి వర్తిస్తుంది. అంటే చేసే ప్రతి పనికి 'రియాక్షన్' (Reaction) అంటే ప్రతిఫలం వుంటుందన్న మాట. ఇదే కర్మ సిద్ధాంతం యొక్క రహస్యం. దీనికి భగవంతునితో నిమిత్తం లేకుండానే పనిచేస్తుంది. ఎందుకంటే పదార్థంలో వున్న లక్షణమే (Properties of matter) ఈ కర్మకు కారణం.

## నాస్తికుడయినా కర్మను అనుభవించాల్సిందే :

చాలామంది అనుకుంటారు – 'తాను నాస్తికుడు, దేవుడంటే నమ్మకంలేదు కాబట్టే కర్మగిర్మ అంటే తనకు విశ్వాసం లేదు' అని. అలా అని అంతమాత్రంచేత కర్మ ఫలితాన్నుంచి అతడు తప్పించుకోలేడు, భగవంతుని నమ్మినా, నాస్తికుడయినా ప్రతివాడు తానుచేసే చర్యల ఫలితం తప్పక అనుభవించాల్సిందే. ఇది పదార్థమయ ప్రపంచము యొక్క స్వభావం, అంటే భౌతిక

ప్రపంచములో సైన్సుకుకూడ కనబడే నగ్న సత్యం. వాడు నాస్తికుడయినా ఆస్తికుడయినావాడి చేతలకు ఫలితం తప్పదు. నాస్తికత్వంతో దుర్మార్గపు కర్మను తప్పించుకోవడం అసంభవం. ప్రకృతి సత్యాలైన ఎండ, వాన, చలి, వేడి, సుఖం – ఇవి మనం నమ్మకపోయినా వాటి ప్రభావం మనపైన వుంటుంది. అలాగే కర్మకూడా ప్రకృతి సత్యం (Law of nature). అందువల్లనే మన చేతలు, వాటి ఫలితాలు సాధనలో చాలా ముఖ్యమైన అంశము.

కష్టంలో వున్నవారికి సహాయం చేయడం, తనకు కలిగిన దానిని లేని వారితో పాలు పంచుకోవడం, దుఃఖంలో వున్న వారికి తనకు శక్తి వున్నంతవరకూ నిరాశకల్గించకుండా సాయం చేయడం– ఎవ్వరినికూడా ఎట్టి పరిస్థితిలోనూ అవమాన పరచకుండా, మోసం చేయకుండా, ద్రోహం చేయకుండా జాగ్రత్త పడటం, ఈ సూత్రాలు నిక్కచ్చిగా పాటించడంవల్ల భవిష్యత్తులో తనకు చెడుకర్మ పెరిగిపోకుండా సాధకుడు జాగ్రత్త తీసుకోగలుగుతాడు.

ఇక గతించిన చెడుకర్మనూ, దాని చెడు ఫలితాలను ఎదుర్కోవడం ఎలాగా అన్నదే సమస్య. జరిగిపోయిన చెడు కర్మలో ముఖ్యంగా మూడురకాలు 1) దృఢకర్మ – (తీవ్రమైన చెడుకర్మ). దానికి నివారణలేదు. అంటే ఫలితం అనుభవిస్తేనేకాని పోదు. సాధారణంగా గతంలో మనం బుద్ధిపూర్వకంగా తెలిసి చేసిన ద్రోహం, మోసం, అపకారం పూర్తి బాధ్యతతో సంకల్పించి చేసిన చెడు అంతా ఇలాంటి దృఢకర్మగా పరిణమిస్తుంది. తెలిసి చేసిన చెడు కర్మకు ఫలితం తప్పక అనుభవించ వలసిందే.

2) అదృఢకర్మ : ఈ రెండవ తరగతి చెడుకర్మ తెలియక చేసినది, అంటే బుద్ధిపూర్వకంగా కాకుండా ఫలితాలు తెలియకచేసిన చెడు లేక స్వల్పమయిన చెడు కార్యాలవల్ల ఏర్పడే ఫలితాలు ఈ తరగతిలోకి వస్తాయి. దీని ఫలితాలు ఈ జీవితంలోనే చాలావరకు తప్పించుకోవచ్చు. ఉపవాసం, గ్రహశాంతులు, అర్చనలు, ఇతరుల కోసమై శ్రమించడం; చేసిన మంచి పనికి ఫలితం తీసుకోకుండా భగవంతునికి లేదా గురువుకు సమర్పించడం, కూలీ (ప్రతిఫలం) తీసుకోని పని, అన్న దానం, సత్పురుషుల సేవ, గోసేవ వంటి పుణ్యకర్మలవల్ల ఈ రెండవరకం కర్మను నివారించుకొనవచ్చును. జాతకంలోని చెడు గ్రహాలకు శాంతి, దానము, ఉపవాసము, పశ్చాత్తాపము, ప్రార్థనవంటి ప్రాయశ్చిత్తముల ద్వారా ఈ చెడు కర్మను నివారించుకొనవచ్చును. 3) చెడు కర్మల మిశ్రమము. దానికే దృఢ–అదృఢకర్మ అనిపేరు. అంటే కొంత తీవ్రమైన చెడు కర్మ. మరికొంత స్వల్పమైన చెడుకర్మ కలసిన కర్మఫలం, దాని వల్లనే మనకు జీవితంలో కలిగే చాలమటుకు సంఘటనలు ఏర్పడుతాయి. ప్రయత్నంచేసి నివారించుకోగల చెడుకర్మ వుంటుంది. అంతవరకూ ప్రయత్నం ఫలిస్తుంది. కాని మన పురుషకారం లేక మానవప్రయత్నం నూటికి నూరుపాళ్ళు సిద్ధించదు. అంటే ప్రయత్నము చేసినంతాఫలితమురాదు. కారణం దానికి సగం దృఢమైన కర్మ అడ్డుగా వుండటమే. అలాగని ప్రయత్నము చేయడము వ్యర్థమూకాదు. ఎందుకంటే ప్రయత్నానికి కూడా ఫలితం వుంటుంది. అలాగని పూర్తిగా ప్రయత్నించినంతా ఫలించదు. అవకాశము, సహాయము, ప్రోత్సాహము, సమాజము, కాలము అన్ని వస్తువుల ద్వారా మన ప్రయత్నము పరిమితమై ఉంటుంది. ప్రయత్నము + పరిస్థితులు = జీవితము.

ఈ ధృఢాదృఢ కర్మవల్లనే జీవితంలో మనం చేజేతులా చేసికోగల అపకారం లేక మనకు మనం చేసికోగల అభివృద్ధీ (మంచి) మన చేతలమీద ఆధారపడి వుంటాయి. ప్రయత్నంవల్ల, సహాయంవల్ల, దైవానుకూలతవల్ల ఈ దృఢాదృఢ కర్మని సగం వరకూ నశింపు చెసికొనవచ్చు. తక్కిన సగం అనుభవించాల్సిందే! కాని ప్రయత్నం చేయకపోతే మాత్రం మొత్తం చెడు అంతటినీ అనుభవించవల్సి వస్తుంది. సాధనతో దీన్ని చాలా మార్చుకోవచ్చు. దృఢమయిన జీవితలక్ష్యం వల్ల, సమర్థుడైన సద్గురువు సహాయంతో, క్షణక్షణానికీ మనస్సులో వచ్చే చంచలత్వాన్ని కంట్రోలు చెయ్యాటంవల్ల ఈ మూడవరకపు చెడుకర్మను చాల మట్టుకు తగ్గించుకోవచ్చు.

ఈ చేతలకు ముఖ్యమైన పనిముట్టు శరీరం. "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం" అంటే "అన్ని ధర్మాలనూ సాధించడానికి మొదటి పనిముట్టు శరీరమేగదా" అని ప్రాచీన ఋషుల సూక్తి ! అందుకని ఈ శరీరాన్ని పనిముట్టుగా ధర్మాన్ని అచరిస్తూ తద్వారా మన చెడు కర్మను తగ్గించుకుంటూ పోతే వెళ్ళినకొద్దీ సాధనలో పురోగమించ వచ్చు. సాధనకు పరికరమయిన త్రికరణములలో రెండవదయిన చేతలు (శరీరము, కర్మ) గురించిన సాధన సూత్రాలు ఇంతవరకూ గమనించాము.

ఇవి ఒక్కసారి చదివి మర్చిపోతే చాలదు. ఈ చిత్రాలను ప్రతి నిత్యం పాటించుకుంటూ, ఒకడైరీగా ప్రతి నిత్యం మన జీవితాన్ని నోటుచేసుకుని పోతూ వుండాలి. ప్రతి రాత్రి నిద్రించే ముందు జరిగిన రోజులోని మన కర్మలనూ, మనతప్పులనూ,

sample

మన విజయాలనూ సమీక్షించుకుని – ప్రొద్దున్నే లేవగానే రానున్న దినంలో తను జాగ్రత్త పడవలసిన ప్రతిముఖ్యసూత్రాన్ని గుర్తించుకొని సాధకుడు ముందుకు సాగాలి. అప్పుడే ఈసూత్రాలవల్ల మేలును మీరు నిజంగా పొందగలుగుతారు. కేవలం మనస్సుల్లో తెలుసుకోవడం కాదు.

## మనసు :

త్రికరణములలో మూడవది 'మనస్సు'. అంటే మాటలు. చేతలు సరిగ్గా వుండేలాగ చూసుకుంటే వచ్చే ఫలితమే మనస్సు. మన చేతలను మాటలను పైన చెప్పిన అధ్యాత్మిక సూత్రాల ద్వారా పవిత్రం చేసుకుంటూపోతే ఫలితంగా బాగుపడేది మనస్సే.

కాబట్టి పవిత్రం చేయబడిన మనస్సే మోక్షానికి, కారణమవుతుంది. అలాగే చెడు కర్మలతో మైలబడిన మనస్సే బంధానికి, కష్టాలకూ కారణమవుతుంది. అందుకనే ప్రాచీన ఋషులు మనస్సే మనిషికి బంధ మోక్షాలను ఇచ్చే కారణం అన్నారు.



6

# శరీరముతో యజ్ఞము నిస్వార్థ కర్మయే సాధన!

చాలమంది యజ్ఞం అంటే ఒకచోట మంటచేసి అందులో నెయ్యిపోయడం అనుకుంటారు. ఇది కేవలం సినిమాలు చూసి అనుకునే భ్రాంతి, అగ్నితో చేసే దానిని "హెూమం" అంటారు. బైబిల్‌లో దీనిని **Burnt Offering** అని ప్రాయశ్చిత్తకాండము **(Leviticus)** లో పేర్కొన్నారు. యజ్ఞములు పలువిధాలుగా వున్నవి. కొన్ని పదార్థాలతో చేసే యజ్ఞములు. వీటిని ద్రవ్య యజ్ఞములు అంటారు. తపోయజ్ఞము అనబడే యజ్ఞ విధానములో వస్తువులు లేకనే తపస్సును ఆధారం చేసుకొని యోగినడిపే యజ్ఞక్రియ. ఇందులో కన్ను, ముక్కు, చెవిలాంటి సర్వేంద్రియాల ద్వారా తనకు లభించే సుఖదుఃఖములను అంతరాత్మ యందు మనోనిగ్రహము ద్వారా వ్రేల్చి (హుతముచేసి) యజ్ఞముగా చేయును. ఇందులో జ్ఞానమే అగ్ని. ఇంద్రియములు ఇంథనము ఇంద్రియార్థములు ఆజ్యము (నెయ్యి), ప్రాణము హవిస్సు, ఈ విధముగా చేయబడునది జ్ఞానయజ్ఞము. ఇలాగే ప్రాణయజ్ఞము కూడా కలదు. మన శరీరములో పంచప్రాణములు వుండును. అవి :



Sundare

1) ప్రాణము 2) అపానము 3) వ్యానము
4) ఉదానము 5) సమానము

ఈ ఐదు ప్రాణములలోనూ ప్రాణమును అపానమునందూ, అపానమును ప్రాణమునందూ హవిస్సుగాచేసి ప్రాణయజ్ఞమును చేయవలెను. ప్రాణాపానములను సమానము చేసి ప్రాణాయామ స్వరూపమైన ఈ ప్రాణ యజ్ఞము ద్వారా ఉచ్ఛ్వాస, నిశ్వాసము లను రెండింటినీ పూర్తిగా సమముచేసి యోగి ముక్తస్థితిని పొందు టదే యోగయజ్ఞము. లోనికిపోవు శ్వాస, బయటికి విడుచు శ్వాస రెండునూ సమమైనప్పుడు మనిషికి ఊపిరిపీల్చుటయూ, విడచు టయూ నిలచిపోవును. దీని వలన "కేవలకుంభక" మేర్పడును. ఆ స్థితిలో యోగికి ఊపిరి పీల్చుటయు (పూరకము), లేక ఊపిరి విడుచుటయు (రేచకము) రెండునూ ఆగిపోయి కుంభకము కలు గును. అప్పుడు కుడిముక్కులో శ్వాసద్వారా పనిచేయు సూర్య నాడియు, ఎడమ ముక్కులో శ్వాసద్వారా పనిచేయు కేంద్ర నాడియు, రెండూ లయమై సుషుమ్న నాడి పనిచేయును. ఇది సమాధిస్థితి. ఈ స్థితిని చేరిననాడు ఉత్తమమైన (పురుష సూక్తము లోని పురుషుడే) ధామమును లేక నారాయణ పదమును పొందును. ఇదియే పురుషోత్తమ (పురుష + ఉత్తమ) ప్రాప్తి లభించు యోగము.

ఇదే విధంగా స్వాధ్యాయ యజ్ఞము – అంటే వాక్కు రూపంలో వేద మంత్రాల ద్వారా గానం చేయబడే వాగ్యజ్ఞము కూడా యజ్ఞమే. ఇందులో కూడ ప్రాణము అపానముతోను, అపా నము ప్రాణముతోనూ కలిసికొన్నట్టుగానే మన నోటిలోని నాలుక

ద్వారా పై దవడ; క్రింద దవడ కలిసి వాక్కు ఏర్పడి శబ్దము పుట్టుచున్నది. పై దవడ తండ్రి. క్రింద దవడ తల్లి, నాలుక రెండింటికి సంధి (సంధానము). అలాగే ఆకాశము పైదవడవలె తండ్రి. భూమి క్రింద దవడవలె తల్లి. వర్షము సంధి. మెరుపులు నాలుకతో శబ్దమువలె సంధానము. ఈ విధముగా శబ్ధముద్వారా వేదమంత్రముల శక్తి నాలుకలో కరెంటువలె పైదవడకు అంటు కొని దానిపైనఉన్న అమృతనాడిని మేలుకొలిపి సమాధిని కలిగించును. ఇది వాక్కులచే యేర్పడు యజ్ఞము. ఇక్కడ వాక్కు అనగా వేదమంత్రము అని అర్థము.

ఈ విషయము ఉపనిషత్తులో ఇలాగ వివరింపడివుంది.

"అధరాహనుః పూర్వరూపం
ఉత్తరాహను రుత్తర రూపం
వాక్సంధిః జిహ్వా సంధానం"

క్రింది దవడ పూర్వరూపము, పై దవడ ఉత్తరరూపము, వాక్కు సంధి, నాలుక సంధానము అని అర్థము,

"ఆకాశః పూర్వ రూపం
పృధి వ్యుత్తర రూపం
వైదుత స్సంధానం"

(ఆకాశము పూర్వరూపము, పృథ్వి ఉత్తరరూపము, వర్షము సంధి. మెరుపులు (విద్యుత్తు సంధానము.)

Sanare

అని పై విధముగా వాగ్యజ్ఞము ఎలా పనిచేస్తుందో తెలిసి యున్నది.

అలాగైతే యజ్ఞమే సంవత్సరమన్నారుగదా, ఈ సంవత్సర ములో ఆరుమాసాలు ఉత్తరాయణం. ఆరుమాసాలు దక్షిణా యనం వున్నదికదా ? అని సందేహం రావచ్చు. అందుకనే పురుషసూక్తము 'అహోరాత్రౌపార్శ్వే' అంటే అహోరాత్రము ఈ యజ్ఞపురుషునకు రెండు పార్శ్వములు అని చెప్పుచున్నది. అంటే భూగోళంపైన ఒక సగం చీకటి (రాత్రి), ఒక సగం సూర్య రశ్మి (పగలు) పడుతుండా, ఈ సూర్యభాగము, రాత్రి భాగము రెండూ రెండు పార్శ్వముల వలె నున్నవి అని అర్థము.

మన శరీరములో కుడి ప్రక్క సూర్యనాడి, ఎడమ ప్రక్క చంద్రనాడి రెండు పార్శ్వములలోనూ పనిచేస్తున్నాయి. దివా రాత్రములవలే 'అహో రాత్రౌపార్శ్వే' అంటే అర్థమిదే, ఒకటి సూర్యుడు, ఒకటి చంద్రుడూ, ఒకటి రాత్రి, ఒకటి పగలు. ఒకటి ఉత్తరాయణం, ఒకటి దక్షిణాయనం. ఒకటి శుక్లపక్షము, ఒకటి కృష్ణపక్షము. ఇలాగ రెండునాడులూ కలిసేచోటు ముఖము. 'అశ్వినౌవ్యాత్తం' అంటే అశ్వినీ నక్షత్రములు రెండునూ రెండు దవడలు. అంటే మేషరాశియే ముఖము. హోమము చేయు వప్పుడు కూడా పూర్ణాహుతి సమయములో వసుధారతో నెయ్యిని (అజ్యమును) వ్రేల్చినప్పుడు అగ్నిహోత్రుడు భగ్గున జ్వలించి ఆనందతాండవమాడును. అగ్ని యజ్ఞపురుషుని ముఖముగదా!

యజ్ఞపురుషుడు విశ్వమంతా వ్యాపించి వున్నట్లే మన శరీర

ములో కూడా ఉన్నాడు అని చెబుతుంది పురుషసూక్తం. పురుషుడంటే మనిషి అని అర్థం. పురుషుడంటే విరాట్పురుషుడని కూడా అర్థము. అందుకని బైట విశ్వంలోని దేవతలు ఎలాగ పనిచేస్తున్నారో, అలాగ మన శరీరంలోని అవయువాల ద్వారా పని చేసేది కూడా ఈ దేవతలే అని తెలుపుతూ, పురుషసూక్తంలో శ్వాసనుంచి వాయువు, ముఖములో అగ్ని, పాదములలో భూమి, శిరస్సున బ్రహ్మలోకము (తెలివి), సూర్యచంద్రులు నేత్రములలోనూ (వెలుగు, చూపు), దిక్కులు శబ్దగుణమైన ఆకాశ రూపమున చెవులలోనూ పని చేస్తున్నారు. అనగా ఈ శరీరముకూడా యజ్ఞ పురుషుని విగ్రహమే!

దీనికి నిదర్శనము వేదములో స్పష్టంగా వున్నది. 'ప్రజా పతిశ్చరతి గర్భే అంతః' అని సృష్టికర్తయైన యజ్ఞపురుషుడు గర్భములో ప్రవేశించి పుట్టుకలేనివాడైనప్పటికి, ప్రతి శిశువు లోనూ జన్మించుచున్నాడు అని తెలుపుతున్నది. యజుర్వేదము లోని పురుషసూక్తం. శరీరంలో సర్వ దేవతలూ ఉన్నారంటే అర్థం శరీరంతో యజ్ఞం జరుగుతున్నదనే గదా! ఇదే విషయం వేదంలో :

"ప్రాణో యజ్ఞేన కల్పతాం
వ్యానో యజ్ఞేన కల్పతాం...
శ్రోత్రం యజ్ఞేన కల్పతాం
యజ్ఞో యజ్ఞేన కల్పతాం..."

అనగా ప్రాణములు జరిపే యజ్ఞము యింద్రియాలైన కన్ను, ముక్కు, చెవుల ద్వారా జరిగే యజ్ఞంగా (యజ్ఞో యజ్ఞేన) కల్పిం

పబడినది. అనగా శరీరములో నున్న సర్వాంగములూ యజ్ఞరూప ములని అర్థము. ఇది కేవలం ఊహకాదని యజ్ఞపురుషుని యథార్థ సృష్టి రహస్యమేనని తెలుపుటకే యజ్ఞ పురుషుడైన విష్ణు మూర్తి (యజ్ఞోవై విష్ణుః) "యజ్ఞ వరాహ" రూపమై అవతరించిన కారణముననే ఇప్పటి సృష్టి 'వరాహకల్పమని' పేరు పొందినది.

'యజ్ఞ వరాహమూర్తి' ఉద్భవించినపుడు ఆయనయొక్క శరీరావయవములు యజ్ఞాంగములుగా ఎలావున్నాయో; బ్రహ్మ దేవుడు ఆయనను స్తుతిజేయు వ్యాజమున (వంకతో) ఆయన రూప మును ఇలాగ వర్ణించినట్లుగా వ్యాసమహర్షి శ్రీమద్భాగవతంలో ఈ విధంగా తెల్పియున్నాడు.

## యజ్ఞ మయమైయున్న స్వరూపము :

ప్రభూ! పుణ్యముజేయని అకృతాత్ములకు, దుష్కార్యాలు చేసిన పామరులకు నీ స్వరూపం ఎలాగ గోచరించగలదు ? నీ యజ్ఞమయమైన రూపము ప్రత్యక్షముగా ఈ విధముగా నాకు సాక్షాత్కరిస్తున్నది.

"యజ్ఞ పరికరములైన స్రుక్, స్రువములు నీ నాసారం ధ్రములై అవిర్భవించనవి. ఇడా పాత్రయే నీ ఉదరమైనది. చమన పాత్రములు నీ కర్ణరంధ్రములు (చెవులు) అయినవి. యజ్ఞపరికరమైన ప్రాసిత్రము నీ ముఖముగానైనది, దీక్ష అను జన్మ, ఉపలము నీ శిరస్సు, సర్వసత్ర యాగములూ నీ శరీర సందులైనవి. నీ అవయవ నిర్మాణమే ఇష్టి బంధనమైనది. ప్రాయ

ణీయ ఉదయనీయము అను యజ్ఞములు నీ నేత్రములైనవి. ఛందస్సు నీ చర్మమైనది, వేదములే పాదము లైనవి. యజ్ఞము లోని యూప స్తంభములే నీ కోరలైనవి. దర్భ రోమములు, యజ్ఞాంగ ములు అవయువములుగా కల్గిన ఓ ప్రభూ! యజ్ఞరూపమైన నీ శరీరమే నీ యజ్ఞవరాహరూపమైనది." అని బహువిధములుగ యజ్ఞ రహస్యమును తెలుపుతూ భాగవతములో, బ్రహ్మదేవుడు చేసిన యజ్ఞ వరాహస్తోత్రము, పురుషసూక్త రహస్యాన్ని ఘంటాపథంగా తెలుపుతున్నది.

మానవుని శరీరమే బ్రహ్మాండము. యజ్ఞపురుషుడు మన శరీరంలోనే వున్నాడు. అందువలననే మనము జీవించి యున్నాము. మన శరీరంలోని సర్వావయువములద్వారా దేవతలే పని చేయు చున్నారు.

బయటి విశ్వంలోని దేవతలే మన శరీరంలో నుండి పని చేయుచున్నారు. వాయువు శ్వాస ద్వారాను, అగ్నిహోత్రుడు జఠరాగ్ని ద్వారాను, వరుణుడు నోటిలోని జలము (లాలాజలము) ద్వారాను, చంద్రుడు మనస్సు ద్వారాను, భూమి పాదముల యందూ (పాదములు భూమిమీద నడుచును.) దిక్కులు చెవుల యందునూ (శబ్దము, ఆకాశము) ఇలాగ సర్వదేవతలూ ఈ శరీ రంలో ఉన్నారు.

సర్వ దేవతలూ శరీరంలో ఉన్నారు గనుక యజ్ఞము నాసిక ద్వారా, శ్రోత్రముద్వారా, శ్వాసద్వారా. పంచప్రాణములద్వారా జరుగుటయేగాక శరీరమంతయు యజ్ఞంవల్లనే కల్పింపబడినది.



7

# శరీరంలో యజ్ఞం ఎలా జరుగుతుంది?



'ఏపనైనా యజ్ఞంక్రింద చేయవచ్చుగదా, అలా అయితే ప్రతిపనీ యజ్ఞమే అవుతుందా ?' అంటే, అవదు. మామూలు పనికి యజ్ఞకర్మకు రహస్యమైన తేడా ఒకటి ఉన్నది. అది పైకి కనిపించే పరికరాలలోనూ, వస్తువులలోనూ లేదు. అది ఒక నిగూఢ రహస్యము. ఈ యజ్ఞ రహస్యాన్ని మనమిప్పుడు తెలుసుకుందాం.

sample

గత అధ్యాయంలో వివరించిన దాన్నిబట్టిచూస్తే యజ్ఞమున కుండవలసిన అంగములు ఏవీ అంటే నాలుగు అంగములు. అవి ఏ యజ్ఞమునకైనా ఉండవలసినదే.

1) యజ్ఞములో వ్రేల్చబడు హవిస్సు లేక హోమ ద్రవ్యము

2) వ్రేల్చబడిన హవిస్సును హుతముచేసే అగ్ని

3) హవిస్సు హుతము చేయబడి మార్పు చెంది యజ్ఞము చేయువానికి యిచ్చు ఫలము

4) యజ్ఞము చేయువాడు లేక యజమానుడు.

ఇవి ఒక్కొక్కటే పరిశీలిద్దాము.

## 1. హవిస్సు :

హవిస్సు అనగా అగ్నిలో హుతము చేయబడు వస్తువు. యజ్ఞముయొక్క స్వరూపాన్నిబట్టి ఈ హవిస్సు మారుతుంది. ద్రవ్యములతో చేయబడు యజ్ఞములలో ఈ హవిస్సు అన్నము గాని, పాయసముగాని, మరి ఏ యితర హోమద్రవ్యము గాని హుతము చేయబడతాయి. అగ్నిలో వ్రేల్చెడి సమిధలు లేక కట్టె పుల్లలు కూడా హవిస్సే.

శరీరములో జరిగే యజ్ఞానికి కడుపులో వేసే ఆహారమే హవిస్సు, కడుపులోని జఠరాగ్నియే దీనిని హుతము చేస్తుంది. అలా అని ప్రతివాడూ కూర్చుని భోజనంచేస్తే యజ్ఞమవుతుందా ? అంటే, కాదు. దానికి యజమానుడు వేరే వుండాలి. తనకు తానే తిన్నది యజ్ఞముకాదు. అయితే యజ్ఞము చేసేవాడు (యజమానుడు) అన్నాతురులైన బీదలకూ, పిల్లలకూ, జ్ఞాన పరిపూర్ణులైన సాధు సత్పురుషులకూ, యోగ్యత గల మరెవ్వరికైనా ఆకలి గొన్న వారికి శ్రద్ధతో, భక్తితో పెట్టించిన భోజనము వారి జఠరాగ్నిలో హుతమై యజ్ఞ మవుతుంది.

అయితే వారినుండి ప్రతిఫలము పొందాలన్న అపేక్షమాత్రం యజమాని కుండకూడదు. సర్వసమర్పణబుద్ధితో చేయాలి. ఎందు వల్లనంటే యజ్ఞములో వ్రేల్చబడు హవిస్సు, పరిపూర్ణ త్యాగ బుద్ధితో చేయాలి. అందుకనే యజ్ఞములో హవిస్సు వ్రేల్చే



sanare

టప్పుడు 'విష్ణవే స్వాహా' అని దేవత పేర సమర్పించి ఆ హవిస్సు అగ్నిలోపడునప్పుడు పరిపూర్ణ ఏకాగ్రతతో "విష్ణవేదన్నమమ" అంటే "ఇది విష్ణువునకే సమర్పితము" నాదికాదు-అన్నమంత్రము చెప్పనిదే యజ్ఞములో చేయు హెూమము కూడా నిష్ఫలమవుతుంది. ఇట్లే ప్రతి దేవతకూ హెూమముచేసి హవిస్సును వ్రేల్చునప్పుడును 'న-మమ' – నాది కాదు అని త్యాగముతో సర్వసమర్పణ చేయుటయే యజ్ఞముయొక్క ముఖ్యలక్షణము.

అట్లే యోగియై తాను చేయు సర్వకర్మలనూ భగవత్పరంగా చేసి, వాటి ఫలితాన్ని తాను తీసుకోకుండా 'న మమ' అను సంకల్పముతో, సర్వకర్మ పరిత్యాగము చేయడమే యజ్ఞ లక్షణము. ఇట్లు చేయబడిన ప్రతికర్మ – పై మూడు లక్షణములు కలిగినట్లయితే యజ్ఞముగా మారి, తత్ఫలితాన్నిస్తుంది. విద్యార్థులకు చదువు చెప్పునపుడు గురువు విద్యను హవిస్సుగాచేసి వారి మనస్సులనే అగ్నిలో వ్రేల్చి ప్రతిఫలాపేక్ష లేకుండా భగవదర్పణ బుద్ధితో జ్ఞానదానము చేసినట్లయితే అది జ్ఞానయజ్ఞమై పదింతలుగా వృద్ధి పొందుతుంది. అదే విధముగా ఒక కృషీవలుడు గుప్పెడు ధాన్యమును చదును చేసిన భూమిపై చల్లి సర్వ సమర్పణ బుద్ధితో త్యాగమొనర్చిన, అవి మొక్కలై మొలిచి ఒక్కొక్కటి పదింతలుగా పండి ఫలితం చేతికివస్తుంది. ఆ పండిన ధాన్యమును, రైతు తానొక్కడే తినక, లోకమునకూ, ప్రజలందరకూ వినియోగమగునట్లు చేయుట కృషి యజ్ఞము. దీనివలన వాడికి పదింతలుగా పంటలు పండి పూర్వం దేశము సుభిక్షముగా నుండేది. కాని ఈనాడు పండిన ధాన్యము నితరులకు పెట్టక, తాను తినక,

వ్యాపారం చేస్తున్నాము. అది త్యాగబుద్ధిలేని స్వార్థకర్మ అవుతుంది గాని యజ్ఞముగాదు.

అందుకే కొట్టములో దాచిన ధాన్యము క్రుళ్ళి తినయోగ్యము గాక, ప్రజలకూ, తనకూ వినియోగ పడక, లేక పండినవి తనకు దక్కక ఎలుకలవల్లా తెగుళ్ళవల్లా చోరాగ్ని ఈతిబాధలవల్లా, దేశములో కరువులు, కాటకములు తాండవించుట – వీటి దుష్ఫలితమే. సర్వలోక హితముగా నొనర్చవలసిన పవిత్రయజ్ఞ కర్మను స్వార్థపూరితముగా నాచరించడం వలన దానిఫలితము యజమానుని చెరుస్తూన్నది. ప్రజలకు హానికూడా కలిగిస్తున్నది. ఇదే ఈనాడు పంటలు పండినా అన్నము నోటికి దక్కకుండా పోతున్న కరువు కాటకములలోని రహస్యము, అధిక ధరలు, తెగుళ్ళు, పన్నులు మొదలగు రూపములలో ఈ స్వార్థపూరితమైన కృషి దుష్ఫలితమునే ఇస్తున్నది. ఇప్పటికైనా యజ్ఞ రహస్యమును గుర్తించి లోకశ్రేయస్సు కోసం చేయుయజ్ఞముగా కృషిసల్పిన యెడల అది తనకు పదింతలుగా పాడిపంటలను వృద్ధిచేసి, ఆనందైశ్వర్యము లివ్వడమేగాక ధర్మము గూడ వృద్ధి అవుతుంది. ధర్మమువలన ప్రజలలో స్వార్థము తగ్గుతుంది. స్వార్థముతో ప్రజలు ఒకరినొకరు దోచుకునిపండిన పంటను పంచుకోవడం కమ్యూనిజం అవుతుంది. అదే పంటను పరస్పరము దానము చేసుకొని త్యాగముతో అనుభవించడం యజ్ఞమవుతుంది. పరస్పర సహకారమే యజ్ఞమని గీతలో చెప్పబడింది. "పరస్పరం భావయతంః శ్రేయః పరమవాప్స్యథ" అని పరమేశ్వరుడు తాను సృష్టించిన ప్రజలకు – 'ఓ ప్రజలారా! ఈ యజ్ఞముద్వారా మీరు పరస్పరము శ్రేయస్సు

Sundare

కాంక్షించి అందరూ లాభం పొందండి' అని నిర్దేశించి యజ్ఞమును నిర్మించెను– అని గీతలో శ్రీకృష్ణభగవానుడు తెలిపియున్నాడు, అదే ఈనాడు పరస్పరము దోచుకోవడం, ఒకరినుండి మరొకరు వీలయినంత లాభం పొందడం అన్న దుర్బుద్ధివల్ల, ప్రకృతిలో సహజముగా వుండే యజ్ఞసూత్రము భంగమై ప్రజలకు అరిష్ట ములు కలుగుతున్నాయి.

కాబట్టి యజ్ఞమునకు త్యాగము అతి ముఖ్యమైన అంశము. స్వార్థబుద్ధితో చేయు యే పనియూ యజ్ఞముకాదు. నిజముగా తనకు మంచిఫలము కావలెనంటే సర్వ శ్రేయస్సునూ కోరి, త్యాగ బుద్ధితో కర్మను చేస్తే అందరితోబాటు తనకుకూడ అమితమైన యజ్ఞఫలమును సంపాదించి పెడుతుంది. ఇదే యజ్ఞ రహస్య ములో ఇమిడియున్న మహత్తర సాంఘిక సత్యము, రాజకీయ సత్యముకూడా! ఇది విస్మరించుట వలననే ఈనాటి మానవ సమా జములో పరస్పర సంఘర్షణలూ, అంతర్యుద్ధములూ ఎటు చూసినా కనబడుతున్నాయి. అందుకని యజ్ఞమంత్రములలో వ్రేల్చబడు హోమద్రవ్యమును 'విష్ణవేదం' అంటే ఇది విష్ణుమూర్తికి సమ ర్పించు చున్నాను. 'న మమ' అంటే నాదికాదు – అను మంత్ర ములో ఈ విషయాన్ని నిరూపిస్తున్నది. ఈ సత్యము నెరిగిన ప్రాచీన భారతీయులు అన్నము విక్రయించుట పాపమన్నారు. విద్యను విక్రయించుట మహాపాతక మన్నారు, ఈ రెండింటితో వ్యాపారం చేయకపోవడంవల్ల ఆ కాలంలో ప్రజలకు ఆరోగ్యమూ, ఆనందమూ సిద్ధించేవి. కల్తీలేని విజ్ఞానము వలన ఆనందము – ఈ రెండూకూడా అన్నము విద్యలూ విక్రయించకుండా వుండడం

Sample

వల్లనే మన భారతీయులకు సిద్ధించియుండేవి. విక్రయించరాని వస్తువులు కనుక 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అన్నారు. అట్లే విజ్ఞానముకూడా బ్రహ్మ స్వరూపమని విక్రయించేవారుకాదు.

'ప్రజ్ఞానం బ్రహ్మ'
'అన్నం బ్రహ్మేతి విద్వాన్'

అని గదా వేదం ఘోషించుచున్నది. ఈ రెండునూ (అన్నమూ, విద్య) ప్రతివారికినీ ఉచితముగా దొరుకు శుభదినము భారతదేశమున ఎప్పుడు వస్తుందో, ఆనాడు భారతదేశములో యజ్ఞ పురుషుడు ఆనంద తాండవమాడతాడు! ఈనాటి ప్రజల కష్టములు తొలగి జీవితావసర వస్తువుల కరువు తీరుతుంది.

## 2. అగ్ని :

యజ్ఞములో అగ్నిహోత్రుడు ప్రధానాంగము. ఎందుకంటే అగ్నిలేనిదే వ్రేల్చబడు వస్తువు హుతముకాదు! అందుచే అగ్ని ముఖ్యమైనది.

'అగ్ని' అనగానే దీనికర్థం నిప్పు అనీ, మంట అనీ కేవలం బాహ్య దృష్టితోనే ఊహించరాదు. ఆకలిగొన్న జీవుల కడుపులో జఠరాగ్ని రూపములో నుండునది కూడా అగ్నియే. దీనికి 'వైశ్వానరాగ్ని' అనిపేరు. కడుపులో జఠరాగ్ని మందగించినప్పుడు ఆయుర్వేదములో ఆకలిని పెంచే ఔషధమునకు 'వైశ్వానర చూర్ణము' అని పేరు. వైశ్వానరుడు అంటే కడుపులోనుండు జఠరాగ్నిహో

త్రుని రూపంలోని 'భగవంతుడే'. తానే ఈ వైశ్వానరాగ్నిరూపమున జీవరాసుల కడుపులో ప్రవేశించి నట్లు 'అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః' అని భగవద్గీతలో చెప్పబడింది, కేవలం జఠరాగ్నియే కాక ఈ విశ్వములో సర్వత్రా కంటికి కనిపించని రూపములో అగ్ని హోత్రుడు వ్యాపించియే యున్నాడు. ఈ అగ్ని సూర్యునియందు సూర్యరశ్మి రూపములో నున్నాడు. జలములో కూడా అగ్ని యున్నది. ఇది జలవిద్యుత్తు రూపములో వుందని ఈనాడు సైంటిష్టులు కనుగొన్నారు. ప్రాచీన ఋషులు వేదములో దీనిని విద్యుత్తుగా తెలిపి "వైద్యుతస్సంధానం" అని మేఘముల లోని విద్యుత్తును అగ్నిగా యజ్ఞములో వర్ణించియున్నారు. కట్టెలలో కూడా ఈ అగ్ని దాగి వుంటుంది. అవి ఎండినప్పుడు ఒకదాని నొకటి రాచుకోవడం (రాపిడి) వలన అంతర్లీనమైవున్న ఈ అగ్ని పైకి వచ్చి అడవులుకూడా అంటుకోవడం దీనికి నిదర్శనము. పూర్వము యజ్ఞము ప్రారంభించునపుడు కర్రలతో చేయబడిన అరణిని చల్లచేసినట్లు చిలుకుట వలన అగ్ని పుట్టేది. దీనిని "అగ్ని మంథము" అనేవారు. అంటే చెట్లు సూర్యరశ్మినుండి ఈ అగ్నిని గ్రహించి దానిని అహారరూపంలో తమ శరీరంలో నిహితము చేసి కోవడం వలన కర్రలో ఈ అగ్ని దాగివుంటుంది. నీళ్ళు సూర్యరశ్మి వలన ఆవిరియైనప్పుడు ఆనీటి ఆవిరిలోని సూర్యాగ్నియే మేఘాలలో విద్యుత్తువలె మారుతుంది. అలాగే విద్యార్థి మనస్సు అగ్ని, అది అలోచనలను హుతముచేసి జ్ఞానముగా మారుస్తుంది. అలాగే వంట చేసే అగ్ని పాత్రలోని బియ్యాన్నికూడా హుతముచేసి అన్నముగా మారుస్తుంది. అలాగే సూర్యునిలోని అగ్నిపొలములో చల్లిన ధాన్య మును హుతముచేసి మొలకలుగా మొలిపిస్తుంది. ఇదే అగ్ని ఫలము

sanore

లలోని రసాన్నీ, దుంపలలోని పిండినీ, ఇతర పోషకపదార్థాలనూ సూర్యరశ్మి రూపంలో హుతముచేసి మధురమైన చక్కెర (Sugar starch)గా మారుస్తుంది. ఎండలోని అగ్నివల్లనేగదా పుల్లని మామిడికాయ హుతమై మధురమైన మామిడిపండుగా మారడం. ఇదే అగ్ని ఉద్రేకము, పొగరుబోతుతనము, అహంకారముతో, నిండిన యువకుని, కాలం రూపంలో పచనంచేసి పండిన జ్ఞానిగా మధురమైన స్వభావం కలిగిన మహాత్మునిగా మారుస్తుంది. అందుకే కాలముగూడా అగ్నియే అన్నది వేదం. అగ్ని దహించినట్టుగా సర్వ జీవులనూ భక్షించేది కాలము. కనుక దీనికి కాలాగ్ని అనిపేరు. కోపముగూడా శత్రువుని దహించివేసే అగ్ని లేక "మన్యువు" అని వేదము చెప్పుతోంది. అగ్ని ఇతరవస్తువులను కాల్చడమేక, తనకు ఆధారభూతమైన కట్టెను కూడా బూడిద చేస్తుంది. ఇట్లు పలువిధములైన యజ్ఞములలో అగ్ని వివిధములైన రూపములు ధరించి ఈ జగత్తులో తాను నానావిధ యజ్ఞకర్మలను నిర్వహిస్తోంది. శరీరములో నుండు వేడికూడా మనము తిన్న ఆహారమును హుతము చేసేయజ్ఞాగ్నియే.

ఈ శరీరమున, అంతటా ప్రవహించు రక్తప్రసారరూపంలో ఈ యజ్ఞాగ్ని అన్ని అవయవములకూ వేడినిపంచిపెట్టి మన శరీరము వేడిగా నుండుటకు సహకరించి మన ప్రాణమును నిల్పియుంచేది ఈ ప్రాణాగ్నియే. ప్రాణము మన శరీరావయవములను పోషించునట్లుగానే ఈ విశ్వములో సర్వత్రా దాగియున్న అగ్ని హోత్రుడు కూడా సర్వప్రాణులు జీవించునట్లుగా చేయు యజ్ఞరహస్యమై, ప్రాణులను నిలిపియుంచి పోషిస్తున్నాడు. చివ

రికి మనిషి మరణించిన తరువాత కూడ అతని శరీర ద్రవ్యములను సమకూర్చి, తిరిగి ఆయాలోకములకు చేరునట్లు అగ్ని హోత్రుడు శవమును దహనము చేయునప్పుడు చేయు యజ్ఞములో తనపని పూర్తిచేయుచున్నాడు. అందుకే దీనిని పితృమేధం (యజ్ఞంగా పితృ కర్మ) అన్నారు వేదంలో, అనగా మళ్ళీ ఈ జీవుడు జన్మించి నప్పుడు శరీరం నిర్మించడానికి కావలసిన ఈ పంచభూతములను తిరిగి వాని యధాస్థానమున ప్రసాదించుచున్నాడు. మరణించిన వ్యక్తిని దహనం చేయుట కూడ యజ్ఞమే. ఎందుకనంటే యిందు సర్వత్యాగము జరుగుచున్నదికదా !

శరీరంలోని వాయువు బైటివాయువులలోనూ, శరీరములోని జలము ఆవిరియై మేఘములలోనూ, శరీరములోని ద్రవ్యము బూడిదయై భూమిలోనూ, మరణించిన జీవుని మనస్సు ఆకాశము లోనూ, అతని గత స్మృతులు గడచిన కాలములోనూ లీనముచేసి నట్లే, అతనిలోని జీవుడు పోయి పరమాత్మయందు తాత్కాలిక ముగా చేరుచున్నాడు. ఈ అంతిమ యజ్ఞము దహన సంస్కారము వలన జరుగుచున్నది. అందుకే ప్రాచీనఋషులు శరీరము దహ నము చేయుట సంస్కారమని, అనగా శరీరములోని ద్రవ్యములు శుద్ధిచేసి, కొలిమిలో కాల్చిన బంగారమువలె పరిశుద్ధి చేసి, పంచ భూతములను యధాస్థానములకు పంపించును. కనుక దానిని అగ్ని సంస్కారమని, దహన సంస్కారమని పేరు పెట్టేరు. అందుకే శవమును పాతిపెట్టి క్రిములచేత తినిపించుటకంటే అగ్నిలో దహ నము చేయుట శ్రేష్ఠము. అట్లు దహనసంస్కారము చేయుట వలన శరీర ద్రవ్యములు ఆకాశములోని మేఘములనుచేరి, అందలి

విద్యుత్తున ప్రవేశించి, నక్షత్రములలోచేరి, ఆనక్షత్రములలో ప్రవేశించిన చంద్రునిద్వారా ప్ర యా ణ ము చే సి, అమావాస్యనాడు సూర్యచంద్రులు కలిసినప్పుడు సూర్యునియందు చేరి, ఆ సూర్య కిరణములద్వారా విద్యుత్తునుచేరి, ప్రాణశక్తి రూపమున వర్షముతో క్రిందికి దిగి. సస్యములలోని ప్రాణచైతన్యమును పొంది దానిని భక్షించిన పశువు శరీరములోచేరి, దాని పాలను త్రాగిన, లేదా ఆ పైరులోని అన్నముతిన్న తల్లిదండ్రుల రక్తముతో జీవుడు గర్భమును చేరి, తిరిగి జన్మించుచున్నాడు. ఇది అంతయు సంవత్సరమువలె నిత్యము చక్రాకారముగా జరుగు యజ్ఞము.



8

# సమాజంతో వ్యక్తిగా సాధన
# దైవంగా సమాజాన్నే ఆరాధన

గత అధ్యాయంలో యజ్ఞము పురుష స్వరూపముగాను, పురుషుడు యజ్ఞస్వరూపముగాను వున్న విశ్వరచనా చమత్కృతిని పరిశీలించాము. "పురుషోయం యజ్ఞసమ్మితః యజ్ఞోయం పురుష సమ్మితః" అని శృతి. దీనినిబట్టి మానవశరీరములో జరుగు యజ్ఞక్రియ విరాట్పురుషుని లీల అనిన్నీ మానవులందరూ విశ్వ పురుషుని శరీరములోని అవయవముల వంటి వారేనని మనకు అర్థ మవుతుంది.

మన శరీరములోని ప్రతి అవయవానికి కొంతస్వేచ్ఛవుంది. అంటే చేయిగాని, కాలుగాని, తక్కిన శరీరము కదపనవసరం లేకుండగా దానంతటది కదలగలదు. ఇలాగే ప్రతి అవయవమూ తనయొక్క పనిలో ఎంతోకొంత స్వేచ్ఛను కలిగివుంది గదా! అలాగే సమాజంలో ప్రతివ్యక్తికితగినంత 'స్వేచ్ఛ' వుంది. కాని యీస్వేచ్ఛ 'పరిపూర్ణ స్వాతంత్ర్యముకాదు. స్వేచ్ఛవేరు, స్వాతంత్ర్యము వేరు. కాళ్ళు ఎంతదూరమయినా నడువవచ్చునుగాని, మిగిలిన శరీరాన్ని విడిచిపెట్టిమాత్రం వెళ్ళడానికి వీలులేదు ఎందుకంటే వాటి పోషణ భారం మిగిలిన శరీరంమీద అధారపడివుంది కాబట్టి, అలాగే ఒక్క కాలు స్వతంత్రంగా నడవలేదు. రెండవకాలు సహాయం కావాలి.

అలాగే చేతి వ్రేళ్ళు కూడా. ఏ ఒక్క వ్రేలూ తానొక్కటిగా ఏ వస్తువునూ పట్టుకోలేదు. మిగిలిన వేళ్ళు సహాయం కావాలి.

అదే విధంగా సమాజంలోని వ్యక్తులు కూడా అలాంటి వారే! అంటే ప్రతివ్యక్తి స్వేచ్ఛాపరుడేగాని పూర్తి స్వతంత్రుడు మాత్రం గాదు! తన యిష్టము వచ్చునట్లు జీవించవచ్చుగాని ఇతరుల సహకారము లేకుండా మాత్రంగాదు! అందుకే "బంగారు పళ్ళానికికూడా గోడదాపు అవసరం" అనే సామెత వచ్చింది... ప్రతి వ్యక్తి కొంత యితరులమీద కూడా ఆధారపడతాడు. అంటే అస్వతంత్రుడు అన్నమాట. పూర్తిగా స్వతంత్రుడు మాత్రంకాడు మనము భోజనానికి పంటలు పండించే రైతు మీద ఆధారపడి వున్నాం. గృహనిర్మాణానికి తాపీ పనివాని మీద, నిత్యజీవితావసర వస్తువులకోసం అనేక వ్యాపారస్థులపైన, అనేక పరిశ్రమలమీద ఆధారపడి యున్నాము. అందువలన ప్రతివ్యక్తికూడా సమాజములోని యితర వ్యక్తులమీద ఆధారపడి యున్నాడనేది సత్యం. ఇది ఎంత సత్యమో తెలుసుకోవాలంటే మన జీవితావసర వస్తువులు తయారుచేయు వ్యక్తులందరూ వారివారి పనులు మానివేస్తే మన జీవితం ఏమైపోతుందో ఊహించుకుంటే తెలుస్తుంది. తిండీ బట్టా, ఇల్లూ, వ్యాపారమూ, ఉద్యోగమూ మొదలైన పనులన్నీ స్తంభించి పోతాయి. అంటే మానవుడికి జీవితమే లేదు. దీనివలన తేలిన దేమిటంటే మానవునికి తన నిత్యకృత్యములను చేసుకోవడానికి తగినంత స్వేచ్ఛ యున్నప్పటికీ ఆ స్వేచ్ఛ తనచుట్టూవున్న ఇతర మానవుల స్వేచ్ఛతో కట్టుబడి యున్నదన్నమాట. అనగా ఇతరుల స్వేచ్ఛ పెరిగినట్లయితే తన స్వాతంత్ర్యము తగ్గుతుంది. తన స్వేచ్ఛ

పెరిగితే ఇతరుల స్వేచ్ఛ కూడ పరిమితమవుతోంది. వేదము మనకు తెలుపు మహా సత్యమిదే ! అనగా వ్యక్తియొక్క స్వేచ్ఛ సమాజము యొక్క స్వేచ్ఛకు కట్టుబడి (లోబడి), ఈరెండూ ఒక దాని నొకటి సమన్వయము చేసినప్పుడే వ్యక్తికి, నిజమైన స్వేచ్ఛ. సమాజములో ఆనందము–ఈ రెండునూ నడుస్తాయి. అట్లు కానిచో వ్యక్తి స్వాతంత్రమైననూ నశించి, వ్యక్తిపైన సమాజము నిరంకుశ త్వము చలాయించుట కాని జరగవచ్చును. లేదా వ్యక్తి స్వచ్ఛంధ వృత్తివల్ల విచ్చల విడియై జమాజముయొక్క యంత్రాంగము చిన్నాభిన్నము కావచ్చును. ఈ రెండింటిలో ఏది జరిగిననూ మానవజీవితమునకు అపశృతి కలుగుతుంది. ఒకదానివల్ల వ్యక్తి బానిస అయి సమాజంలో పనిచేసేకూలి వాడుగా మార్చబడతాడు దీనివల్ల వ్యక్తి స్వేచ్ఛ నశిస్తుంది. స్వేచ్ఛ లేనిదే మనిషి నిర్భయ ముగా ఊపిరి పీల్చలేడు. మనము బ్రతకడానికి ఊపిరి ఎలాగ అవసరమో మన ఆత్మ వికసించడానికి స్వేచ్ఛకూడ అలాగే అవస రము. మనం నివసించడానికి తుఫానుకు తటుకునే దృఢమైన ఇల్లు ఎలాంటిదో సమాజంలోని వ్యక్తుల పరస్పర సంబంధం దృఢంగా ఉండాలంటే దృఢమైన సమాజ నిర్మాణం కూడా అవ సరము. అందుకని 'వ్యక్తి', 'సమాజము' మన శరీరములోని అవ యవాల వంటివారు. మన శరీరం సమాజమైతే అందులోని ప్రతి అవయవమూ వ్యక్తుల వంటివి.

## సామాజిక వ్యవస్థ - దాని స్వరూపము

ఈ ఉదాహరణ మరింత జాగ్రత్తగా పరిశీలించదగినవి.

మన శరీరంలో కాలు, చేయి, మెదడు, నోరువంటి అవయవము లున్నాయి. ఈ ప్రతి అవయవానికి ప్రత్యేకమైన ఒక్కొక్క పని (Duty) వుంది. అంటే ఒక అవయవముచేసేపని, ఇంకొక అవయ వము చేయలేదు. కాలితో చేసే పని చేతితో చేయలేము. అలా అని కాలు తక్కువఅనీ, చెయ్యి ఎక్కువ అనీ కాదు! అలాగే సమాజంలో ప్రతివ్యక్తికూడా శరీరంలోని అవయవములవలె ఎవరి పనులు వారు నిర్వహిస్తే అందరూ కలసి ఈ సమాజం అనే శరీ రాన్ని జీవించి ఉండేలాగ చేయగలరు. ఇలా శరీరం ఆరోగ్యంగా నడవాలంటే ప్రతి అవయవమూ కొన్ని నిబంధనలను పాటించాలి. అవి ఏమిటో చూద్దాం.

2) ప్రతి అవయవమూ తనకు నిర్దేశింప బడిన పనినే తాను చేయువలెను.

2) ఒకదాని పని ఇంకొకటి చేయుటకు ప్రయత్నిస్తే శరీ రంలో విప్లవం బయలు దేరుతుంది.

3) ప్రతి అవయవమూ, తన స్వలాభానికై పనిచేయు కూడదు. మొత్తం శరీరంయొక్క ఆరోగ్యం గురించె పనిచేయాలి.

4) ఎందుకంటే శరీరం ఆరోగ్యంగా ఉంటేనే ఏ యొక్క అవయవమైన బాగుండేది. అందుకని తను జీవించి ఉండాలంటే అన్ని అవయవాలూ జీవించి వుంటేనే అదిసాధ్యం. ఒక అవ యవం ఇంకొక అవయవంతో తనను పోల్చుకొని పోటీపడరాదు.

ఉదాహరణకి పనులన్నీ చేసేది చెయ్యి. కాని భోజనం చేసేది ఎప్పుడూనోరు. ఇది నోటి యెడల పక్షపాతం, చేతికి జరుగు

తున్నది అన్యాయం అనుకుంటే నోరు భోజనం మానివేసి చేతికి నీరసాన్ని కలిగించడం జరగవచ్చు. ఆలోచించేది మెదడు. అది ఏమీ శ్రమపడదు పాదములాగ తిరగటంగానీ, చేయిలాగ పనిచేయడం గాని, నోరులాగా మాట్లాడటం గానీచేయదు. బయటినుంచి చూస్తే అసలీ మెదడుచేసే పనేమిటో కనకబడనే కనబడదు.

సమాజంలోని మేధావులు కూడ శరీరంలోని మెదడువంటి వారు. దేశంలోని విద్యావేత్తలు, సైంటిష్టులూ మొదలైన వారం దరూ ఈ తరగతికే వస్తారు. వీరుచేసే ఉత్పత్తికార్మికుల ఉత్పత్తి లాగ యంత్రాల రూపంలో కనబడదు. కర్షకుల ఉత్పత్తిలాగ ధాన్యం రూపేణా కనబడదు అందుకని మేధావులు వృత్తి చేయడం లేదని చెప్పగలమా ? లేదు. మేధావులు యంత్రాలు కనిపెట్టకపోతే కార్మికులకూ, కర్షకులకూ, ఇతర వర్గాలవారికీ జీవనోపాధి లేదు. అందువల్ల సమాజానికి మేధావులందరూ మెదడు వంటివారు. అందువల్ల పురుషసూక్తంలో 'బ్రాహ్మణోస్య ముఖమాసీత్' – బ్రాహ్మణుడు సమాజానికి శిరస్సువంటివాడు అని చెప్పడంలోని అంతరార్ధమిదే. ఇక్కడ బ్రహ్మ అంటే తెలివి అని అర్ధము. ఆయుర్వేదంలో, బ్రాహ్మీకరణం అంటే బుద్ధిని చురుకుగా చేసేవైద్యం అని అర్ధము. ముఖము అంటే ముఖ్యము అని అర్ధము. బ్రాహ్మణుడు శరీరమునకు ముఖం ఎటువంటిదో అటువంటివాడు. ముఖ + యః = ముఖ్యః అంటే శరీరంలో ఏ అవయవానికి లాభం కలగాలన్నా దానికి ఆహారం నోటినుంచే కలగ వలెను. అలాగే సమాజంలోని ఏ వర్గానికి మేలు జరగాలన్నా అది సమాజాన్ని పరిపాలించే మేధావుల నిస్వార్ధ చర్యల వల్లనే అమలు జరగాలి.

శరీరానికి బలము ఎలాంటిదో ఏదేశానికైనా తన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవాలంటే బలిష్టమైన సైన్యము లేక పోలీసు శాఖ అవసరము. సమాజంలో మేధావుల స్వాతంత్ర్యాన్ని రక్షించాలంటే సైనికులుండాలి. కాని సైనికులు పనిచేసేది బుద్ధిబలంతో కాదు. శౌర్యంతో, శారీరక బలంతో చేస్తారు. దీనినే సంస్కృతంలో 'క్షత్రం' అంటారు. 'క్షతి' అనగా దెబ్బ (లేక గాయము). త్రాణమనగా రక్షించునది. 'క్షత్రము' అనగా క్షతినుంచి (గాయము నుంచి) 'త్రాణాం' లేక రక్షించునది. అందుకే శత్రువులు జయించకుండా రక్షించేది సైనికబలమే. ఇది ఈనాటి మాటలలో చెప్పాలంటే, సైనికబలమే క్షత్రబలం. అందుకని శరీరంలాంటిది సమాజం అయితే దాని బాహువుల వంటివారు క్షత్రియులే అని పురుషసూక్తం చెప్పుచున్నది.

ఒక సమాజం కేవలం సైనికులమీద ఆధారపడి బ్రతకడం అసంభవం. శరీరం కేవలం మెదడుమీదా, భుజముల మీద ఆధారపడి జీవించలేదుగదా! ముందుగా తాను నిలబడాలంటే పాదాలుండాలి. అంటే పాదాలే ఆధారం. అలాగే సమాజంలో కూడా కార్మికులు తక్కిన వర్గాలన్నిటికీ ఆధారభూతులు. సమాజాన్ని నడిపించేది కార్మికులు. మేధావులూ, సైనికులూ మొదలైన యితర వర్గాలను జీవింపజేసేది కార్మికులే. అందువల్ల మనిషి నిలబడాలన్నా, నడవాలన్నా పాదాలెంత ముఖ్యమో కార్మికులూ అంతే ముఖ్యము. అందువల్లనే 'పురుషసూక్తము' విరాట్పురుషుని పాదాలలో శ్రమజీవులైన శూద్రులున్నారని తెలుపుతుంది.

అయితే చాలామంది తాము ఉత్తమ కులాలమనుకునే వాళ్ళు శూద్రులను తక్కువగా భావించడం దాని రహస్యార్థం తెలియకనే, కార్మికులు పాదాలవంటివారు అంటే అన్ని అవయవాలకంటే అతి ముఖ్యమైనవారు అని అర్థం. దీనిని చక్కగా ఆలోచిస్తే మనకే బోధపడుతుంది.

మనం తండ్రికి, గురువుకూ, దేవునికీ మ్రొక్కేటప్పుడు నమస్కరించేది పాదాలకే. శిరస్సుకు కాదు. అంటే శరీరావయవాలలో కల్లా నమస్కరింపదగినవి పాదాలే. అనగా అతి ముఖ్యమైన భాగాలు శరీరంలో పాదాలే అని అర్థము. అందుకనే ఈ ముఖ్యమైన విషయం విస్మరించడంవల్లనే ప్రపంచంలో అన్నిచోట్లా సామాజిక విప్లవాలు చెలరేగాయి. వాటి ఫలితంగా ఇప్పుడన్ని దేశాలలోనూ కార్మికుల ప్రాముఖ్యతను గుర్తించడం జరిగిన బ్రిటన్‌లో లేబరు పార్టీ, రష్యాలో కమ్యూనిష్టుపార్టీ, అసియా దేశాలలో అవతరించిన సోషలిస్టు పార్టీలు ఈ విషయాన్ని మానవజాతికి మరొక్కసారి ఋజువు చేసినాయి. అనగా కార్మికుడు లేక శరీరశ్రమ చేసి జీవించే వర్గమూ శరీరంలోకల్లా నమస్కరింపదగ్గ పాదాలవలే అతి ముఖ్యము అన్న పురుషసూక్తవచనం లోని సత్యాన్ని మానవ చరిత్ర మరియొక్కసారి ఋజువు చేసింది.

సమాజంలోని నిత్యజీవితావసర వస్తువులు ఉత్పత్తిచేసేవాడు లేకపోతే ఇటు కార్మికులకు, అటు సైనికులకూ, ఇటు మేధావులకూ కూడా తినటానికి తిండి దొరకదు. వీటిని పండించే వాడు సమాజంలో చాలా అవసరం. అందుకే వ్యవసాయదారులు, (పాడి

పంటలు సమకూర్చేవారు.) వాణిజ్యం ద్వారా నిత్యజీవితావసర వస్తువులందించే పరిశ్రమలూ సమాజానికి అన్నదాతలు.

అందుకే పురుషసూక్తంలో సమాజంలో వైశ్యుడు మన శరీరం లోని తొడలవలే అధారభూతుడు అని వర్ణించిన కారణము. ఎందు వల్లనంటే శరీరానికంతటికీ అధారమైనది పాదాలే అయినా, శరీ రాన్ని రక్షించేవి సైనిక బలంవంటి భుజాలే అయినా, ఈ పాదా లనూ, భుజాలను కలిపి ఉంచేది ఊరువులే (తొడలు) గదా! అందుకని వైశ్యుడు 'సమాజపురుషునకు' శరీరములోని తొడలవలే తక్కిన మూడు వర్గాల వారిని కలిపి వుంచుతాడు. 'వైశ్యుడు' అంటే కులములోని కోమటి అని కాదు అర్థము. 'కృషి గౌరక్ష వాణిజ్యం' అని భగవద్గీతలో చెప్పినట్లు వ్యావసాయదారులు, పాడి పంటలు ఇచ్చేవారు, వాణిజ్యములద్వారా సమాజానికి సంపదలు కలుగచేసే వర్గమును 'వైశ్యులు' అన్నారు. దీనికి నేటి సమాజం లోని పారిశ్రామికులు (industrialists) కర్షకులు (agriculturists), పశుపోషకులు (animal husbandry) అని అర్థము.

దీన్ని బట్టి చూస్తే ఏ సమాజమన్నా సక్రమంగా పనిచేస్తూ ఆరోగ్యంగా ఉండాలంటే దాని అవయవాలు సరిగా పనిచేయాలి. సమాజంలోని వర్గాలే సమాజానికి అవయవాలు. మానవజాతి అంతా తన శరీరంగా గలిగిన విరాట్పురుషుడు తన శరీరావయవాలద్వారా అన్ని వర్గాలనూ సృష్టించాడంటే అర్థమిదే. ఎంతో చక్కటి సామా జిక ధర్మాన్ని అత్యంత సుందరమైన కవితా మాధుర్యంతో మన స్సుకు అందేలాగ వర్ణించినది పురుష సూక్తం.

14)

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే పేర్లు కేవలం మన దేశంలోని ఈ కులాలకే వర్తిస్తుందనుకోవడం తప్పు. పురుషసూక్తంలోని విరాట్పురుషుడు సర్వమానవజాతికి తండ్రి. అంతేగాదు, ఏదేశంలో ఎక్కడ మానవసమాజంవున్నా అది సమాజమనే ఒక శరీరం వంటిది. అందుకే, ఇంగ్లండు, అమెరికా, రష్యా దేశాలలో కూడా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే పేర్లులేవు గాని బుద్ధిజీవులైన మేధావులు, సైంటిస్టులు, క్షాత్రంలో జీవించే సైనికులూ, శ్రమతో జీవించే కార్మికులు, సంపదలుత్పత్తి చేసే కర్షక, వాణిజ్యశాఖలు ఉన్నాయి. అంతెందుకు ? సమాజములో ఈ నాలుగువర్ణాలూ లేకుండా ఏ మానవ సమాజమూ జీవించలేదు. ఇది ఎలాంటిదంటే ప్రపంచంలో ఏ మానవుడైనా ఇంగ్లీషువాడుగాని, రష్యావాడుగాని, అమెరికావాడు గానీ, భారతీయుడుగాని శరీరంలో ఒకే రకమైన అవయవాలు కలిగివుంటాడు గదా! పేర్లుమాత్రం ఏ భాషలో ఆ పేర్లు ఉంటాయి. ఇంగ్లీషులో Hand అన్నా, తెలుగులో చెయ్యి అన్నా, సంస్కృతంలో 'కరం' అనివున్నా అవయవం ఒక్కటే గదా! అలాగే ఇంగ్లీషులో Scientist అన్నా, తెలుగులో మేధావి అన్నా, సంస్కృతంలో బ్రహ్మశబ్దం ఉపయోగించినా, సర్వమానవ జాతికీ అన్వయించాలంటే అర్థం ఒకటే గదా! అందుకే పురుషసూక్తం వర్ణించినది నాలుగు వర్ణాలను, అవి కులాలుగావు, వర్ణమేగాని ! వంశపారంపర్యంగా వచ్చేది కులం (కులవృత్తి). మనిషి గుణాన్నిబట్టి సమాజంలో చేసే వృత్తినిబట్టి ఏర్పడేదివర్ణం. చాలామంది పండితులనుకునే వారికిగూడా, కులానికీ వర్ణానికీ తేడా తెలియదు. అందుకే బ్రిటిషువాడు పెట్టిన వి ష బీ జ మే

ఈనాడు పురుషసూక్తానికి విపరీతార్థాలు కల్పించినది. పురుష సూక్తంలో చెప్పబడినవి వర్ణాశ్రమములు, అంటే వర్ణము దాని ఆశ్రమము (వృత్తి,). ఈనాటికీగూడా కులాలు పేర్ల కోసం అక్టేపెట్టుకున్నా చదువుకున్న ప్రతి వ్యక్తికూడా ఏదో ఒక ఉద్యో గాన్ని లేదా వృత్తిని ఆశ్రయించడం ద్వారా సమాజంలోని వర్ణాశ్రమ వ్యవస్థను, తనకిష్టమైన వృత్తినీ అవలంబిస్తున్నాడు. దీని వల్లనే వర్ణానికీ, కులానికి సంబంధంలేదు. వర్ణాశ్రమం మానవ జాతి అంతటా వున్నది. కులములు మనం ఏర్పరచుకున్నవి. ప్రతి రాష్ట్రానికీ వీటి సంఖ్య మారుతుంది. ఈ కులాలు కూడా నాలుగుకాదు, అనేకం అవడం ఈ కారణం వల్లనే.

పురుషసూక్తం ద్వారా తెలిసే మహాసత్యమిదే. ప్రతిమనిషి సమాజంలో ఒక అవయవంలాగా పనిచెయ్యాలి, తన స్వార్థంకోసం గాక యజ్ఞార్థమై లేక సర్వశ్రేయస్సుకై తానొక అవయవంలాగా పనిచెయ్యాలి. ఇలా చేయడంవల్ల వ్యక్తియొక్క అహంకారం విరాట్పురుషునిలో లీనమై మోక్షం చేకూరుతుంది. ప్రతి వ్యక్తి తన యొక్క కర్తవ్యాన్ని నిస్వార్థంగా ఆచరించడంవల్ల కర్మయోగం ద్వారా సిద్ధిని పొందటానికి అనువైన సామాజిక వ్యవస్థయే వర్ణాశ్రమ విధానము (కులవ్యవస్థకాదు). మానవ జాతికి ఆధ్యాత్మిక పురోగతి, సామాజిక మైన శ్రేయస్సూ రెండూ ప్రసాదించే శరీరం వంటిదే ఈ సామాజికవ్యవస్థ అనబడే విరాట్పురుషుని విగ్రహం.

ఇదే పురుషసూక్తంలోని సామాజిక సందేశం. శాశ్వతంగా రానున్న మానవజాతులకు కూడా సరిపోయే సందేశాన్ని వేదం

పురుషసూక్తం ద్వారా అందిస్తున్నది. ఇది భవిష్యద్వర్తమానాలకూ అనువైన సందేశము. ఎందుకంటే శాశ్వత సత్యము గనుక.

"సామాజిక వ్యవస్థ – దాని స్వరూపము" అన్న అంశం క్రింద పురుషసూక్తంలో అభివర్ణితమైన వర్ణాశ్రమ ధర్మం విషయాన్ని స్థూలంగా పరిశీలించాము. ఈ అధ్యాయంలో ప్రస్తుతము సృష్టిలో నాలుగు వర్ణములు ఎలాగ ఏర్పడినవో ఆ సృష్టి రహస్యమును గూర్చి తెలుసుకుందాము.

జంతు దశలతో ప్రారంభమైన మానవుడు పరిణామ దశల ద్వారా ఒక్కొక్క మెట్టే ముందుకు పురోగమిస్తూ మానవత్వాన్ని పొందిన విషయం ప్రకృతిశాస్త్ర సిద్ధము (Natural Science) అని అందరికీ తెలిసినదే. ఇది ఈనాడు 'సైన్సు' చేసిన పరిశోధనలవల్ల కూడా నిర్ధారణగా ఋజువైన విషయము, అనగా సృష్ట్యారంభంలో ఈ ప్రపంచమంతా సముద్ర జలములచేత నావరింపబడియున్నట్లు వేదము తెలుపుచున్నది. ఈనాటి సైన్సు కూడా జీవశాస్త్రములో (Biology) ప్రాణులు నీటియందే ఉద్భవించి "ఏకకణ–జీవుల" (Single-celled Organisms)రూపంలో పరిణామాన్ని ప్రారంభించినట్లు తెలుపుతున్నాయి. ఈ విధముగా ప్రారంభమైన జీవులు క్రమక్రమంగా వృక్షములుగాను, క్రిమి కీటకాదులుగాను, జంతువులుగాను, చేపలుగాను, సరీసృపములుగాను. ఇలా ఒక్కొక్క మెట్టే ఎక్కి క్రమముగా పైకిపోతూ "పరిణామాన్ని" (Evolution) పొందినవి. జీవరాశి మానవునిగా ఉన్నత స్థితిని అందుకొన్న తర్వాత కూడా, ఈ పరిణామము అంతటితో ఆగిపోలేదు. మానవుడు సైతం ఈ పురోగతిలో ప్రతిఒక్క జన్మకి

ఒక్కొక్క మెట్టే పైకిపోతూ పరిణామం చెందుతాడు. గత జన్మ లోని అనుభవాలు ఆ శరీరము పోయిన తరువాత, మనస్సులోనే నెమరవేస్తూ, వచ్చే జన్మకు నేర్చుకోవలసిన పాఠాలకోసం ఎదురు చూస్తూ, ఇలా జన్మజన్మకీ సంక్రమించే అనుభవం ద్వారా అడు గులువేస్తూ, ఒక్కొక్క మెట్టేపైకిపోతాడు. దీన్నిబట్టి చూస్తే 'పరి ణామ సిద్ధాంతం'లో 'పూర్వజన్మ సిద్ధాంతం' కూడా ముడివడి ఉన్నది. ఎందుకంటే పునర్జన్మలేకుండా మానవుడు గత జన్మాను భవాన్ని నెమరు వేసుకొని నేర్చుకొనటం, దానివల్ల పురోగమించ టం సంభవమా ? అందుకనే భగవద్గీత 'అనేక జన్మసంసిద్ధః' అంటూ మానవుడు మోక్షాన్ని పొందేలాగా అనేక జన్మల అనుభవ మును గ్రహిస్తూ పోతాడని తెలుపుతున్నది.

అందువల్లనే ఇప్పుడు ప్రపంచంలో మనకు కనబడే మను షులందర్నీ చూస్తే రూపానికి అందరూ మానవులే ఐనా వారిలో మనిషి మనిషికీ మార్పులు కనబడుతున్నాయి. ఒక మనిషిలాగా యింకొక మనిషి ఉండడు. మనిషిలో సంస్కారంలో తేడా, అభి రుచులలో తేడా చేసే పనులలో తేడా, జీవన విధానంలోనే తేడా కనబడుతున్నది. ఇలాగ ఒకడు ఇంజనీరైతే మరొకడు 'మిలిటరీ'లో సైనికుడగుచున్నాడు. ఒకడు వ్యవసాయశాస్త్రంలో నిపుణుడైతే ఇంకొకడు మరొకశాఖలో అభిరుచిని, నిపుణతను కనపరచడం జరుగుతున్నది. ఇలా మానవులందర్నీ తరగతులుగా విభజించ వచ్చు. ఒక తరగతి డాక్టర్లు, ఇంకొక తరగతి కార్మికులు, ఇలాగ ఈ వృత్తులనుబట్టి ఏర్పడిందే ఈనాటి సామాజిక విధానము. అలాగే

స్వభావాన్నిబట్టి కూడా మన ప్రాచీనులు మానవ స్వభావాల్ని విభజించారు.

జీవితంలో చాలామంది శారీరక సుఖాన్నే కోరుకుంటారు. ఈ సుఖాన్ని కోరటం అనె గుణంవల్ల సుఖపడాలనే కోర్కెతో కాయ కష్టంచేసి కావలసిన ధనము నార్జిస్తారు. ఇలాగ కావలసినంత ధనం ఆర్జించిన తరువాత ధనం మీద మొహం మొత్తి తద్వారా ధనవంతుల మధ్య భేదాలు, పౌరుషం, పరస్పర స్పర్ధ అనేవి ఏర్పడుతున్నాయి.

దీనివలన మానవుడు జీవితంలో ఈ ధనం కంటే అధికారాన్నే ఎక్కువగా కోరుకుంటాడు. ఇది సంపాదించుకున్న తరువాత జీవితంలో సుఖశాంతులు కావాలనుకొంటాడు. దీనికి మనశ్శాంతి అతి ముఖ్యమని భావిస్తాడు. ఈ మనశ్శాంతి కూడ లభించిన తరువాత "అసలీ సృష్టి ఎలా కలిగింది ? తాను ఎందుకు జన్మించాడు ?" అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఇదే ముముక్షత్వము. ఆత్మ స్వాతంత్ర్యానికి దారి తీస్తుంది.

పైన వర్ణించబడ్డ ఐదుదశలూ మానవుడు క్రమేణా పరిణామం పొందుతుంటే ఏర్పడుతాయి. మొదటి మెట్టులో ఉన్న మనిషి శూద్రుడు అని పిలువబడతాడు. అంటే శారీరక సుఖము నందు కోరిక గలవాడు శూద్రుడు (శూద్రః సుఖమవాప్నుయాత్). ఈ సుఖము కోసం కాయకష్టం చేస్తాడు. దీనికై ఒకరివద్ద నౌకరిగాని, ఉద్యోగంగాని, చేసి సహధర్మాన్ని (Service) అవలంబించి యజమానియిచ్చే ప్రతి ఫలంవల్ల జీవించే మనస్తత్వమే శూద్రత్వము

(Subordinate). ఈ దృష్టితో చూస్తే ఈనాడు సుఖంకోసం, ఉద్యోగం కోసం తపించేవారే సంఘములో ఎక్కువగా కనబడతారు. అందువల్ల ప్రపంచము అంతటా శూద్ర ధర్మంతో నడుస్తుంది. ఇదే 'కలియుగ' లక్షణం.

ఇక రెండవమెట్టులో మనిషి వ్యాపారంచేసి కష్టపడి ధనము సంపాదించి, కూడబెట్టాలనుకుంటాడు ఇది వైశ్యతత్వము (వైశ్యో ధనసమృద్ధ స్యాత్). ఈ మనస్తత్వమున్న వాడే వైశ్యుడు (Capitalist). దీనివల్లనే తనకివున్న డబ్బుతో పెట్టుబడిపెట్టి వ్యాపారం చేయడం ఉద్యోగిలాగ క్రమాభివృద్ధికాక అకస్మాత్తుగా లాభం పొందాలనే దృష్టి ఏర్పడి దానివల్లనే మనిషి వ్యాపారం చేస్తున్నాడు. వాణిజ్యమనేది ఈ ధనార్జన దృష్టి వల్లనే కలుగు చున్నది. ఈ నాటి పారిశ్రామిక సమాజమంతా ఈ వైశ్య ధర్మం నడుస్తున్నది.

ఇక మూడవమెట్టులో మనిషి జీవితంలో అన్ని సౌఖ్యాలకూ కేవలం డబ్బు టే చాలదని గ్రహిస్తాడు. అధికారం ఉండాలి. అధికారస్తునికి ధనవంతులందరూ దాసులు కదా ! కాబట్టి రాజ కీయాలలో ప్రవేశించి పరిపాలనాధికారాన్ని హస్తగతం చేసుకోవా లను కుంటాడు. ఈ మూడవ దశలో పరిణామం చెందిన మను ష్యుడు. ఇది క్షత్రియుని మనస్తత్వం. అధికారంకోసం తాపత్రయ పడే లక్షణమే 'క్షత్ర' స్వభావము ('క్షత్రియో విజయీ భవేత్') అధికారదాహం, పదవీవ్యామోహం దీనిలక్షణం. ఇటువంటివారి వల్లనే ప్రపంచములో రాజకీయాలు ప్రారంభమవుతాయి.

కొన్నాళ్ళకు అధికారం అనుభవించి రాజకీయాలతో సతమత మైన తరువాత జీవితంలో తనకేది లోపించిందో గమనిస్తాడు. నిజంగా మనిషి సుఖానికి కావలసింది అధికారంకాదు! మనశ్శాంతి అన్న సూత్రం గ్రహించినవాడే మేధావి. జీవితంలో మనిషి శాంతిని సంపాదించు కోవాలనే దృష్టితో జీవించటమే బ్రాహ్మణస్వభావం ('బ్రాహ్మణో బుద్ధిజీవినాః' అని మనువు). ఇలాగ ప్రతిజన్మలోనూ మనిషి తన అనుభవాలను జీర్ణం చేసుకుంటూ పరిణామక్రమంలో ఒక్కొక్క మెట్టు ఎక్కుతూపోతాడు. ప్రతిజన్మలోనూ గతజన్మ లోని. అనుభవం దృష్ట్యా అభిరుచులు మారుతాయి, అభిరుచులు మారినప్పుడు జీవిత విధానంకూడా మారుతుంది. ఇలాగ జన్మల పరిణామంలో మానవుడి ఆత్మ మెట్లెక్కుతూ పోతుంది. శారీరక సుఖమే జీవిత గమ్యంగా ప్రారంభమైన శూద్రత్వస్థితి నుండి ధన లాభంకోరే వైశ్యస్వభావం ద్వారా అధికారంకోసం పాటుపడే క్షత్రి యుడుగా మారి, కొన్ని జన్మల తరువాత జీవితానికి నిజంగా కావల సినది 'శాంతి' అని తెలుసుకొంటాడు. ఇదే చాతుర్వర్ణ ధర్మం. మనదేశంలో ఉన్న పేర్లు ఇతర దేశాలలో ఇదేపేర్లతో ఉండకపో వచ్చు. కాని ఇదే మానవ స్వభావం ఇతర దేశాల్లోనూ ఉంటుంది. అందువల్ల మానవజాతి అంతటా ఈ చాతుర్వర్ణ లక్షణాలు కన బడతాయి. ప్రతి జన్మలోనూ పరిణామం చెందే మానవాత్మ తన స్థితినిబట్టి తన అభిరుచినిబట్టి, పరిణామాన్నిబట్టి, తనకు కావలసిన జీవిత విధానాన్ని కోరుతుంది. దీనికోసం చాతుర్వర్ణ విధానం ఏర్పాటుచేసింది వేదం. దీన్ని అర్థం చేసుకోలేక పరస్పరం కొట్లాట లకు, రాజకీయాలకు కులతత్వాన్ని దుర్వినియోగం చేయటం

ఈనాడు జరుగుతున్నది. అందువల్లనే దేశంలో అనేక అనర్థాలు కలుగుతున్నాయి.

మానవ పరిణామం ఒక వైజ్ఞానిక సత్యంగా గుర్తించినప్పుడు సైన్సు దృష్ట్యా చూస్తే. దీనికితగ్గ సామాజిక వ్యవస్థ వేదంలో చెప్పబడ్డ చాతుర్వర్ణ వ్యవస్థతప్ప మరొకటి కనబడదు. ఇది సరిగ్గా అర్థంచేసుకుని కాలానికి కావలసిన మార్పులతో సరిదిద్దుకుంటే ఈనాడు మనకు ప్రతి మనిషికి తగిన ఆత్మతృప్తినిచ్చే జీవనవిధానం ఏర్పడుతుంది. క్రమేపి ప్రతిజీవుడు ఈదశను దాటి ఆత్మస్వాతంత్ర్యాన్ని సాధించాలనుకునే ఐదవ మెట్టుకు చేరుకుంటాడు. సంస్కృతంలో అట్టి వానిని 'ముముక్షువు' అంటారు. ఆస్థితిలో నున్న వానికే నిజమైన ఆధ్యాత్మిక సాధన సాధ్యపడుతుంది. ఈ సృష్టియొక్క రహస్యాన్ని, తనయొక్క రహస్యాన్నీ సాధించాలనుకొన్నవాడే నిజమైన యోగి అవుతాడు.

తక్కిన వాళ్ళందరూ స్వార్థంవలన, భయంవలన దేవుణ్ణి పూజిస్తారు. అందుకే దేవుడు కూడా తనవలెనే స్వార్థపరుడని భ్రమించి కానుకలద్వారా తృప్తిపరచి జీవితంలో కావలసినవి సాధించాలని ప్రయత్నిస్తారు.

వీరికి వీరు చేస్తున్న పూజల వెనుక స్వార్థమేగాని భక్తి, ఆధ్యాత్మికత్వం అంటే ఏమిటో బోధపడదు. మనిషి ఆత్మను వికసింప చేసుకోవటమే ఆధ్యాత్మిక పురోగతి; ఇదే మానవుని పరిణామంలోని చివరిమెట్టు. కాని ఈ పై మెట్టుకు చేరాలంటే

అంతకు క్రిందనున్న నాల్గుమెట్లు దాటాలి. దీనికి కొన్ని జన్మలు పట్టవచ్చు. అంతదాకా ఈ మధ్య తరగతిలోనున్న మనుషులకు సమాజంలో ఒక స్థానం వుండాలి. ఇలా అన్నిదశల్లో వారికి సరి పడే విధానమే – చాతుర్వర్ణం. ఇదే పురుష సూక్తంలో మనకు లభించే మానవ పరిణామ రహస్యం. ఇదే ఆధునిక, వేదకాలపు ఋషులు ఇచ్చే సందేశం. ఇది అర్థం చేసుకుని జీవితానికి అన్వ యించుకుని ఈనాటి దేశంలోని సంక్షోభాన్ని నివారించుకొందుము గాక ! అప్పుడు బ్రిటీషువారు నాటిన కులవిద్వేషం అనే విషబీజం నశిస్తుంది. అప్పుడే సోదరుల మధ్య (కులాలమధ్య) అంతః కలహం అంతరిస్తుంది.



9

# సమస్తవిశ్వం భగవంతునిగా చూసే సాధన విశ్వమంతా ఆయన శరీరమే

మనం మఱ్ఱిచెట్టుని చూస్తున్నాం, పెద్ద పెద్ద చెట్లు, కొన్ని ఫర్లాంగుల పొడుగున్న కొమ్మలతో, పెద్దవైశాల్యంతో లావుగా స్తంభాలలాగ దిగిన అనేక ఊడలతో, వెయ్యిస్థంబాల మండపంలాగున్న మఱ్ఱిచెట్లు ఈ దేశంలో ఎన్నో ఉన్నాయి. ఇంత పెద్ద మఱ్ఱిచెట్టూ—మఱ్ఱికాయని పగలకొట్టి చూసినట్టయితే దానిలో ఆవగింజకన్న చిన్నదిగావున్న ఆ చిన్నగింజలో లీనమైలేదూ ? ఉన్నది. ఎలా వున్నది ? ఇదేమన్నా మతిభ్రమా ! అసత్యమా ? లేక ఇంకేదయినా భ్రాంతి అనగలమా ? కాదు.

ఇవేవీ కాదు. అంత విశాలమైన మఱ్ఱిచెట్టూ బీజప్రాయమై ఆ గింజలో లీనమైవుండటం, అనేది – ప్రకృతిలోవున్న ఒక మహాసత్యం... (Law of Nature.) ప్రకృతి ధర్మం.

ఈ మహాసత్యమే మనకి అణువులో కనబడే బ్రహ్మాండం. సూర్యుడూ, అతడిచుట్టూ వలయాలుగా పరిభ్రమించే గ్రహాలూ గ్రహకక్ష్యలలో, ఒక బ్రహ్మాండంలాగ నిర్మితమై వున్నాయి. ఈనాటి వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు ఏమి కనుగొన్నారు ? అన్నిటి కన్నా చాలా చిన్నదని చెప్పబడే పరమాణువు (Atom) యొక్క నిర్మా

ఐంగూడా సరిగ్గా యీ బ్రహ్మాండంలాగే నిర్మితమైవున్నదనే మహా విచిత్రమే గదా ? గ్రహమండలాంతర్గతమై సూర్యుడు కేంద్రంగా ఉన్నట్లే పరమాణువులోనూ ఒక తేజో కేంద్రం (Nucleus) హృదయంగా వున్నది. దానిచుట్టూ వలయాలలో, గ్రహాలలాగే 'ఎలక్ట్రానులు' (Electrons) అనబడే నలుసులు నిత్యం తిరుగుతున్నాయి ! అణువూ ఓ చిన్న బ్రహ్మాండమన్నమాట ! అంటే బ్రహ్మాండమూ, బ్రహ్మాండ గోళానికి బీజప్రాయమైనటువంటి అణువూ – ఈ రెండూ, మఱ్ఱిచెట్టూ, దాని విత్తనంలాగే విస్పష్టంగా ఈ ప్రకృతి సత్యాన్ని నిరూపిస్తున్నాయి.

అణువుకీ – బ్రహ్మాండానికి వెనుకవున్న మూలసూత్రమే, మఱ్ఱివిత్తనానికీ-మఱ్రిచెట్టుకీ, మానవస్వరూపంలో అంతర్లీనమైవుండే భగవంతుడికి – విరాట్ స్వరూపానికి వెనుకవున్న రహస్యము. ఇదే 'పురుషసూక్తం' లోని రహస్యము !

ఈవిరాట్విగ్రహన్ని తన అంతరాత్మలో యోగసాధనద్వారా తెలుసుకోవటమే 'మోక్షం'. మోక్షం అన్న పదానికి సైన్సు పరిభాషలో అర్థం ఇదే ! ఇది తెలుసుకున్ననాడే... మనకి బైటకనిపించే సైజులలో ఉన్న తేడా – నిజానికి ఒట్టిభ్రమే (illusion) వని గ్రహించగలుగుతాము. భూతద్దం లేక లెన్సు (Lens) తో చూస్తే చిన్న వస్తువు పెద్దదిగా కనిపిస్తుంది. మళ్ళీ టెలిస్కోపు (Tellescope) లేక దూరదర్శినితో చూస్తే దూరంగా వున్నవి దగ్గరగాను. సూక్ష్మదర్శినివల్ల చిన్నవి పెద్దవిగానూ కనిపిస్తున్నాయి. అంటే ఈ సైజులోవున్న తేడా భ్రమ లేక 'మాయ' అనేది ఈలెన్సు

(Lens) వల్ల ఏర్పడుతోంది. ఇలాగే ఆకాశంలోవున్న ఒక ప్రకృతి ధర్మం వల్ల యీ సైజులలో తేడాఅన్న మాయ కూడా (Optical illusion) ఏర్పడు తున్నది. దీనివల్ల వస్తువులలో చిన్నదీ, పెద్దదీ అన్న భేదం యేర్పడుతున్నదిగాని నిజానికసలు వస్తుతః, సహజంగా వాటిలో భేదం లేదన్న మహాసత్యాన్ని గుర్తించగలుగుతాడు యోగి.

ఈ మాయ (illusion) తనని ఏమీ చెయ్యని స్థితికలిగి నప్పుడే యోగికి దూరదర్శిత్వం, సూక్ష్మ విషయగ్రహణం, దూర శ్రవణం లాంటి శక్తులు వచ్చాయంటాము. వీటినే యోగపరి భాషలో సిద్ధులు అంటాము. ఇదే "విరాట్పురుష – సిద్ధి"

ఇది పొందిన యోగి తనకు తానెట్లా కనపడతాడు ? ఒక మహాసముద్రంలాగ కనపడతాడు. సర్వజీవులలోనూ, తానే వున్నట్టు కనబడతాడు. కాదు, సర్వజీవులు తనలోనే యున్నట్టు కనబడతాయి. తనే సర్వమూ అయి కనబడతాడు. భగవంతుడు వాడికి వేరే కనిపించడు. భగవంతుడు మనకి కనిపించేలాగ కాక, విరాట్‌రూపం అనబడే "విశ్వమూర్తి" తనకి తాను ఎలాగ కనిపిస్తు న్నాడో ఆవిధంగా చూస్తాడు. తనకు తానే భగవంతుడై వుండటాన్ని చూడగలగటం కాకుండా – అనుభవించ గలుగుతాడు, యోగి.

మఱ్ఱిచెట్టు తనకుతానై కనిపించేలాగ – తనేకొమ్మలు, తనే ఊడలు, తనే ఆకులు, తనేవేళ్ళు, చిగుళ్ళు–తనే కాయలు గింజలు అన్నీ తనే అయి విస్తరించి, ఒకటిగా అయి 'అంతా'గా ఎలా కని పిస్తుందో, (కంటికికాదు అనుభవంలో) అలాగే, యీ విశ్వం అనబడే

మహా వటవృక్షంగూడా తనేరసంయిచ్చి అన్నింటినీ పోషిస్తూన్నట్లు, తననే తను భుజించుకుంటూన్నట్లు, తననే తను పుట్టించుకుంటు న్నట్లు, తిరిగిగింజలుగా; సృష్టికీ, స్థితికీ, ప్రళయానికీ, తనే కారకు డుగా, తనకితాను ద్యోతకమవుతాడు పరిణామంయొక్క పరిపూర్ణ తను చేరుకున్న (Evolution Completed Stage) దశలో! ఇటువంటిస్థితే విశ్వరూపం చూపించినప్పుడు శ్రీకృష్ణుడు వున్నస్థితి!

ఇటువంటి స్థితిని ప్రతివారూ కూడా ఎలా పొందవచ్చునో అన్నది గీత 15–వ అధ్యాయం 'పురుషోత్తమ – ప్రాప్తియోగం'లో శ్రీకృష్ణభగవానుడు విచారించాడు.

అంతేగాకుండా, శ్రీకృష్ణుడు – తనలాగే, పూర్వం అనేకులు కూడా ఇలాంటి పరిపూర్ణావస్థను, భగవద్భావాన్నీ పొందినారని, శ్రీకృష్ణుడీస్థితికి "సాధర్మాన్ని" పొందినట్టు తెలిపాడు. "ధర్మం" అంటే గుణం, రసాయనిక ధర్మాలలాగా, సమాన ధర్మాన్ని కలిగి వుండిన స్థితిని చేరుకుని "మమసాధర్మ్యమాగతాః" అన్న అభేద స్థితిని, పూర్ణపరిణామాన్ని పొందారు. "మద్భావగతాః" అంటూనూ 'మమసాధర్మ్యమాగతాః' అని యింకోచోటా ఇదే నొక్కి చెప్పాడు శ్రీకృష్ణుడు.

ఆయన ఇదే చాలావిశేషమనీ, తానొక్కడికే తప్ప యింకొక రికిలేదని గొప్పచెప్పుకోకుండా, తనలాంటి మహాత్ములైన వ్యక్తులు భగవత్ స్థితిని పొందిన వాళ్ళందరికీ యీ పరిస్థితి సమానమేనని శ్రీకృష్ణుడు నొక్కిచెప్పాడు!

భగవద్గీతలోని విశ్వరూప సందర్శనయోగం అనే అధ్యాయంలో అర్జునునకు శ్రీకృష్ణుడి అనుగ్రహం వలన సాక్షాత్కరించాడు. ఇతనిని పొందుమార్గము సూచనగా పురుషోత్తమ ప్రాప్తి యోగంలో తెలిపాడు శ్రీకృష్ణుడు. ఇది పామరులకుకూడా తెలిసే విధంగా వేదవ్యాస మహర్షి శ్రీమద్భాగవతములో వర్ణించియున్నాడు.

సంస్కృతములో శ్రీ మద్భాగవతమనే మహా పురాణమును వేదవ్యాసమహర్షి రచించిన కారణము కూడా తెలిపాడు. రాబోవు నది కలియుగం. అందులో పుట్టు మానవులంతా అల్పాయుష్కులు. అందువల్ల దీర్ఘకాలం తపస్సు చేయలేరు. అయుష్షు తక్కువ గనుక యజ్ఞాది కర్మలు చేయలేరు. కలిలోని మానవులు అనేక పాపములు చేయుటవలన ఆరోగ్యము చెడి అల్పాయుష్కులేగాక, అనారోగ్యముతో మూలుగుతూ వుంటారు అని, వారిమీద దయతో అందరికీ అర్ధమయ్యేలాగున తేలికగా విరాట్పురుషుని అందరూ ఉపాసించటానికి వీలుగా శ్రీమద్భాగవతంలో వర్ణించాడు.

వేద మంత్రాలను అందరూ అర్థం చేసుకోలేరు. అందరూ ఏమిటి వేదపండితులకే అర్థం తెలియదు! అందులోనూ నాలుగు వేదాల సారము అయిన పురుషసూక్తమున ప్రార్థింప బడినవాడు విరాట్పురుషుడు. అందుకని ఆయనను ఉపాసించు మార్గము భాగవతము రెండవ స్కంధములో నారదుడు తన తండ్రియైన బ్రహ్మ నుండి ఉపదేశంగా పొందిన రహస్యాన్ని "బ్రహ్మ నారాయణ సంవాదం" అన్న పేరుతో వర్ణించారు. వ్యాసభగవానులు. ఇది అంతకు పూర్వం, అనగా సృష్టికి ఆరంభంలో జరిగిన గాథ. సృష్టి ప్రారంభంలో బ్రహ్మదేవుడు నారాయణునితో జరిపిన

సంవాదములోని సృష్టిరహస్యమే ఈ "బ్రహ్మనారాయణ సంవాదము." దీనినే తిరిగి బ్రహ్మ నారదునకుపదేశించిన రహస్యమే "బ్రహ్మనారద సంవాదము." ఇందులో నారాయణ రహస్యము తెలుపబడుటయేగాక నారాయణుడని పిలువబడే **విరాట్పురుషుని** ఉపాసించు **విధానము** గూడా ఇవ్వబ**డి**నది. **అది** సంక్షేపముగా ఇక్కడ వివరిస్తాను. ఇది సావధానముగా గ్రహించవలసిన విషయము.

గతించిన ప్రళయంలో సర్వభూతాలు లయమై నశించి ఒకే ఒక్క తత్వమై యున్న సమయంలో జగత్తును సృష్టింపదలచి బ్రహ్మదేవుడు ఒక ముహూర్త కాలము ధ్యానించాడు. బ్రహ్మ అలా ధ్యానించిన ముహూర్తమే ఈ 'బ్రహ్మముహూర్తము.' ఆయన మనస్సులోనుండి ఆలోచనల రూపంలో "బ్రహ్మ మానసపుత్రులు" ముందుగా ఉద్భవించారు. అందులో ఒకడైన నారదుడు ఒకనాడు బ్రహ్మదగ్గరకు వెళ్ళి, "మీరు నాకేగాక ఈ సమస్త లోకానికీ జనకులు, సృష్టికర్తలైన మీకు నమస్కరించుచున్నాను. నాకు దయతో ఆత్మ జ్ఞానము నుపదేశించ వలసినది. ఈ సృష్టియొక్క లక్షణమేది ? దీని నిర్మాత ఎవరు ? ప్రళయసమయంలో పోయి ఇదంతా ఎక్కడ లయమౌతున్నది ? ఈ జగత్తుయొక్క నిజస్వరూపమేమిటి ? ఈ సర్వమూ ఎవని మీద ఆధార పడియున్నది ? మీరొక్కరే పంచభూతాలనూ, వాటినుంచి సర్వసృష్టినీ చేస్తున్నారు. సాలెపురుగు తనలోంచి దారాన్ని (బూజు) తీసి దానితో గూడు నిర్మించినట్లే, నీలోంచి పుట్టిన పంచభూతాల వల్లనే నీ చుట్టూరా ఈ జగత్తు ఏర్పడుతోంది. ఈ సమస్త జీవరాసులనూ

సృష్టిస్తున్నా మీలో ఏమార్పు కలగటం లేదు గదా, మీరే ఈ సర్వా నికి అధారభూతులా ? అయితే మీరు కూడా ధ్యానం చెయ్యడం చూస్తే నాకు సందేహంగా వుంది. సర్వజ్ఞులూ, సర్వేశ్వరులూ అయిన మీరుకూడా ఎవరినిగూర్చి ధ్యానిస్తున్నారు ? ఇంకా మీకంటే పెద్దవారెవరు ? అసలు ఉన్నారా ? అని నాకు సందేహం కలిగింది. మీ రనుగ్రహించి నా సందేహం నివారించండి' అని అడిగారు.

ఈ మాటలకు బ్రహ్మ సంతోషించి, నారదునికై ఇచ్చిన 'పరమార్థోపదేశమే' భాగవత సారమైన 'బ్రహ్మవిద్య,' ఇది విస్తా రంగా వ్యాసమహర్షి భాగవతం పన్నెండు స్కంధాలలోనూ విశదీక రించాడు. అలా వ్రాసిన దాన్నంతా తిరిగి సంక్షేపముగా చేసి ద్వితీయస్కంధములో వివరించారు. ఇది సంగ్రహం చేసి ఇక్కడ వివరిస్తాను.

"కుమారా! నేను నా బుద్ధిలోనుంచి అంతర్యామియై నన్ను శాసించే భగవచ్ఛక్తియొక్క 'ప్రచోదన' చేతనే ఈ సృష్టి కార్యం నిర్వహిస్తున్నాను. మనబుద్ధి నెవరు ప్రేరేపించునో అతడే 'పర మాత్మ.' (ధియో, యో, నః ప్రచోదయాత్) అంతర్ముఖుడై లోపల 'తాను' అన్నభావానికి పరమైన వస్తువును గుర్తించాలి. నాకంటే పరమైన వస్తువును గుర్తించేవరకూ నేనే సర్వమూ చేస్తున్నా ననిపిస్తుంది. ఇంద్రియాలకు అందనివాడైన భగవం తుడు త్రిగుణాలైన సత్వరజస్తమస్సులనే మూడుముసుగులచేత తన రూపాన్ని మరుగు పరచడం వల్ల, జీవులు భగవంతుని చూడ లేక పోతున్నారు. ఈ గుణములచేత వెలిగే పంచభూతాలకూ,

ఆ గుణములను గ్రహించే పంచేంద్రియాలకూ, పైకి దాటి తను చూడగలిగితే ఈ మాయ అనే ముసుగు తొలగి పరమాత్మ గోచరిస్తాడు.'

'నారదా ! కాలమూ, స్వభావమూ, కర్మ, జీవుడు అనబడే ఇవన్నీ కూడా భగవత్స్వరూపమే. సర్వ వేదములూ నారాయణ పరమే. సర్వదేవతలూ నారాయణుని అంగముల నుంచియే ఉద్భవించారు. అన్ని లోకాలూ నారాయణ శరీరమునుంచే పుట్టినవి. సర్వయజ్ఞములూ నారాయణ శరీరాంగములే. తపస్సుచేత తెలియునది, యోగము వలన సాక్షాత్కరించునది, జ్ఞానము వలన భాసించేది నారాయణ పరతత్వమే. చివరికి అందరికీ పరమైనది నారాయణుడే. అటువంటి భగవంతుడైన వాసుదేవునకు నమస్కారముచేసి, శరణుపొంది, జ్ఞానముపొంది, దానివలన అయనను తెలుసుకోవాలి. అతడే లోకాలకు ఈశ్వరుడుగా వుండి తనశరీరంలోంచే అన్ని సృష్టించాడు. అయన సర్వజీవులయందూ యుండి సర్వమూ నిర్వికారుడై చూస్తాడు. అందుకని మనము చేసేదంతా గ్రహించే సర్వసాక్షి అయనే! లోకములు సర్వమూ అయనయందు, కల్పింపబడినవే ! ఈ ప్రపంచానికీ, నాకూ, నీకూ గూడా నారాయణుడే ప్రభువు.'

ఈ భగవంతుని ప్రేరణ చేతనే అటు పిండాండమైన శరీరమునూ, బ్రహ్మాండ స్వరూపమైన విశ్వమును ఈ రెంటినీ నిర్మించాడు. ఒకదానియందు ఒకటి వున్నాయి. అంటే బ్రహ్మాండములో శరీరము (పిండాండము) ఉన్నది. గుణములులేని భగ

వంతుడు (నిర్గుణుడు) తానే గుణములను గ్రహించి, సగుణుడై, అంటే కాలం, కర్మ, స్వభావం అనే గుణాలను స్వీకరించి ఈ బ్రహ్మాండాన్ని నిర్మించాడు.

ఆ బ్రహ్మాండము అలాగ వెయ్యి దివ్య సంవత్సరాలు ప్రళయ జలంలో వుండి పెరిగింది. ఆ బ్రహ్మాండాన్ని చీల్చుకుని విరాట్పురుషుడుద్భవించాడు. ఆ విరాట్పురుషుడు వేలకొలదీ శిరస్సులూ, వేలకొలది పాదాలూ, అనేకవేల నేత్రాలు, కర్ణములు, భుజములూ కలిగి, వేలకొలది రూపాలలో ప్రకాశించాడు. జ్ఞానులు, ఈ విరాట్పురుషునే ఉపాసిస్తారు.

## విరాట్పురుషుడు :

"ఈ విరాట్పురుషుడు సర్వలోకమయుడు. సమస్తలోకాలూ సమస్తజీవరాసులూ ఈ విరాట్పురుని యందే వున్నాయి. విరాట్పురుషునియందే భూర్భువస్సువర్లోకములైన సప్తలోకాలూ; అతల, వితల సుతలాది ఏడు అధోలోకాలూ అన్నీ కలిగి మొత్తం పదునాల్గు భువనాలున్నాయి. ఈయన శిరస్సున సత్యలోకము, నాభియందు అంతరిక్షము, శ్రోతమునందు దిక్కులు, పాదములయందు భూలోకము, నాభినుండి భువర్లోకము ఇలాగసర్వలోకాలూ కల్పింపబడ్డాయి. ఇదియే సృష్టికల్పం, లేక 'కల్పాది'. ఆ విరాట్పురుషునికి ముఖము నుండి అగ్ని, శరీరములోని సప్తధాతువుల వలన త్రిష్టుప్, అనుస్టుప్, ఉష్ణిక్, బృహతీ, పంక్తీ, జగతి, అను ఛందస్సులు ఏడు ఏర్పడినాయి. శబ్దమును గ్రహించే చెవులనుండి శబ్దగుణకమైన ఆకాశము పుట్టినది. ముఖమునుండి, యజ్ఞము

లోని హవ్యకవ్యములు, సర్వ జీవులకూ రుచికరమైన అమృతాహారములూ, విరాట్పురుషుని నాలుకకు అధిష్ఠానమైన వరుణ దేవతయూ ఉద్భవించినాయి. ఆయన ఘ్రాణేంద్రియమైన నాసిక నుండి పంచ ప్రాణములైన ప్రాణాపాన వ్యానోదాన సమానములునూ, నాసికనుండి నాసత్యులనబడే 'అశ్వినీదేవతలు' జంటలై ఉద్భవించారు. నాసికయొక్క వాసనాగ్రహణశక్తివల్ల సువాసన గలిగిన అనేక పుణ్యగ్రంథాలుద్భవించినాయి. ఆయన యొక్క నేత్రములనుండి ఆదిత్యులూ, సూర్యుడూ, అతనితోసహా తేజస్సుకు ఇంద్రియమైన నేత్రగోళము కూడా ఉద్భవించినాయి. ఆయనయొక్క స్పర్శేంద్రియాన్నుంచి స్పర్శతో మనకు తెలిసే వాయువూ, చర్మములనుండి ఛందస్సులు, రోమములనుండి దర్భలు, వివిధ వృక్షాలూ, ఓషధులూ కూడా ఉద్భవించాయి. ఎముకలనుంచి పర్వతములు, రక్తనాళములనుండి ప్రవహించే నదులు, శరీరధాతువులనుండి సర్వలోకాలూ ఉద్భవించాయి. కేశముల నుండి మేఘములూ, సర్వాంగములనుండి లోకపాలకులైన దేవతలూ జన్మించారు."

## దేవతల పుట్టుక :

"ఈ విధంగా ఉద్భవించిన విరాట్పురుషుని శరీరంలోంచి సర్వదేవతలూ ఉద్భవించారు. మాట్లాడుటకు, అహారము తీసుకొనుటకూ ఆధారమైన ముఖమునుండి ఇంద్రుడూ, అగ్నీ ఉద్భవించారు. ప్రాణమునుండి వాయుదేవుడు, నాసికనుండి అశ్వినీ దేవతలు, నేత్రేందియమునుండి సూర్యచంద్రులూ, లింగమునుండి

ప్రజాపతియైన సృష్టికర్త, సర్వభూతములకూ మృత్యువైనది అపానము, మనస్సునకు ఆశ్రయమైన హృదయమునుండి హృదయాధి దేవత. ఆ హృదయ కమలము నుండియే సృష్టికర్తయైన నేనూ (బ్రహ్మ), నానుండి మానసపుత్రుడవైన నీవూ (నారదుడు), ఇతర మానసపుత్రులైన మీ సోదరులూ జన్మించారు."

ఆ విరాట్పురుషుని ముఖమునుండి బ్రహ్మణులూ, భుజముల నుండి క్షత్రియులు, ఊరువులనుండి వైశ్యులు. పవిత్ర గంగానదికి పుట్టినిల్లయిన పాదములనుండి శూద్రులూ ఉద్భవించారనీ వర్ణించబడ్డ ఈ "విరాట్పురుషుడు" సర్వదేవతా స్వరూపుడు. దేవతలు, అసురులు, మానవులు, నాగులు, గరుడ, గంధర్వాది అప్సర, యక్ష, రక్షో, భూత గణాలు, సిద్ధ, విద్యాధర, చారణాది సర్వ దేవతలు, పితృదేతలు మొదలుకొని ఇంకా దేవఋషులు, మృగములు, పక్షులు, జలచరములు, సర్వజీవరాసులు, సర్వనక్షత్రములు, రాహు కేతువులు మొదలైన నవగ్రహములు, యజ్ఞస్వరూపమైన వర్షము (పర్జన్యుడు,) మెరుపులూ, పిడుగులు, ఇప్పుడు కన్పించే సర్వ ప్రపంచమూ మాత్రమేగాక ఇంతవరకూ గతించిన భూతకాలము, గతించిన మన్వంతరాల, ప్రళయాల చరిత్రతోపాటు రానున్న భవిష్యత్కాలములోని మన్వంతరాలయొక్క ప్రళయాల యొక్క చరిత్ర సర్వమూ ఈ విరాట్పురుషునియందు దర్శించవచ్చు. ఆ పురుషునియందే విశ్వమంతా దశాంగుళ న్యాయములో యిమిడియుంటాయి.

వేదాంతశాస్త్రంలో దశాంగుళ న్యాయం అంటే ఇలా చెప్పారు. భూమికంటే పదిరెట్లు జలము, జలమునకు పదిరెట్లు అగ్ని,

అగ్నికి పదిరెట్లు వాయువు, వాయువునకు పదిరెట్లు ఆకాశం అంత కంటె పదిరెట్లు మహత్తత్త్వము, దానికి పదిరెట్లు మూలప్రకృతి – ఇలాగ ఒకదానికి పదిరెట్లు ఇంకొకటి ఉండుట దశాంగుళ న్యాయము. ఈ దశాంగుళ న్యాయంలో విరాజిల్లే సమస్తలోకాలూ విరాట్పురుషునియందొక పాదము అంటే నాలుగోవంతు మాత్రమే అయివున్నాయి. తక్కిన మూడు భాగాలూ తాను తానుగానే నిలిచి అమృతస్థితిలో వున్నాడు. అందుకే ఆయన అమృతము, అభయ ప్రదమూ అయిన మోక్షపదానికి అధినేత.

ఈ విరాట్పురుషుడు లోకమున లోపలా, బైటాకూడా ప్రకాశిస్తూ మనశరీరములలోనూ, లోపలా బయట కూడా ఉండి మనలను జీవింపజేస్తున్నాడు – మనలనూ విశ్వాన్నికూడా!! కనుకనే విరాట్పురుషుడైన ఈ భగవంతుని మహిమ వర్ణనాతీతమైనది.

## లోకాలు :

"భూలోకమైన ఈ కర్మస్థానములో కర్మచేతనే పుణ్యము గాని, పాపముగాని లభిస్తాయి. ఇది మానవులకు కనిపించే లోకం. పుణ్య పాపాలనిక్కడ కర్మద్వారా మానవుడు సంపాదించుకుంటాడు. పుణ్యంవల్ల స్వర్గలోకం, తపస్సువల్ల తపోలోకం, జ్ఞానము వల్ల జ్ఞానలోకము, బ్రహ్మసాక్షాత్కారమువల్ల సత్యలోకము ఉద్భవింపజేసుకొన్నట్లే. పాపము వలన అధోలోకమైన పాతాళమూ, నరకములనూ కూడా మానవుడు చేరుకుంటాడు.

బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్యాసులు 'జనో' 'తపో' 'సత్యలోకాల' యందునివసిస్తారు. బ్రహ్మచర్యం అవలంభించ లేని గృహస్థులు భూలోక. భువర్ లోక స్వర్గలోకాల్లో తిరుగు తుంటారు.

## ఉపాసనా మార్గాలు :

"ఈ విరాట్పురుషుని ఉపాసించటానికి రెండు మార్గా లున్నాయి. ఒకటి యోగులకు కర్మమార్గం (కర్మయోగం), రెండవది ఉపాసనామార్గము. విరాగులకు, సన్యాసులకు జ్ఞాన మార్గమైన ఉపాసనమే మార్గము. కోర్కెలు కలిగి కర్మలు త్యజించని గృహస్తాశ్రమవాసులకు కర్మయోగ మార్గము తగినది."

## యజ్ఞము :

"ఈ విధంగా ఉద్భవించిన విరాట్పురుషుని నాభియందు కమలము పుట్టి అందులో నేను (బ్రహ్మ), నీ సోదరులూ జన్మిం చాము. నాకు అపుడు ఏవిధమైన సామగ్రీ లభించక పోవుటచేత నాకు ఆ విరాట్పురుషుని శరీరములోని అవయవములే యజ్ఞ పరిక రములయ్యాయి. అందుకని ఆ పురుషుణ్ణే యజ్ఞముగా జేసి యజ్ఞ స్వరూపుడైన ఆ పురుషుని యందే వ్రేల్చి యజ్ఞమును చేసితిని. అపుడు ఆ విరాట్పురుషుని శరీరములోనే యూప స్తంభము, యజ్ఞ భూమి, యజ్ఞపశువులు, యజ్ఞరూపమైన సంవత్సరము, యజ్ఞములో కావలసిన యజ్ఞపాత్రలు (ఇమపాత్ర, చమనపాత్ర, ప్రాసిత్రము మొదలైనవి), యజ్ఞములో కావలసిన ఓషధులు, ఘ్రుతము, దధి,

జలము, ధాన్యములు. ఋగ్యజుస్సామాధర్వ చాతుర్హోమ విధులూ, మంత్రముల పేర్లు, యజ్ఞతంత్రమైన గత శ్రద్ధా ప్రాయశ్చిత్తములు, దీక్ష, సమర్పణ మొదలైనవి గ్రహించి పరమాత్మయైన ఈ విరాట్పురుషుని యజ్ఞంద్వారా సేవించాను. సృష్టి స్వరూపమైన ఆ యజ్ఞము నుండి నీ అన్నలైన సనకసనందనాదులు, దక్షప్రజాపతి మొదలుగా గల పదిమంది ప్రజాపతులూ ఉద్భవించి వారుకూడా అంతర్యామిస్వరూపుడైన విరాట్పురుషునే ఆరాధించారు. తద్వారా ఆ యజ్ఞవిధివల్ల మనుజులు, దేవతలు, ఋషులు, పితరులు, మనుష్యులు కూడా ఉద్భవించారు. వీరందరూ ఆత్మ యజ్ఞముద్వారా విరాట్పుషుని ఆరాధించారు. మానవులు భూమిమీద వస్తువులతో యజ్ఞపరికరాలు సమకూర్చి యజ్ఞాలు చేసారు. ఈ మహాపురుషుని ప్రేరణచేతనే నేను సృష్టి చేస్తున్నాను.

## త్రిమూర్తులు :

"ఈ విరాట్పురుషుడే తనలోని త్రిగుణాలతోటి త్రిమూర్తులను సృష్టించారు. సృష్టి కారకమైన రజోగుణము వలన బ్రహ్మనైన నన్ను సృష్టించాడు. సత్వగుణమువలన లోకములను పాలిస్తూ రక్షించే విష్ణువును సృష్టించాడు. తనయందలి తమోగుణము వలన సంహారాత్మకుడైన రుద్రుని సృష్టించాడు. మేము ముగ్గురమూ ఆయనలోని త్రిగుణాలను ఆశ్రయించి భూత భవిష్యద్వర్తమానాలైన మూడు కాలాలలోనూ, సృష్టి స్థితిలయములనే మూడు కర్మలనూ చేస్తుంటాము. నిజానికి ఆయనయే మూడు రూపాలు ధరించి ఈ మూడు కర్మలూ చేస్తుంటాడు. అనేక రూపాలు ధరించియున్నది ఆయనయే."

"ఆయనయే మనువు రూపంలో మానవజాతిని వృద్ధిపొందించాడు. ఆయనయే ఋషుల రూపమున బ్రహ్మవిద్యనూ, సర్వ శాస్త్రములనూ మానవజాతికి ఉపదేశించి భూమ్మీద ఈ శాస్త్రాలను రక్షిస్తూ ఉంటాడు. మానవులలో సద్గుణములు లోపించి అధర్మము వృద్ధిపొంది తద్వారా ధర్మానికి ఆపద వాటిల్లినప్పుడు ఆయనయే అనేక రూపాలలో అవతరిస్తాడు. అన్నిట్లో వున్నది ఆయనొక్కడే. ఇది తెలుసుకోలేక పోవడమే "మాయ." ఈరహస్యాన్ని తెలిసి సర్వమునందూ ఆయనను దర్శించి, భిన్నతను వదలిపెట్టి, ఏకత్వసిద్ధిని పొందుటయే మోక్షము, ఇదియే అమృతతత్త్వము, శాశ్వతమునైన మోక్షపథము, ఇదియే పురుషోత్తమ ప్రాప్తి, అన్ని జీవరాసులూ చివరకు చేరవలసిన కడపడి గమ్యస్థానము ఈ విరాట్పురుషుడే.

అని ఈ విధముగా బ్రహ్మదేవుడు నారదునకుపదేశించిన విరాట్పురుష రహస్యము భగవంతుడైన వ్యాసమహర్షి సంగ్రహంగా ద్వితీయ స్కంధములోనూ, వివరంగా భాగవతం 12 స్కంధాలలోనూ, ఇంకా ఉపనిషత్తులలోనూ, పురాణములలోనూ, వ్యాస శిష్యులైన జైమిని, పైల, సుమంతాదులద్వారా మనకందరికీ అందించాడు. విరాట్పురుషుని శరీరమే బ్రహ్మపథము. దీనిని తెలుసుకొను మీమాంసమే బ్రహ్మసూత్రముల రూపములోనున్న "శారీరక మీమాంస." ఇది సూత్రరూపములోనున్న విరాట్పురుషవిద్య. ఇదియే పురుషసూక్త రహస్యసారము. అందువలననే బ్రహ్మ సూత్రములకు "శారీరకమీమాంస" శాస్త్రమని పేరు వచ్చినది.



**10**

# బైటి జగత్తులోనూ-మన శరీరంలోనూ వున్నది, భగవంతుడే!



భగవద్గీతలో ఉపదేశింపబడినది సర్వదేవతా స్వరూపుడైన విరాట్ పురుషోపాసనయేనని, భగవద్గీతలోని మూడు (10, 11, 15) అధ్యాయములలో ఈ రహస్యము అర్జునున కుపదేశింపబడినది. అందులో మొదటిది 'విభూతియోగము'.

'పురుష ఏ వేదగ్ం సర్వం' అన్న మంత్రమునకు వ్యాఖ్యానమే ఈ విభూతియోగము. సర్వవస్తువులయందూ విరాట్పురుషుడు జీవరూపములో నున్నాడని తెలుపుటయే విభూతిరహస్యము. ఏయే వస్తువులయందు, ఏయే రూపమున దానిని ధ్యానించవలెనో విభూతియోగమున పేరుపేరునా వివరించపడినది. "న తదస్తి వినా యత్స్యాన్మయాభూతం చరాచరం" అనగా "ఈసర్వభూతముల యందూ నేనులేని వస్తువు ఏదియూ లేదు' అన్న ఈభగవద్గీతా వాక్యం 'పురుష ఏవేదగ్ం సర్వం' అన్న పురుషసూక్త వచనమునకు వ్యాఖ్యానమే! ఆ పురుషుని అనేక నామములతోనూ, అనేక రూపములతోనూ రూపకల్పన చేసి అభివాదము (నమస్కారము) చేయుచున్నాము. *ఇదియే విభూతి యోగమున తెలుపబడిన రహస్యము.

---

*నామాని కృత్వా అభివదన్ యదాస్తే (పురుషసూక్తం)

అర్జునునకు ప్రత్యక్షముగా చూపబడిన విరాట్ పురుషుని వర్ణనయే "విశ్వరూప సందర్శన యోగము."

మొదటిది సర్వసృష్టిలోనూ భగవంతుడు విరాట్ పురుషునిగా ఉన్నాడన్న మానసిక భావనయే. ప్రత్యక్షానుభవము లేకపోవుటచేత విరాట్ స్వరూప మెట్లుండునో అన్న విషయము గోచరముకాదు. ప్రత్యక్షముగా చూచిననేగాని ఈ నమ్మకము స్థిరపడదు. అందుకని 'విశ్వరూప సందర్శనము' ప్రత్యక్షముగానే చూపబడినది. పురుషోత్తమ ప్రాప్తియోగములో ఈవిరాట్ పురుషుని ప్రాప్తించు మార్గము, లేక జీవుడు చేరవలసిన గమ్యము, దాని విధానము చెప్పబడినది.

ఈ విధముగా **10, 11, 15** అధ్యాయములలో విరాట్ పురుష రహస్యము ఉపదేశింపబడినది. అనగా పురుష సూక్తమున ప్రతిపాదించబడ్డ అనేక శీర్షుడైన పురుషుడే (నారాయణ సూక్తమున గూడా వర్ణింపబడి యున్నట్లుగానే) భగవద్గీతలో సాక్షాత్కారముగా ప్రదర్శింపబడిన 'విశ్వరూపము.'

ఇలా ప్రత్యక్షముగా చూచినప్పుడే ఆ భగవత్ స్వరూపమిట్టిదని అర్థమగును. కేవలం మాటలతోనే వింటూన్నంత వరకూ సంశయము తిరిగి, తిరిగి కలుగుచుండును. కాని ఒక్కసారి ప్రత్యక్షముగా చూచినంతనే అన్ని సందేహములూ పటాపంచలగును. అందుకే అర్జునునకు విరాట్ పురుషుని యొక్క విశ్వ

రూపము సాక్షాత్కారముగా చూపించబడినది. * అదే ఈ అధ్యాయములో గమనిద్దాము.

ఇది ఒక మనోహర సన్నివేశము. అప్పుడేమి జరిగినదో యథాతథముగా గమనిద్దాము.

'ఆనాడు కార్తీక బహుళ త్రయోదశీ, అమావాస్య ఒక్క రోజునే నడిచిన తిథిత్రయం**తో సూర్యగ్రహణం పట్టినది. అపుడే ఇరుసేనలూ యుద్ధానికాయత్తమై బారులు దీర్చి యున్నారు ! కురుక్షేత్రమనే పవిత్రస్థలమే ఆదర్శ క్షేత్రమైన సంగ్రామభూమి. భారదేశ చరిత్రలో అనేకసార్లు భారత దేశంయొక్క అదృష్టము నిర్ణయింపబడిన పుణ్యభూమి అక్షేత్రం.

ఒకవైపున కౌరవ సేనావాహిని బారులుతీర్చివున్నది. పదకొండు అక్షౌహిణుల సేనా, దానికి ముందుగా నిలబడినవాడు భీష్ముడు, సర్వసేనాధ్యక్షుడు; శ్వేతచ్ఛత్రము, శ్వేతధ్వజమూ ధరించి, తెల్లగుర్రాలు పూన్చిన రథంమీద తెల్లటి ఉడుపులతో, తెల్లటి తలపాగా, తెల్లయీకల కుచ్చులుగల తురాయి ధరించి, తెల్లగా మంచుకొండవలె, ప్రకాశిస్తున్న భీష్ముడు మూడువందల అశ్వమేధయాగాలు చేసిన మేటి. అతని అధీనంక్రింద, సముద్రము వలె ఘూర్ణిల్లుతూ కౌరవసేనా వాహిని బారులు తీర్చి నిలిచి వున్నది.

---

* ఇది "యుగ పురుషుడు" అన్న నా గ్రంథములో 'శ్రీకృష్ణుని విశ్వరూపం' అన్న పేరుతో వర్ణించబడినది.

** త్రయోదశీ పంచదశికృతైకం రహుణాపునం (మహాభారతం మౌసలపర్వం)

దానికెదురుగా ఏడు అక్షౌహిణుల బలం, పాండవసేనా వాహిని భయంకరమై భీమసేనుడి రక్షణ క్రింద నిలువ బడినది. సేనాకోలాహలం సముద్రపు హోరులా ఘోషిస్తున్నది

అది ఉభయ సేనలలూ యుద్ధానికి ఉద్యుక్తులవుతున్న సమయం. రెండు ప్రక్కలనుంచీ భేరీ నినాదాలూ, హయహేషలు, ఏనుగుల ఘీంకారాలూ, వీరుల ధ్వజములు, గాలికి రెపరెపలాడుతున్న రంగురంగుల పతాకాలూ, ఎటుచూసినా అనేక ఆయుధాల తళతళలూ, ఈ సేనా సమ్మర్దంతో పైకి లేచిన ధూళీ, సూర్య రశ్మిని కప్పి సంధ్యారాగం లాగ అలుముకుంటున్నది. సమరోత్సాహం పెనుతుఫానులాగ చెల రేగుతున్నది.

ఇరుసేనల మధ్యా నిలబడివున్నది, పాండవ మధ్యముడి రథం. దూరాన్నుంచి చూస్తే విచార వదనముతో మ్లానముఖుడై వున్నాడు పాండవ మధ్యముడు. అతనితో దగ్గరగా జరిగి, వీపు మీద చెయ్యివేసి ఆత్మీయతతో రహస్యంగా ఏదో చెపుతున్నాడు మాధవుడు.

బహుశః ఏవేవో చిక్కు ప్రశ్నలకి నిగూఢములైన సమాధాన ములు యిస్తూ వున్నట్టుగా కనబడుతుంది. చూస్తూవుండగానే అర్జునుడి ముఖంలో ఒక్కసారిగా ఏదో వింత తేజస్సు వెలిగింది. మొహంలో ఆసక్తీ, కుతూహలం యినుమడించాయి. ముందుకు వొంగి శ్రీకృష్ణుడు చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు.

“సరేకాని మాధవా! అంతా అవగాహన అయింది. నీవు

చెప్పినవీ అరటిపండు వొలిచినట్లు వివరంగా తెలుస్తూనే వున్నది. అంతా సబబుగా చక్కగానున్నది! ఈ విశ్వం అంతా భగవన్మయ మని చెబుతున్నావు. శాస్త్రాలు గూడా అలానే చెబుతున్నాయి. బాగానే వుంది. వేదాలు కూడా పురుషసూక్తంలో అదే చెపు తున్నాయి. ఈ ప్రపంచం అంతాకూడా బ్రహ్మాండం అంతటా నిండివున్న విరాట్పురుషుడి యొక్క శరీరమే! అందులో అణు వులూ – పరమాణువులవలె, ఈకనిపించే ప్రపంచాలు విరాజిల్లు తున్నాయి. తెలిసింది! కాని ఈ భువన మోహనమైన 'విశ్వ రూపుడి' సౌందర్యం కనులారా తిలికించాలని మనస్సు ఉవ్విళ్ళూరు తున్నది.

ఒక్కసారి నీ భగవన్మయమైన దివ్యస్వరూపం–భగవంతు డిగా నీస్వరూపం – ఎలా వుంటుందో చూడాలనియున్నది. అని భక్తితో, ప్రార్థనా పూర్వకంగా అడిగాడు అర్జునుడు. అలా అర్జును డడిగిన ఆ మాటలకి సహృదయతతో నిండిన విప్పారిన చూడ్కు లతో, నిండు హృదయంతో అర్జునుడి వంక చూస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు.

"భగవన్మయమైన దివ్యస్వరూపాన్ని చూడటానికి నీకు యీ చర్మచక్షువులు చాలవు. ఈ చర్మచక్షువులకి యీ పదార్థమయ మైన ప్రపంచమూ, దాని భౌతికరూపమే గోచరిస్తుంది. ఆ దివ్య స్వరూపాన్ని చూడడానికి నీకు దివ్య చక్షువునిస్తున్నాను చూడు. ఈ దివ్యదృష్టితో నా శరీరంలోనే నీకు భగవన్మయమైన విరాట్ విగ్రహమంతా కూడా కనబడుతుంది, ఇందులో నువ్వు చూడ దల్చుకున్నవీ, మనస్సు పడుతున్న వేగాక. నీకు ఊహాకందనటు

వంటి దివ్యదృశ్యాలు, అద్భుత దర్శనాలు అనేకం చూడు. అత్యద్భుతములైనటువంటివి, ఎప్పుడూ కనీవినీ ఎరుగని దివ్యానుభూతుల్ని పొందు. చూడు! ఇదిగో!" ...అంటూ ఒక్కసారిగా అర్జునుడి భ్రూ మధ్యంలో (రెండు కనుబొమ్మల మధ్యన నుదురు) స్పృశించి దివ్యదృష్టిని ప్రసాదించాడు.

## విశ్వరూపము :

వెను వెంటనే, వేయిసూర్యులు వెలిగినట్లు మెరిసిన ఆ దివ్యదర్శనంతో అర్జునుడి శరీరం గగుర్పొడిచింది. రోమాలు నిక్కపొడుచుకోగా, హర్షాశ్చర్య కుతూహలాలు ముప్పిరిగొని ఉక్కిరి బిక్కిరి చెయ్యగా, శరీరం స్తంభీభూతమై చూచేదృశ్యం తానై చూశాడు.

అతనికి కనిపించిన ఆ దివ్యదర్శనం, ఆ మహాద్భుత రూపాన్ని వర్ణించటానికి వ్యాసమహర్షికి మాటలు చాలలేదు. ఆధ్యాత్మికానుభవాన్ని భాషలో పెట్టడం ఎలా వీలవుతుంది? ఆ దివ్యమూర్తి వర్ణనాతీతం. ఆ దర్శనంలో ఏం చూశాడు ?'

...అనేకవేల శిరస్సులతో, అనేకవేల బాహువులతో, వేలకి వేల నేత్రాలూ, ముఖాలూ, పాదాలూ, నానావిధ రూపాలతో నానా వర్ణాలతో వెలుగుచున్నది. ఎటుచూచినా తానేఅయి, ఆదీ అంతమూ లేకుండా అన్ని ప్రక్కలా నిండి విశ్వతోముఖమై వెలుగుతున్న ఒక బ్రహ్మాండమైన రూపం కనపడింది.

తళతళలతో ధరించిన అనేకాయుధాలు, లెక్కకు మీరిన అభరణాలు, వేయి ఇంద్రధనుస్సుల రంగులతో అనేక రంగుల కిరణాలు చిమ్మగా, దివ్య సుగంధ పరిమళాలూ, దివ్యవాసనలూ అన్నీ ఒక్కుమ్మడిగా మనస్సుకి మత్తుకొలిపి ఏదో లోకంలోకి తీసుకుపోతున్నాయి ... ఆహా!

ఒక మహా పర్వతంలాగ — ఎక్కడో ఆకాశంలోకి చొచ్చుకొని, పైకి పెరిగిన కిరీటం! అక్కడ నీలాకాశం లోని వజ్రపు మిలమిలలు నక్షత్రకాంతిలో ఆ దివ్యకిరీటంలోని రత్నరాశి వెలిగిపోతున్నాయి. అనేక కోట్ల సూర్యగోళాలు, అనేక నక్షత్రమండలాలు, ఆ అనంత విశాలమూర్తికి శరీరంలోని రోమ కూపాలలాగ దూరంగా వెలుగుతూ కనిపిస్తున్నాయి,

ఆ మహామూర్తి ముఖం, అగ్నిగోళంలాగ విరాజిల్లుతోంది. సహస్ర సూర్య ప్రతిభాసమానమై, (వెయ్యిసూర్యులు వొక్కసారిగా ఆకాశంలో వెలిగితే ఎంత వెలుగు కనిపిస్తుందో అంత తేజస్సుతో). మిరుమిట్లుకొలిపి, మహావీరుడైన అర్జునుణ్ని భయపడేట్టు చేసింది.

దిక్కులన్నీ తన తేజస్సులో ముంచివేస్తున్న ఆ మహావిగ్రహుని శరీరంలో అనేక దేవతలు, మునులు, అప్సరసలు, నాగులు, భూత పిశాచ దానవ మానవగణాలు, సర్వజీవమయమైన యీ సృష్టి యావత్తూ. ఏకస్థమై భాసిస్తోంది. అతని శరీరంలో రుద్రుడు, యముడు, అగ్ని, వరుణదేవుడు, దిక్పాలకులు, వసువులు, ఆదిత్యులు, గంధర్వులు, విశ్వ దేవతలు, అశ్వినులు, మరుత్తులు,

ఇంకా సిద్ధచారణ మునిగణాలు, గ్రహాలు, సౌరమండలాలు ఒకే టేమిటి – సర్వ ప్రపంచమూ ఏకస్థమై ఒక్కసారిగా మూర్తి మంతమై సాక్షాత్కారించింది.

ఆ దివ్యమూర్తులందరూ విరాడ్విశ్వరూపంగా ఒక్కసారి దర్శనమిచ్చేసరికి అర్జునుడు అప్రతిభుడయ్యాడు.

ఆ విశ్వమూర్తి యొక్క రూపం, ఇక్కడ ప్రారంభిస్తున్న దని, ఇది మధ్య అని – ఇది తుది అని ఏమీ కనిపించక – అంచులు లేని ఒక మహాసృష్టి సముద్రంలాగ, అనంతాకాశంలాగ – అలా చూసినకొద్దీ పెరిగిపోతూ, చూపుమేరకు అతీతమై ఊహకు వెక్క సమై, సర్వమూ నిండియున్నది. ఎటుచూచినా ఆ మూర్తి దివ్య స్వరూపమే. ఎటుతిరిగినా ఆయన కిరీటకోట్ల వెలుగులే దిక్కులు నిండియున్నాయి.

అర్జునుడికి తను ఎటుతిరిగితే అటు తూర్పున, పడమరన, ఉత్తరాన, దక్షిణాన, ఏదిక్కు చూచినా అయన దివ్యమూర్తే కనిపించసాగింది. చివరికి కళ్ళు తెరిచినా, కళ్ళుమూసుకున్నా అదే స్వామి లోపలా, బయటా అంతటాగూడా వేంచేసిన వేలుపై వెలిగాడు. విశ్వమంతా అయన ఆలయం, శరీరమంతటా ఆయన నిలయం, కాదు! సర్వశరీరాలూ, సర్వలోకాలూ, సర్వకాలాలూ, ఈలోకమూ అన్నీ, ఆయనలోనే వున్న అద్భుతమూర్తిని చూసిన పారవశ్యం అప్రయత్నంగా అణచుకోలేని ఆవేదనగా, ప్రార్థనగా, పార్థుడిలో పొంగివచ్చింది. అప్రయత్నంగా చేతులు వాటంతటవే

ప్రణతు లొనర్చినాయి! శిరస్సు భక్తిగౌరవ వినమ్రతల బరువుతో వ్రాలింది. కన్నులు అరమూతలుగా లోపలా బయటా కూడా అమూర్తినే చూస్తూ ద్రవించినవి. ఆ సర్వాశ్చర్యమయ మూర్తి, విశ్వతోముఖుడై జాజ్వల్యమానంగా వెలుగుతూ తాను సుదుర్దర్శను డైనాడు. అర్జునుడికి అనుభూతి అవధులుదాటి, కట్టలు తెంచుకొని స్తోత్ర ప్రవాహమై పారినది.

ప్రళయకాలంలో ప్రపంచాలను దహించటానికి ప్రజ్వలించే అగ్నిహోత్రంలాగ జ్వాలామాలాభీలంగా వెలిగి పోతున్నదా పెద్ద నోరు! అందులోకి మిడతలలాగ వేలసంఖ్యలలోపొయి పడుతున్న సేనావాహిని ఆశ్చర్యంగా కనిపించింది. భీష్ముడు, ద్రోణుడు, ఇతర కురుప్రవీరులు, వాళ్ళ సేనాసమూహంతో పాటు కోలా హలంగా పరుగులు పెట్టుకుంటూ పోయి దానిలో పడుతున్నారు. వరదలతో పొంగిపొర్లుతూ పరుగెత్తే నదులు, సముద్రగర్భంలో కలిసిపోతున్నట్టు, ఈ మిడతల దండులాంటి కురు సేనావాహినులు ఆ కాలమూర్తి వదన గహ్వరం లోకి ప్రవేశించి అంతరించి పోతు న్నాయి. రూపులేకుండా, ఒక కురువీరులేగాదు, సృష్టింపబడిన సర్వమానవులూ సైన్యాలూ, పాండవసేనలూ, కురువీరులూ, అంద రూగూడా అలాగ ఒక్కుమ్మడిగా పోయి పడుతున్నారు కాల ప్రవాహం ముందుకి తోసుకుపోగా దిక్కుతెలియక పరుగిడుతూ, పరిగ్గాపోయి ఆ భయంకర జ్వాలాభీల కరాళవదనంలోకి అగాధంలో లాగ పడిపోతున్నారు. అదే సర్వజీవులూ చివరకు చేరే గమ్యం! నిలిచివున్న ఆ మృత్యువులోకే ప్రవేశిస్తూవున్నారు అందరూ.

మళ్ళీ అందులోంచే సృష్టి! అంతలోనే ఆయన హృద

యంలో ఒక మహాపద్మం! ఆ పద్మంమీద ముద్దులు మూటకట్టే విన్నారిబ్రహ్మ! తన నాలుగు ముఖాలతో నాలుగు దిక్కుల్నీ సృష్టించి నాలుగు వేదాలు ధ్వనిస్తూంటే, ఆయన హృదయంలో పద్మాసనస్థుడై వున్నాడు! అంతటా వ్యాపించివున్న విశ్వపురుషుని అంగాంగాలలో దేవతలూ, దివ్యసర్పాలు మహర్షులు, ఇంకా ఏవేవో దివ్యరూపాలూ, తేజోమయ మూర్తులూ ఎన్నడూ చూచిఎరుగనివీ, ఊహించరానివీ అలా అనేకం చూచాడు' కిరీటి! ఈ ఆశ్చర్యంలో తననుతానే మర్చిపోయి ప్రార్థించాడు.

నమస్కరిద్దామంటే ఎటుచూచినా ఆయన మూర్తే! ఆ మూర్తిలోపలే తానున్నాడు. సర్వకాల స్వరూపుడై వున్న ఆసమగ్ర దేవతామూర్తి శరీరంలో సృష్టిస్థితిలయాలూ కాలం, ఆకాశం, దిక్కులు అంతాకూడా నిండియున్నది. ఆలా భూతభవిష్యద్వర్త మానాలైన మూడుకాలాలూ ఆయన శరీరంలో ఒక్కసారే దర్శిం చారు. నాటకంలో రానున్న దృశ్యంలోనిది. రంగస్థలంలో తెర మీద ఆడుతున్నదీ, గడిచిపోయిందీకూడా ఒక్కసారే రచయిత మనస్సులో ఒక్కకాలంలోనే వున్నట్టుగా నున్న, ఆ విశ్వరచనా దక్షుని అద్భుతశక్తికి విస్తుపోతూ చూచాడు అర్జునుడు. ఒక గడ్డి పోచ కొనన నిల్చిన చిరుమంచు బిందువులో యావత్ప్రపంచమూ ప్రతిబింబిస్తున్నట్టుగా, మానవ శరీరంలో శ్రీకృష్ణుడిలాగ కనిపించే, ఆ శరీరంలో, నిహితమైవున్న విరాట్‌రూపాన్ని సర్వ వివరాలతో, సూక్ష్మమయిన అంశాలతోసహా, మొత్తం సృష్టిని చూచాడు.

అని ఈవిధంగా 'భగవద్గీత' పదకొండవ అధ్యాయంలో

వ్యాసమహర్షి చక్కగా వివరించాడు, కళ్ళకుకట్టినట్టు ! ప్రపంచంలో ఏ భాషలోనూ, ఏ సాహిత్యంలోనూ ఎక్కడా ఇలాంటి భగవత్ దృశ్యం మనకి కనబడదు. చివరికి బైబిలు, ఖురానుల్లో కూడా భగవంతుడి సాక్షాత్కారం, చాలాచోట్ల వర్ణితమైవుందిగాని ఇలాంటి, విశ్వవిస్తృతమైన భగవత్ రూపభావన ఎక్కడా కన్పించదు.

ఇలాగ కురు పాండవ యుద్ధంలోనేగాక శ్రీకృష్ణుడు తన విశ్వస్వరూపాన్ని యితర సన్నివేశాలలో కూడా దర్శింపచేశాడు. అనేక ఘట్టాలలో. చిన్నప్పుడు పసిపాపగా పాలుతాగుతూ తల్లి ఒడిలో శయనించిన కృష్ణయ్య తన వదనంలోపల తల్లి యశోదకి బ్రహ్మాండగోళాన్ని చూపించాడు. మన్నుతిన్నావంటూ తల్లి దండించినప్పుడొకసారి ఇలాగే తన నోట్లో నదులూ, సముద్రాలు, పర్వతాలు, నక్షత్రాలు, సూర్యచంద్రులు, దిక్కులు, ఆకాశం పంచభూతాలు ... బ్రహ్మాండగోళం యావత్తూ కనిపించింది.

అలాగే యింకోసారి ఉదంకుడనే మహర్షికి అర్జునుడికి చూపినలాటి దివ్యరూపాన్నే భారతయుద్ధము అయిన తర్వాత ద్వారకకు పోతూ చూపించాడు. అతడు చిరకాలం చేసిన తపస్సుకి ఫలితంగా తన విరాట్‌విగ్రహాన్ని చూపించాడు. చివరికి ధృతరాష్ట్రుడికి గూడా, తను రాయబారం వెళ్ళినప్పుడు సభాభవనం అంతా ఆక్రమించి తన దివ్య విజృంభణమును దర్శింపజేశాడు. ఈవిశ్వరూపం చూపించటమూ, "భగవద్గీత" యొక్క ఆవిష్కారమూ – ఇవి యింక ఏ అవతారంలోగూడా. కనపడని అపూర్వ

దివ్య విశేషాలు. అందుకే సంపూర్ణమైన అవతార సాక్షాత్కారం శ్రీకృష్ణుడిలో జరిగిందని అంటారు "కృష్ణస్తు భగవాన్ స్వయం" అని పురాణాలూ, భాగవతంకూడా ఎలుగెత్తి చెప్పినాయి.

అయితే మానవ స్వరూపంలో వున్న శ్రీకృష్ణుడనబడే చారిత్రక వ్యక్తిలో, ఈ భగవద్విగ్రహమైన ఈ విరాట్ స్వరూపం శరీరంలో ఎలా నిబిడీకృతమై వున్నది? అన్న ప్రశ్న కలగవచ్చు. ఇది మనకు ఆశ్చర్యంగానూ కనిపించవచ్చు.



11

# శరీరమే జగత్తు

విరాట్పురుషుని శరీరములో సర్వ ప్రపంచమూ ఎలా ఉన్నదో గమనించాము. ఇతడు బ్రహ్మాండమే శరీరముగా గల 'విరాట్' ఈ అధ్యాయంలో మానవ శరీరంలో వున్న బ్రహ్మాండం గురించి తెలుసుకుందాం.

విరాట్పురుషోపాసన గురించి గత అధ్యాయాలలో సూచనగా గమనించాము. అది సవిస్తరంగా వివరాలతో ఇక్కడ విశదపరుస్తాను. శరీరంలోవున్న జీవుడు పిండాండ మనబడును. విశ్వమంతా నిండిన వ్యక్తినే బ్రహ్మాండమని అంటాము. ఈ పిండాండ బ్రహ్మాండములు రెండూ ఒక దానికొకటి 'కాపీ' లేక బింబ ప్రతిబింబములుగా ఉన్నాయన్న సత్యాన్ని అనుభవం ద్వారా గ్రహించడమే విరాట్పురుష విద్యలోని మూలసూత్రం. బ్రహ్మాండమూ, పిండాండమూ ఒకటేనని కేవలం మనసుతో అనుకోగానే సరిపోదు, ఇది నిత్యభావనగా స్థిరపడాలి. అలా స్థిరపడకుండా మనకి నిత్యం జీవితంలో కలగే సుఖదుఃఖాలు మనస్సును చలింపజేసి ఈ స్థిరమైన ధారణను భగ్నం చేయడానికి యత్నిస్తాయి. ఇదే మాయ. మనకి నిత్యం సమాజంలో ఆతర వ్యక్తులవల్ల కలుగుతున్న సుఖదుఃఖాల ప్రభావం వల్లసుడిగాలివలే, అహంకార మమకారాలు చెలరేగి స్థిరమైన భావన నిలబడకుండా ఉద్రూతలూగించి వేస్తూ

వుంటాయి. ఈ పెనుతుఫానులకు తట్టుకొని నిత్యం తన శరీరం లోనీ జగత్తును దర్శించడమే సాధన. దీన్ని పట్టువిడవకుండా చేయడమే నిష్ఠ. దీనికి కొన్ని యోగరహస్యాలు తెలియాలి. కేవలం ఊహ, లేక "నేనే విరాట్పురుషుణ్ణి" అన్న భావన ఒకటే చాలదు. దీనికి విరాట్పురుషోపాసనా రహస్యాలు తెలియాలి. ఈ రహస్యాలు బహుగుప్తమై సామాన్యుల కందకుండా రహస్య పరిభాషలో అనాది కాలంనుంచీ వస్తున్నాయి,

సిద్ధ పురుషులైన గురువులే (లోకపాలకవర్గములోని అధికార పురుషులే ఈ సిద్ధగురువులు) ఈ రహస్యాన్ని తెలిసినవారు. అందువలన ఈ విరాట్పురుష రహస్యాలను కొన్నిటిని ఇక్కడ వివరిస్తాను. పురుషసూక్తములోని విరాట్పురుషుని మన శరీరంలో దర్శించే విద్యను సాధకుల కందించాలనే సంకల్పంతోనే ఈ క్రింది వివరాలు ఉపదేశించటం జరిగింది.

## రాజవిద్య :

ఈ విరాట్పురుషోపాసన ఒక పరమరహస్యమైన రాజవిద్య. "రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమం" అని భగవద్గీతలో విరాట్పురుషుని సహస్రశీర్ష బాహువు పాదములతో తన శరీరంలోనే చూపించిన శ్రీకృష్ణుడు అర్జునునకు గుప్తంగా తెలియజేశాడు. ఇది కేవలం భగవద్గీతలోని ఈఒక్క 11-వ అధ్యాయం చదివితే అర్థం కాదు. దాని రహస్యాలు తెలియాలి. ఈ విద్య సహస్రశీర్ష పురుషుడైన నారాయణుని నుంచి బ్రహ్మ ఉపదేశం పొంది సర్వజీవులనూతనలోంచే సృష్టించాడు. ఈ విద్యనే మనకు నిత్యం కన

బడే సూర్యుడు విరాట్పురుషుని నుంచి ఉపదేశంగా పొందాడు. ఆయన నుంచి వైవస్వత మనువు గ్రహించి (ఇతడు సూర్యుని కుమారుడు) మానవజాతికి మొదటి చక్రవర్తిగా తన వంశీయులైన సామ్రాట్టులందరికీ ఉపదేశించాడు. రాజులచే అభ్యసించబడి ఇది రాజవిద్య అయింది. ఇక్కడ "రాజు" అంటే దేశాన్ని పరిపాలించే రాజని కాదు, అర్థం. విరాట్పురుషుడు అని అర్థం. తేజోమయుడే రాజు. అనగా తేజస్సును వెదజల్లే ఆత్మ గలిగిన వాడే రాజు. రాజిల్లే వాడే రాజు. "రాజసృదీప్తా" అని ఉత్పత్తి సూర్యునిలో వున్న సూర్యాంతర్వర్తియైన ఆదిత్య పురుషుని సహస్రశీర్షా పురుషునిగా దర్శించే రహస్యమే ఈ రాజవిద్య. ఇదీ సమస్త విద్యలలోకి రాజు అందుకని రాజవిద్య, లేక రాజయోగము అనబడినది. దీనివలన మానవుడు 'సామ్రాట్టు' అవుతాడు. అనగా స్వరాజ్యమును పొందుతాడు. (ఆప్నోతి స్వారాజ్యమ్ అని వేదము చెబుతున్నది) ఇక్కడ 'స్వారాజ్యం' అంటే శరీరంలోని ఇంద్రియాలు, మనస్సు, క్రోధ, లోభ, మద, మాత్సర్యాలకు ఆత్మ లోబడకుండా వుండుటయే. సరాసరితానే రాజుగా ఆత్మయే, ప్రాణములను పరిపాలించు యోగశక్తియే స్వరాజ్యము. ఇదియే ఆత్మ సామ్రాజ్యము. ఆత్మయే పరిపాలించునది.

మనము మనస్సుచే పరిపాలింపబడుచున్నాము (కోరికలకు లొంగి), పరిస్థితులవల్ల పరిపాలింపబడుతున్నాము. (కర్మకు లొంగి), పదార్థమునకు లొంగి దానిచేత పరిపాలింపబడుచున్నాము (అన్నమునకు లొంగి), అన్నవస్త్రములకూ, ఆశలకూ లోబడి బ్రతుకుతున్నాము (ఉద్యోగము వలన). ఇలా ఇందరు

యజమానులకు సేవకుడై మానవుడు పారతంత్ర్యమున జీవించు చున్నాడు. ఇది వదలి స్వాతంత్ర్యము నొందుటయే పరిపూర్ణ మానవత్వము. అది పొందినవాడే మనువు. ఇక పరిపూర్ణ మాన వత్వమును దాటి దైవత్వమును గూడా పొందవలెనంటే తనలోనే గ్రహమండలములను దర్శించి వానిని జయించవలెను. దీనివలన గ్రహాధిపత్యము వచ్చును. పూర్వము ఇట్లు మోక్షముపొంది గ్రహత్వము సంపాదించుకున్నవారే ఒకానొకప్పుడు మానవులుగా నుండిన బృహస్పతీ, శుక్రుడు, సూర్యుడు మొదలగువారు. తన లోని సూర్యుని దర్శించి సాక్షాత్కరింప జేసుకొనుటచే జీవుడు ఆదిత్యులలో నొకడగును. ఇలాగ తన శరీరంలో నేదేవత నుపా సించి దానిసిద్ధిని పొందునో ఆ దేవతాస్థితినే తాను పొందుచున్నాడు. ఇదే పురాణములలోని గాథలలో జీవులు ఇంద్రత్వమూ, దేవ త్వమూ, బ్రహ్మత్వమూ, ధృవపథమూ మొదలగు స్థితులను పొందుటలోని రహస్యము.

ఇట్లు ఏదో ఒక దేవతనుపాసించుటగాక తన శరీరములో సర్వదేవతలనూ దర్శించుట వలన నది విరాట్పురుషోపాసన అగును. శరీరములో విరాట్టును లేక సర్వబ్రహ్మాండమునూ కను గొను రహస్య సూత్రములు కొన్ని ఈ క్రింద వివరించ బడినవి.

## మానవ శరీరములో విరాట్టు :

6 అడుగులు ప్రమాణము గలిగిన మానవశరీరమే సర్వ సృష్టి–స్వరూపము. ఇందు వెన్నెముక మేరుస్థానము. వెన్నెముక

అడుగు భాగము (అనగా ఆసనమునకూ లింగమునకు మధ్య భాగము) మూలధారము. ఈ మూలాధారమున తామర దుంపవలే మూలకందము (కందమూలము) కలదు. దుంపకు వేళ్ళు కలిగి వట్లే ఈకందమునుండి అన్నివైపులకూ 72,000 నాడులు వున్నాయి.

## నాడులు :

ఈ 72,000 నాడులలో 14-నాడులు ప్రధానమైనవి. ఈ 14-నాడులూ పాడ్యమి మొదలుగా చతుర్దశి వరకునూ గల 1-14 తిధులలో సంబంధము కలిగియున్నవి. అంతేకాదు, శుక్ల పక్షము లోని ఈ 14-తిధులకున్న అధిపతులే సృష్టికల్పములోని 14-గురు మనువులు.

ఈ 14-నాడులకూ పేర్లు !—

| | |
|---|---|
| 1) పింగళ | 8) అలంబుస |
| 2) ఇడ | 9) కుహు |
| 3) సరస్వతి | 10) విశ్వోదార |
| 4) పూష | 11) పయస్విని |
| 5) వరుణ | 12) శంఖి |
| 6) సప్తజిహ్వ | 13) గాంధార |
| 7) యశస్విని | 14) సుషుమ్న |

పై 14 నాడులలో ఇంకనూ ప్రధానమైనవి మూడు నాడులు. ఇవి త్రిమూర్తులకు సంబంధించినవి. ఇవి 1. ఇడ 2. పింగళ

3. సుషుమ్న. ఈ మూడునాడులు బ్రహ్మ, విష్ణు మహేశ్వరు లైన త్రిమూర్తులను అధి దేవతలుగా కలిగియున్నవి. ఇడానాడికి విష్ణువు అధిపతి. పింగళకు రుద్రుడు అధిపతి. సుషుమ్ననాడి యోగశాస్త్రములో గూడా "బ్రహ్మనాడి" అనిపేరు గలదు.

## సుషుమ్న నాడి :

ఇది ఇడాపింగళ నాడులకు మధ్యన గలదు. దీనినే లక్ష్మీ సహస్రనామములో "ఇడా పింగళకామధ్య సుషుమ్నా గ్రంధి భేదినీ" అని చెప్పబడినది. ఈ సుషుమ్నానాడియే మోక్షమును ప్రసాదించును. మోక్షమును పొందుటకు బంధత్రయమును ఛేధించవలెను. ఈ మూడుబంధములూ మన ఆత్మను బంధించి యున్నవి. ఈ మూడు గ్రంధులను భేదించి, జీవుడు మూడు బంధములనుండి విముక్తుడగుటకే మోక్షమని పేరు.

ఇడా, పింగళ, సుషుమ్నా నాడులు మెలకువ, నిద్ర, సుషుప్తి అను మూడు స్థితులకు సంబంధించినవి. సుషుప్తికి సంబంధించినది గనుక "సుషుమ్ననాడి" అనిపేరు.

## కుండలిని :

మూలాధారములోనున్న మూలకందనమునకు పైనకుండ లినీ శక్తి యున్నది. అనేక తంత్రగ్రంథాలలో ఆదిశక్తియని, మూలప్రకృతియని, జగన్మాతయని, గాయత్రియని అనేక పేర్లతో

పిలువబడే స్త్రీస్వరూపిణియైన శక్తి ఈకుండలినీ శక్తియే. ఇది నిగూఢమైన రహస్యము.

ఈ కుండలినీ శక్తిని మేల్కొలిపితే మూలాధారమునుండి పైకిలేచి సుషుమ్నానాడి యొక్క ద్వారములో ప్రవేశించి గొట్టము లోనుంచి పైకెక్కు నీరువలె, వెన్నెముకలోని బ్రహ్మరంధ్రము ద్వారా, శిరస్సులోని సహస్రారమును చేరును. ఇది ప్రయాణము చేసే దారిలో ఆరుచక్రములున్నవి. సహస్రారముతో కలిసి మొత్తం 7 చక్రములూ, గాయత్రీ దేవతయొక్క సప్తవ్యాహృతులే. వెన్నె ముకలోని వెన్నుపూసలు గూడా $7 \times 7 = 49$, (సప్తసప్తి) అని వేదము తెలుపుచున్నది దీని వివరములు గాయత్రీ మంత్రార్థ ములో ఇవ్వబడినవి గావున ప్రస్తుతమిది చాలును.

## నాడులు :

మూలకందము నుండి 72,000 నాడులు బయల్పడి అందులో 14 ముఖ్యమైనవని తెలుసుకొంటిమి ఇందు ,—

1) సుషుమ్నానాడికి ఎడమవైపున ఇడానాడి వున్నది. కుడి వైపున పింగళనాడి యున్నది.

2) సుషుమ్నా నాడికి బైటగా రెండు పార్శ్వముల యందు సరస్వతీనాడి, కుహునాడి కలవు.

3) ఇడానాడికి వెనుక గాంధారనాడి యున్నది. అట్లే హస్తిజిహ్వ అను నాడి ఇడానాడికి ముందరగా యున్నది.

4) అదే విధముగా పింగళ నాడికి వెనుక "పూష" అనే నాడి, ముందరగా 'యశస్వినీ' అనే నాడియూ కలవు.

5) 'కుహు' నాడికినీ 'హస్తిజిహ్వ' నాడికినీ మధ్యగా నున్నది 'విశ్వోధరా' అనే నాడి.

6) అదేవిధముగా 'యశస్వినీ' నాడికినీ 'కుహు' నాడికినీ మధ్యభాగములో 'వరుణ' నాడియున్నది.

7) సరస్వతీ నాడికినీ, 'పూష' అనే నాడికినీ మధ్యగా యశస్వినీ నాడి యున్నది.

8) సరస్వతీ నాడికి, గాంధారి నాడికినీ మధ్యభాగములో శంఖినీ నాడిగలదు.

9) మూలకందమునకు మధ్యగా గుదస్థానము వరకూ, 'అలంబుస' అనే పేరుగల నాడియున్నది.

పైనాడులను ఎందుకని చెప్పవలసివచ్చిందంటే ఈ నాడుల నాశ్రయించి మనశరీరములో దేవతలున్నారు. విరాట్పురుష విద్యలో సర్వదేవతలనూ, శరీరములో దర్శించు రహస్యము గలదు. అందు వలన మనశరీరములో దేవతలు ఏయే ప్రదేశములలోనున్నారో తెలియుటకీ నాడీజ్ఞాన మవసరము. ఈ క్రింది పట్టికలో ఏయే నాడికి ఏ అధిదేవత సంబంధించియున్నాడో ఆ వివరములు తెలుప బడినవి.

| | | |
|---|---|---|
| 1) విష్ణువు | = | ఇడానాడి |
| 2) శివుడు | = | సుషుమ్నానాడి |

3) బ్రహ్మ = పింగళానాడి
4) విరాట్ = సరస్వతినాడి
5) వరుణుడు = హస్తిజిహ్వానాడి
6) సూర్యుడు = యశస్వినీనాడి
7) వాయువు = వరుణానాడి
8) పూష = పూషానాడి
9) చంద్రుడు = గాంధారనాడి
10) అబాత్మఅగువరుణుడు = అలంబుసానాడి
11) అగ్ని = విశ్వోదరనాడి
12) ప్రజాపతి = పయస్వినీనాడి
13) చంద్రమసుడు = శంఖినీనాడి
14) క్షత్తు = కుహూనాడి

ఈ విధముగా ఒక్కొక్క నాడికి ఒక్కొక్క అధిదేవత యున్నాడు.

## అవయువములలో దేవతలు :

పైన చెప్పబడినవి నాడీసంబంధమైన దేవతలు, ఇకముందు చెప్పబోవునవి శరీరములోని ఏయే అవయువమున ఏయే దేవత అధిష్ఠించి యున్నాడో అ రహస్యము. ఇది పురుషసూక్తమున బాహ్యముగానే (అందరికి తెలియునట్లు) వర్ణింపబడినది.

1. హృదయము = బ్రహ్మస్థానము అనగా బ్రహ్మదేవుడు హృదయములో అధిష్ఠించియున్నాడు.

2. ముఖములో = అగ్నిహోత్రుడు
3. వాక్కులో = ఇంద్రుడు
(ముఖాదింద్రశ్చాగ్నిశ్చ)
4. శ్వాసయందు = వాయువు
5. మనస్సున = చంద్రుడు
6. లింగమున = ప్రజాపతి
7. వృషణములందు = మిత్రావరుణులు
8. నాలుకయందు = జలదేవతయైన వరుణులు
9. పాదములయందు = భూదేవత (భూమి)
10. నాభియందు = అంతరిక్షము
11. చెవులయందు = దిక్కులు
12. శిరస్సునందు = బ్రహ్మ (దినము)

ఇట్లు సర్వావయవములలోనూ, శరీర కార్యములను నిర్వహించుటకు దేవతలు పనిచేయుచున్నారు. శరీరములో దేవతలున్నట్లే కాలస్వరూపమైన సంవత్సరము, యజ్ఞస్వరూపమైన రాశిచక్రము మొదలగు కాలస్వరూపము యావత్తు గూడా వున్నది.

## శరీరములో సంవత్సరము :

'యజ్ఞః సంవత్సరః' అనివేదము. అంటే సంవత్సరమే యజ్ఞస్వరూపమని తెలిసినదికదా! ఈ 'యజ్ఞమే' యజ్ఞపురుషుని ఆకారము. అంతేగాక వేదము మనశరీరములో ప్రాణ సంచారము

---

* చూ "దర్శనోపనిషత్తు" (సామవేదీయ) చతుర్థఖండము.

వలన ఏ విధముగా సంవత్సర రూపేణ యజ్ఞము జరుగుచున్నదో తెలుసుకొమ్మని" ప్రాణో యజ్ఞేన కల్పతాం" అని ఉపదేశించినది. ఇది యోగ రహస్యము, శరీరములోని సంవత్సరాత్మకమైన కాల గమనము యోగికి తెలియును. శరీరములో ప్రాణమే సూర్యుడు. ఈ ప్రాణముయొక్క సంచారమే సంవత్సర చక్రములోని సూర్యుని సంచారము.

ప్రాణము పింగళనాడి యందు సంచరించు నప్పుడు యోగులు రహస్య పరిభాషలో "ఉత్తరాయణమని" తెలుపు చున్నారు. అదేవిధముగా ప్రాణము ఇడానాడియందు సంచరించు నప్పుడు దక్షిణాయనమని తెలియగలదు. ఇడా పింగళానాడులు కలసి సంధింపబడి ప్రాణ సంచారము నడచునదే అమావాస్య. ఎందుకనగా ఇడానాడిని చంద్రనాడనియూ, పింగళానాడిని సూర్య నాడి అనియూ పిలుతురు.

సూర్యుడు చంద్రుడు కలియుటయేకదా అమావాస్య. అందుకని ప్రాణము ఇడా పింగళనాడులు రెంటియందూ సంచ రించు సమయమే అమావాస్య. సూర్యచంద్ర సంయోగాత్మకమైన యజ్ఞమే "దర్శ." ఇష్టి (యజ్ఞం). పౌర్ణమినాడు జరుగునదే 'పౌర్ణి మాశేష్ఠి.'

ఇట్లే ప్రాణము ఇడాపింగళ నాడులు రెండిటినీ పొందక పోవుటచే సూర్యచంద్ర నాడులు రెండునూ విడివడి ప్రాణసంచా రము లేక యుండును. అది కేవలకుంభకము. కేవలకుంభకమే "పూర్ణిమ" యనబడుచున్నది. సూర్యుడునూ, చంద్రుడునూ

విడివిడిగా దూరదూరమున నున్నపుడే గదా పౌర్ణమి అగుచున్నది. అందుకని ప్రాణసంచారమువలన జరుగు ఈ యజ్ఞములో కేవల కుంభకమే పౌర్ణమాస ఇష్టి, ఈ విధముగా దర్శ, పౌర్ణమాశేష్టులు అనబడే రెండు యజ్ఞములనూ ప్రాణ సంచారముతో తెలుప వలయును,

## విషువత్ పుణ్యకాలము :

మనకు సంవత్సరములో రాత్రింబవళ్ళు సమానముగా గడుచురోజు విషువత్ పుణ్యకాలమని పిలువబడుచున్నది. ప్రస్తుత కాలములో మార్చి 22వ తేదీన, సెప్టెంబరు–23వ తేదీన విషువత్ పుణ్యదినములు వచ్చుచున్నవి. ఈ రెండు రోజులలోనూ రాత్రియూ పగలునూ సమానముగా నుండును. సూర్యుడు మేష రాశి ప్రవేశించు నపుడు మార్చిలోని విషువత్ దినము సెప్టెంబరు లోని విషువత్ దినము సూర్యుడు తులారాశిని పొందినపుడూ జరుగునని విష్ణుపురాణము "మేషాదౌచ తులాదౌచ మైత్రేయ విషువం స్మృతమ్" అని సంవత్సరములో కలుగు రెండు విషువద్దినములనూ తెలిపినది.

శరీరములో ప్రాణమే సూర్యుడు. ప్రాణసంచారమే సూర్యుని సంచారము. అందుకని ప్రాణవాయువు శరీరములో ప్రవేశించినపుడు మేషాదిన కలుగు విషువత్ అనబడును. ఇదే విధముగా ప్రాణము మూలాధారమున ప్రవేశించినపుడు తులా విషువత్ యేర్పడును. సూర్యగ్రహణ, చంద్రగ్రహణములు గూడా శరీరములో జరుగు సంవత్సర యజ్ఞములోనిట్లే ఏర్పడు

చున్నవి. ప్రాణవాయువు ఇడానాడిలోంచి కుండలినీ స్థానము పొందినపుడు అది "చంద్రగ్రహణ" మని రహస్య యోగపరి భాషలో పిలుతురు. అలాగే ప్రాణము పింగళానాడి నుండి కుండ లినీ స్థానము ప్రవేశించినపుడు అది "సూర్యగ్రహణ" మని యోగులు పిలుతురు. ఈ సంవత్సరాత్మకమైన యజ్ఞమునే "ప్రాణోయజ్ఞేన కల్పతామ్" అను మంత్రముతో యజుర్వేదము తెలిపినది. వివరములతో శుక్ల యజుర్వేద సంబంధమైన దర్శనో పనిషత్తు ఈ విషయమును సప్రమాణముగ తెల్పుచున్నది. సామ వేదమునకు సంబంధించిన పదునెనిమిది ఉపనిషత్తులలో దర్శనో పనిషత్తు ఒకటి. దీనికి గురువు త్రిమూర్త్యాత్మకమైన దత్తాత్రే యుడే. అయనయే శరీరములో జరుగు ఈ సంవత్సర యజ్ఞమును ఇట్లు తెలిపినాడు.

## ఆత్మయే పురుషుడు :

శరీరములోని నాడులు, నాడీదేవతలు, శరీరావయవ సంబం ధమైన అధిష్టాన దేవతలు, ప్రాణసంచార రూపకమగు సంవత్స రమూ, తెలిసిన తరువాత ముఖ్యముగా తెలియవలసినది పరబ్రహ్మ రూపకమగు పురుషుని ఉపాసన.

ఆత్మయే పురుషుడు అను ధ్యానము నాలుగు వేదముల లోను తెలుపబడినది. అది 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్య ముతో ఋగ్వేదం తెలిపినది. దీనినే 'అహం బ్రహ్మాస్మి అను మహావాక్యముతో యజుర్వేదం తెలిపినది. సామవేదము 'తత్త్వ మసి' అను మహావాక్యముతో తెలిపినది. చివరకు అథర్వణ

వేదము 'అయమాత్మా బ్రహ్మ' అను మంత్రముతో నుపదేశించినది, ఇట్లు నాలుగు వేదములూ, పురుషునే బ్రహ్మగా, ఆత్మస్వరూప మునే శరీరములో భావన చేయవలెనని తెలిపినది. నాలుగు వేద ముల సారమేగదా పురుషసూక్తము.

అందుకని పై నాలుగు వేదములలోని మహావాక్యములలో శరీరముతో పరమాత్ముని ఉపాసించు పద్ధతిని భగవంతుడైన దత్తా త్రేయుడు 'కైవల్యోపనిషత్తు' లోని ఈ క్రింది నాలుగు మంత్రాల తోను తెలిపియున్నాడు.

1. ఋగ్వేద మహావాక్యమైన 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను మంత్రము.

'మయ్యేవ సకలంజాతం మయి సర్వం ప్రతిష్ఠితం'
మయిసర్వం లయం యాతి తద్బ్రహ్మ
ద్వయమస్మ్యహం'

"అనగా పరబ్రహ్మ స్వరూపమగు" నేను "అను తత్త్వము నుంచియే సకల ప్రపంచము పుట్టుచున్నది నాయందే సర్వము ప్రతిష్ఠింపబడి యున్నది. నాయందే సకలము ప్రళయము చెందు చున్నది. త్రిమూర్త్యాత్మకమగు నానుంచే సృష్టి, స్థితి, లయములు కలుగు చున్నవి అని అర్థము.

2. యజుర్వేద మహావాక్యమైన "అహంబ్రహ్మాస్మి" అను మంత్రమును ఉపాసించు పద్ధతి ఇట్లు తెలుపబడినది. యజు ర్వేదము యజ్ఞమునకు సంబంధించినది. యజ్ఞపురుషుడే యజు ర్వేధాధిష్ఠాన దేవత యగు సహస్ర శీర్ష పురుషుడు. అందుకని.

"అణోరణీయాం సమమేవ తద్వన్మహానహం
విశ్వ మిదం విచిత్రమ్! ।
పురాతనో హం పురుషోహ మీశో
హిరణ్మయో హం శివరూప మస్మి" ॥

అనగా సహస్రశీర్ష పురుషుడను నేనే. పురాతనుడైన పురుషుడను నేనే. అణువుకన్న చిన్నగానూ, విశ్వముకంటే పెద్దగానూ వ్యాపించు విచిత్రము నేనే. హిరణ్మయ స్వరూపుడను (హకార రకారము బీజాక్షరములుగా కలిగిన శివుడను. హర లేక హరి- విష్ణువు) నేనే.

3. సామవేద మహావాక్యమైన 'తత్త్వమసి' అను మంత్రమును ఉపాసించు విధానమిట్లు తెలుపబడినది.

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే ।
తద్బ్రహ్మ హమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే. ॥

అనగా జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి మొదలగువానియందు ఏ ప్రపంచము కనబడుచున్నదో అది "నేనే" అని తెలిసిన ఎడల సకల బంధములనుండియు విముక్తినొందును. అనగా బంధవిముక్తియే మోక్షమని అర్థము.

4. అథర్వణవేద మహావాక్యమైన "అయమాత్మా బ్రహ్మ" అను మంత్రమును అనుసంధించు విధానము కైవల్యోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది.

"త్రిథామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్ ।
తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోహం సదాశివః" ॥

అనగా త్రివిధ దేహములనెడు (స్థూల, సూక్ష్మ, కారణ) మూడు స్థానములయందును అనుభవింపబడినది, అనుభవించు వాడు, అనుభవము అనునవి యేదియో దానికంటే వేరైన వాడును, సాక్షియును, చిన్మాత్రస్వరూపుడునూ అగు సదాశివుడే నేను. ఈ విధముగా నాల్గు వేదములలోను ప్రతిపాద్యుడైన వేదపురుషుని ఆత్మగానూ, బ్రహ్మగానూ, ప్రజ్ఞానముగాను, యజ్ఞపురుషునిగాను ఉపాసించు విధానము తెలుపబడినది. ఒకే వేదపురుషుని ఉపాసించుటకు నాలుగు వేదములు ఇట్లు తెలుపుటలోని రహస్యము నాలుగు వేదములూ పరమాత్మను గూర్చి నాలుగు రకముల భోగ్యతను ఎందుకు తెలిపెననగా, మన శరీరములో అన్నము నాలుగు విధములుగా పచనము చేయబడుచున్నది. "పచామ్యన్నం చతుర్విధం" ఒకే అన్నము జీర్ణమై నాలుగు విధములుగ మారుచున్నది గదా! అన్నమునుండి ప్రాణము, ప్రాణము నుండి మనస్సూ, మనస్సునుండి విజ్ఞానము కలుగుచున్న దని తెలియజేయుటకే ఋగ్వేదము "ప్రజ్ఞానం బ్రహ్మ" అని ఉపదేశము ప్రారంభించుట. ఒకే విషయమును (వేద పురుషుని) ఋతం (సత్యము)గా ఋక్కుల ద్వారా తెలుపునదే ఋగ్వేదము. దీనినే యజ్ఞమున యజ్ఞపురుషుని స్వరూపములో యజుర్వేదము వివరించినది. సామగానములో ఈ మంత్రాలను గానము చేయునది సామవేదము. దీనికి తిరిగి వ్యవహారిక ప్రపంచములోని సైన్సు ప్రకారము వినియోగపరచు రహస్యమును అథర్వణవేదము తెలుపును. ఈ కారణము చేతనే గదా ఈ నాటి యంత్రములు (విమానములు మొదలైన

సైన్సు) జర్మనీలో అథర్వణవేదముపై జేసిన పరిశోధనలద్వారా లభించుట. ఒకే సత్యమును నాలుగు విధములుగా వినియోగించు చున్నాము.

పురుషసూక్తము నాలుగు వేదములలో కనిపించుట కిదే కారణము. ఇట్లు ఈ విరాట్పురుషోపాసనా విద్య సంగ్రహముగ నీ యధ్యాయమున తెలుపబడినది.

ఈ రహస్యం తెలియాలంటే "పురుషసూక్త రహస్యము" తెలియాలి. యజస్సులు, సామములు, ఛందస్సులూ, ఇవన్నీ గూడా అంటే ఋగ్యజుస్సామథర్వణ వేదములయొక్క సారములు. ఈ నాలుగున్నూ పురుషునియందు ఎట్లా ఉద్భవించినాయో, ఈ పురుషుని ప్రాణస్పందనలో ఎట్లా ఉన్నవో, ఈ పురుషునియొక్క సూక్ష్మరూపముగా మానవుడు ఎలాగ అయివున్నాడో అన్న రహస్యాన్ని గురించి తెలుపుతుంది "పురుషసూక్తము."

ఇందులో అనేక రహస్యాలూ, గహనమైన బహుశాస్త్రములను ఏకీకరణంచేసే మూలసూత్రములూ ఇమిడిఉన్నాయి. కాని అవన్నీ విస్తరించడానికి ప్రస్తుతం ఇక్కడ స్థలము సరిపోదు. ఈ వేదాలయొక్క సారమూ, సర్వబ్రహ్మండము యొక్క సమిష్టి స్వరూపమునూ తెలిపిన కారణముచేతనే పురుషసూక్తము నాలుగు వేదాలసారమని చెప్పబడినది. ఇందులో వున్న ఒక్కొక్క అంశం విడివిడిగా గమనించవచ్చు. సాధన చేయవలసినవారు ఆయా శాస్త్రానికి అన్వయించినట్లయితే ఆ సంబంధమైన రహస్యాలు ఇందులోనే ఇంకా ఎన్నో ఎన్నో అవగతమవుతాయి.



12

# శరీరంలో కాలము

సర్వలోకాలు శరీరంలో ఉన్నాయికదా! ఈ సత్యాన్నే యోగశాస్త్రరీత్యా కూడా శరీరంలో గమనించవచ్చు. యోగశాస్త్రం ఏమిచెపుతుందంటే, మన శరీరంలో ఏడు చక్రాలున్నవని! వెన్నెముక నానుకొని తలనుంచి మూలస్థానం వరకూ ఏడు చక్రాలు శరీరంలోనే ఉన్నాయి. వీటిపేర్లు క్రిందినుంచి ప్రారంభిస్తే 'మూలాధారము', 'స్వాధిష్టానము' 'మణిపూరకము," 'అనాహతము', "విశుద్ధి" 'ఆజ్ఞ', "సహస్రార చక్రమూ". అని–ఏడు చక్రాలున్నాయి. యోగి ప్రాణాయామ ప్రక్రియద్వారా తనలో యోగశక్తిని మేల్కొలిపితే ఆ యోగశక్తి (కుండలినీశక్తి) మూలాధారంలో ప్రారంభించి వెన్నెముకలోవున్న బ్రహ్మనాడిద్వారా ప్రయాణం చేసి, లింగ స్థానమైన స్వాధిష్ఠానాన్ని చేరుకుని, దానికిపైన బొడ్డు స్థానమైన మణిపూరకాన్ని, దానితరువాత హృదయస్థానమైన అనాహతాన్ని, తరువాత కంఠంలోవున్న విశుద్ధిచక్రాన్ని, ఆ తరువాత రెండు కనుబొమ్మల మధ్యనా వుండే ఆజ్ఞా చక్రాన్ని చేరుకుని చివరికి పరమగురుస్థానమైన "సహస్రారాన్ని" చేరుకుంటుంది. ఈ ఏడు చక్రాలు గాయత్రియొక్క ఏడు వ్యాహృతులు! ఈ విషయం ఇంకావిపులంగా 'గాయత్రీ రహస్యార్థం' వివరించే నా గ్రంథంలో వేరే చెప్పాను*

---

* చూ. "గాయత్రీ మంత్రార్థము" USCEFI ప్రచురణ

ప్రస్తుత విషయంలో ఈ ఆరు చక్రాలు – అంటే సహస్రారం మొదలుగా క్రింద ఉన్నటువంటి ఆరుచక్రాలలోనూ ఈ 'కాలస్వరూప' మైన 'రాశిచక్రంగా' ఎలా నిక్షిప్తమై ఉన్నదో వివరిస్తాను.

శ్వాస ప్రారంభంమైనప్పుడు మనం ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీసుకుంటాం. అప్పుడు ప్రాణం మూలాధారము నుంచి భ్రూమధ్యం వరకూ పైకివెళ్ళి, మళ్ళీ శ్వాస వదలినప్పుడు భ్రూమధ్యం నుంచి క్రిందికి మూలధారం వరకూ ప్రయాణం చేస్తుంది! అంటే ఒక్క శ్వాసలో, ప్రాణం క్రిందనుంచి పైకి, పైనుంచి క్రిందకూ ప్రయాణం చేస్తుంది!

అనగా ఒక్కశ్వాస క్రిందనుంచి పైఆరు చక్రములలోనూ పైనుంచి క్రింద ఆరు చక్రములలోనూ కలిపి మొత్తం 12 – చక్రాలున్నా (అనగా 12 రాసులలో) ఈ ప్రాణసంచారము జరుగుతున్నది. మనలోని ప్రాణం ఈ 12 చక్రాలలో ప్రయాణం చేయుటమే, బయట సూర్యుడు 12 రాసులలో సంచారము చేయుట గురించి తెలుపుతున్నది. ఒకటి బయటికాలం బ్రహ్మాండ కాలము)! ఇంకొకటి తనలోని (పిండాండ) కాలము! బయట జరిగే రాశిచక్రములోవున్న కాల ప్రజ్ఞయే, లోపల జరిగే శ్వాస క్రియగా షట్చక్రాలలోనూ తిరుగుతున్నది.

ఇలా మూలాధారంలో ప్రారంభమై సహస్రారంవరకూ, సహస్రారంలో ప్రారంభమై మూలాధారంవరకూ–, ఇటుపైకి ఆరూ, అటు క్రిందికి ఆరూ పన్నెండు రాసులలోనూ, మనలోనే నడుస్తుంది.

---

అయితే ఈ "కాలం" ఒక గడియారం వంటిది! ఈ గడి

యారంలో ముల్లులకు అంకెలను చూపేందుకు ఒక గుండ్రమైన చక్రమున్నది (Dial), ఆ గడియారంవంటి కాలం తెలిపేచక్రమే ఈ "రాశిచక్రం". ఈ రాశిచక్రంలో సూర్యుడూ, చంద్రుడూ – పెద్దముల్లూ చిన్నముల్లూవలే తిరుగుతున్నారు! ఇలా చక్రాకారంగా బైట తిరిగే గమనాన్నే గడియారంలో క్రింద "పెండ్యులం" (Pendulum) అనే డోలకం చూపిస్తూ ఇటూ అటూ తిరుగుతున్నది. – అంటే ఇటూ, అటూ ఒక్కసారి తిరిగి నప్పుడు ఈ కాలంలో 'ఒక ఆవర్తం' అనగా, గుండ్రంగా ఒక చుట్టు తిరిగే దానికి సమానం అన్నమాట! అలాగే బయటరాశి చక్రంలో సూర్యుడూ, చంద్రుడూ ఒకచుట్టు తిరిగిన దానితో ఇది సమానం! లోపలరాశిచక్రంలో ఉచ్ఛ్వాస, నిశ్వాసాల ద్వారా వెన్నెముక నుంచి పైకి, పైనుంచి క్రిందికి తిరుగుటయే ఈ కాల చక్రగతి! ఇది మన శరీరంలోవున్న కాలం!

ఈ రాశిచక్రం ఒక కాగితంమీద గుండ్రముగా వేసి దాన్ని మధ్యకు మడిచినట్లయితే ఇటు ఆరు (చక్రాలు) రాసులూ, అటు ఆరు రాసులూ, మొత్తము (12 – రాసులు వేసిన చక్రం మధ్యకు మడిస్తే ఎలా ఉంటుందో) అలాగే – వెన్నెముకలో ఏర్పాటు చేయబడిఉంది! అందుకే కుడిప్రక్క ఆరు రాసులూ, ఎడమప్రక్క ఆరురాసులు – 12 రాసులూ దీంతోనే ఏర్పడుతున్నాయి. ఈ కుడి ప్రక్క ఆరు రాసులున్నూ ఉత్తరాయణంలో సూర్యుడు పైకి వెళ్ళేగతిని సూచించే రాసులు. అనగా శ్వాస పీల్చేటప్పుడు మూలాధారనుంచి శిరస్సువైపు (ఉత్తరంపైకి) వెళ్ళేటటువంటి కుడివైపున

ఉన్న అరురాసులూ ఉత్తరాయణరాసులు, శ్వాస పైనుంచి క్రిందికి దిగేటటువంటివన్నీ — దక్షిణాయణంలోని ఆరు రాసులు. అందువలన మకరంనుంచి కర్కాటకం వరకూ, కర్కాటకం నుంచి మకరం వరకూను ఈ రెండూ ఉత్తర దక్షిణాయనాలు! మన శరీరంలో కుడిముక్కునుంచి మూలాధారం వరకూ, మూలాధారంనుంచి ఎడమముక్కువరకూ ఇడాపింగళ (చంద్ర, సూర్య) నాడులలో జరిగే శ్వాసక్రియే ఇట్లా ఉత్తర దక్షిణాయనాలని చెప్పబడుచున్నది! (వివరాలకు 9–వ అధ్యాయము చూ. 11)

అందువలన కుడివైపు సూర్యుడి నాడి, ఎడమవైపు చంద్రుడి నాడి వున్నది కాబట్టి — కుడినాడి లేక "సూర్యుడినాడి" ఉత్తరాయణం సూచిస్తుంది. ఎడమనాడి లేక 'చంద్రుడినాడి' దక్షిణాయనం. అలాగే రాశిచక్రంలో సూర్యుడికి సంబంధించినది 'సింహరాశి'! చంద్రుడికి సంబంధించినది' కర్కాటకరాశి! ఇటు మకరంనుంచి కర్కాటకంవరకూ ఉత్తరాయణము. అలాగే సింహం నుంచి మకరంవరకూ ఉన్న రాసులయొక్క విభాగమే దక్షిణాయనం! ఈ రహస్యమే యోగంలో ఈ శరీరంలో కుడివైపు ఎడమవైపు వున్న ఉత్తర దక్షిణాయనాలను చెపుతుంది.

ఇలా దేవతల మార్గం కుడివైపునా, పితృల మార్గం ఎడమవైపునా వుంది! 'దేవమార్గం' అంటే యోగిప్రాణం విడిచిపెట్టేటప్పుడు ఈ ఉత్తరాయణ మార్గంలో గనక విడిచిపెడితే. ఆత్మ తిరిగి మోక్షమార్గంలో పరమాత్మయైన సహస్రారాన్ని చేరుకుంటుంది! అట్లాగే చివరశ్వాస విడిచేటప్పుడు దక్షిణాయన మార్గంలో

విడిచినట్లయితే ఆత్మ పునర్జన్మనిచ్చే పితృదేవతల మార్గములో అంటే చాంద్రమానమైన పునరావృత్తి మార్గాన్ని పొందుతుంది.

ఇదే భగవద్గీత 'శుక్లకృష్ణే గతీహ్యేతే జగతః శాశ్వతే మతే, ఏకయాయాత్యనా వృత్తిం, అన్యయా ఆవర్తతే పునః అన్నది. అంటే శుక్ల, కృష్ణ మార్గములు ఈవిధంగా ఉన్నాయి! "అర్జునా! ఒక మార్గంలో వెళ్ళినట్లయితే తిరిగి రానటువంటి మార్గం మోక్ష మార్గాన్ని పొందుతున్నారు. ఇంకొక మార్గాన్ని పునర్జన్మ పొందే టటువంటి మార్గాన్ని పొందుతున్నారు. అలా ఈ శుక్ల, కృష్ణ గతులు రెండూ ఎవరైతే తెలుసుకుంటారో అతడే యోగి. అతడు ప్రాణముల గతినీ, ఉత్తరాయణ గతినీ అంటే మోక్షముయొక్క రహస్యాన్నీ తెలుసుకొంటాడు" అని గీత తెలుపుతోంది! ఇది బైటి రాశి చక్రానికీ మనలోపలవున్న షట్చక్రాలకూ వున్న సంబంధాన్ని తెలిపే రహస్య సంకేతం.

ఈ దృష్టితో చూచినట్లయితే ఇంకా రహస్యాలు తెలుస్తాయి. క్రిందినుంచి ఆరుచక్రాలు—పైనున్న సహస్రారంతో కలిసి ఏడు చక్రాలూ ఈ శరీరంలో ఉన్నాయి.

ఇవి బయట బ్రహ్మండములోనున్న ఏడు గ్రహాలకూ ప్రతి రూపాలు! బయట ఏడు గ్రహాలు బ్రహ్మండములో ఎటువంటి పనిచేస్తున్నాయో సరిగ్గా శరీరంలోవుండే ఈ ఏడుచక్రాలు కూడా మనకు అదే పనిని చేస్తున్నాయి.

ఆదివారంనుంచి శనివారందాకా వచ్చేవారాలలో గ్రహాలుఒక

క్రమంలో వచ్చాయిగదా ! ఈ ఏడు వారాలగ్రహాల క్రమమున్నూ శిరస్సునుంచి మూలాధారం వరకూ ఉన్నటువంటి ఈ ఏడు గ్రహాల క్రమమూ రెండూ ఒకటే.

ఈ విధంగా క్రిందిపట్టికలలో చూపించినట్టుగా ఏడుచక్రాలు, దానికి సంబంధించిన అధిపతులైన గ్రహాలను చూడవచ్చు.

1, మూలాధారం — శని
2. స్వాధిష్ఠానం — చంద్రుడు
3. మణిపూరకం — బుధుడు
4. అనాహత చక్రం — సూర్యుడు
5. విశుద్ధిచక్రం — శుక్రుడు
6. ఆజ్ఞాచక్రం — గురువు
7. సహస్రార చక్రం — కుజుడు (మేషం)

ఇలాగ సూర్యుడు మొదలు శనిదాకావున్న గ్రహా లన్నిటికీ రూపాలుగా, సహస్రారం మొదలు మూలాధారం వరకూ ఉన్న చక్రాలు పనిచేస్తున్నాయి. రాహుకేతువులకు సంకేతంగా మూలా ధారంలోవున్న కుండలినిశక్తి పనిచేస్తోంది.

ఇక్కడ ఒక చిత్రమైన రహస్యం ఉన్నది. జ్యోతిషంలో గ్రహాలన్నీ రాసుల్లో 'ప్రదక్షిణంగా' తిరుగుతాయి. కాని రాహు కేతువులు మాత్రం 'అప్రదక్షిణంగా'నే తిరుగుతారు. అలాగే ఉచ్ఛ్వాస నిశ్వాసములూ, మన శరీరంతో తీసుకునే ఆహారమూ, అన్నీ కూడా శిరస్సునుంచి పాదాలవైపు 'సవ్యంగా' ప్రయాణం

చేస్తాయి ! కాని, రాహుకేతువులు — అనగా – కుండలినీ మాత్రం– మూలాధారంనుంచి శిరస్సువరకూ అపసవ్యంగా ప్రయాణం చేస్తోంది ! ఇలా బయట ప్రపంచంలో రాహు కేతువులకూ తక్కిన గ్రహాలకన్న విపరీతగతి ఎట్లా ఉందో, మన ఈ కుండలినీ గూడా శరీరంలో అలానే విపరీతగతిని కలిగి వున్నది.

దీనినిబట్టి మనం సూక్ష్మంగా ఆలోచించినట్లయితే సర్వ ప్రపంచంయొక్క సమిష్ఠి స్వరూపమూ, సమస్త దేవతలయొక్క స్వరూపమూ, రాశిచక్రముయొక్క పూర్ణస్వరూపమూ, సర్వనక్షత్రాలయొక్క చక్రస్వరూపము, ఈ బ్రహ్మండం యొక్క స్వరూపమూ, అన్ని ఈ శరీరంలోనే ఉన్నవి. అని తెలుస్తుంది. అంతే కాదు, భాగవతంలో వర్ణింపబడిన పాతాళాది సప్త అధోలోకాలు, భూలోక, భువర్లోక, సువర్లోకాది సప్త ఊర్ధ్వలోకాలు ఇలాగ పదు నాలుగు లోకాలన్నికూడా ఈ శరీరంలో మిళితమై ఉన్నవి అన్నదే నాలుగువేదాల సారం !

మూలధారమునుండి పైవి ఏడు లోకములూ, మూలాధారమునుండి క్రింధివి ఏడు లోకములూ కలిసి పథ్నాలుగు లోకములూ ఈ శరీరంలో ఉన్నవి ఈ శరీరమే విరాట్టుకు విత్తనం. ఈ మొత్తం అంతా కూడా మానవ శరీరంలో మఱ్ఱిచెట్టు అంతా తన విత్తనంలో ఉన్నట్లుగానే ఈ బ్రహ్మండమంతాకూడా ఈ మానవుడి శరీరములో ఉన్నది. ఈ రహస్యమే సర్వవేదాలయొక్క సారమైన "పురుషసూక్తము" మనకి తెలుపుతున్నది.

ఇది తెలిస్తే యోగాభ్యాసానికి పనికివస్తుంది. యజ్ఞ యాగాది క్రియలు చేయటానికి పనికివస్తుంది! మంత్రములు జపించటానికి పనికివస్తుంది. అక్షరములూ బీజాక్షరముల ద్వారా జపం చేయటానికి పనికివస్తుంది !! యంత్రములు నిర్మాణం చేయటానికి పనికివస్తుంది. తపశ్శక్తికి పనికివస్తుంది. విగ్రహారాధన ప్రతిష్ఠలూ వీటన్నిటికి పనికి వస్తుంది.

ఎందువల్లనంటే ఈ ప్రక్రియలన్నిటికీ మొట్టమొదటగా "ఆచమనము" చేసి "ప్రాణాయామము" చేస్తారు గదా! "ఆచమ్య, ప్రాణానాయమ్య" అని ప్రతి వేదమంత్రమూ ఓంకారంతో మొదలు పెట్టాలి. ఈ "ప్రాణాయామం" లేకుండా ఏ మంత్రమూ నడవదు గదా! ఈ ప్రాణాయామమనగా శరీరగతమై మనలోవున్న "ప్రాణాన్ని" బ్రహ్మాండమైన పురుషునిలోని "విశ్వప్రాణంతో" లయంచేసి, జీవేశ్వరులను ఏకంచేసి, సంకల్పించి చేసే అధ్యాత్మిక ప్రక్రియ! ఈ "సంకల్పం" ప్రాణాయామం లేకుండా చేస్తే ఏ మంత్రమూ సిద్ధించదు. యజ్ఞములూ సిద్ధించవు. దేవతాలయములలోని అర్చనలూ సిద్ధించవు. విగ్రహములకు ఇక 'ప్రాణ ప్రతిష్ఠ' అసలే సిద్ధించదు. కనుక అధ్యాత్మికమైన ప్రక్రియలన్నీ గూడా ఈ "ప్రాణాయామము" మీద ఆధారపడివున్న యీ అద్భుత రహస్యముపైనే ఆధారపడి యున్నవి.

"పాదోస్య విశ్వాభూతాని। త్రిపాదస్యామృతందివి"

పురుషుడు ఈ సమస్త ప్రపంచమును తనలోని నాల్గవ భాగముచేతనే సృజించగా తక్కిన మూడుభాగాలూ అమృతస్థితిలో

అట్లే యున్నవని అర్థము. ఇక్కడ "అమృతస్థితి" యనగా మోక్షము (అమృతం మోక్షదేహాస్నే అని నిఘంటువు) త్రిపాదము లనగా చాల అర్థములు గలవు. ఒకటి 'స్వప్న', "సుషుప్తి" 'తురీయము'లను మూడు ప్రజ్ఞలూ ఆత్మయొక్క అవ్యక్తమగు స్థితులు. జాగ్రత్ అను మెలకువస్థితి నాల్గవది. మనము జీవించు 'మెలకువ' అనుస్థితి ఆత్మయొక్క నాలుగు పాదములలో నాల్గవ వంతు మాత్రమే ! మనము నిత్యము నాల్గవవంతులో మెలకువతో జీవించుచుండగా మనలోని ముప్పాతిక భాగము స్వప్నము, సుషుప్తి లేక గాఢనిద్ర, తురీయము లేక బ్రహ్మజ్ఞానము అను మూడు పాదములు – మనజీవితమునకు అతీతమైన అమృత స్థితులుగానే నిలిచిపోయినవి. కంటికి కనబడు మానవునికన్న కనబడని ఆత్మ, సూక్ష్మ, కారణ శరీరములు మూడింతలు. కనిపించు శరీరము నాల్గవభాగమే.

1. మెలకువ (జాగ్రత్) 2. స్వప్న 3. సుషుప్తి నిద్ర 4. తురీయ (సమాధి)

ఇదేవిధముగా పురుషుని కాలస్వరూపము కూడ గలదు. పురుషుడు భూతభవిష్యద్వర్తమానములను మూడుకాలములు కలిపి కాలాత్మకుడయి శాశ్వతకాలమందు నిత్యస్థితిగాను, ఇట్లు నాలుగు పాదములు కలిగియున్నాడు.

ఇక బైట ప్రపంచమున కాలము చక్రముగా కనబడుచున్నది.

దానిని 12 మాసములతో తిరుగు "సంవత్సర చక్రము" లేక 12 రాసులతో పరిభ్రమించు 'రాశి చక్రము' అనిపిలుచు చున్నాము. ఈ 12 మాసములు గల రాశిచక్రమును నాల్గు భాగములుగా చేసిన అందు ఒక్కొక్క "పాదము" 90 భాగాలు గల సమకోణమగును. పురుషుడు (జీవుడు) తల్లి గర్భమున ప్రవేశించినది మొదలు 9 మాసములు అనగా $(9 \times 30 = 270)$ 270 రోజులు అనగా త్రిపాదములుగా కాలచక్రమునగల కాలమును అనుభవించుచున్నాడు. ఇది నాల్గు సమకోణములు గల సంవత్సర చక్రములో 3 సమకోణములగును. $(3 \times 90 = 270)$ అనగా మూడు పాదములు అగును. కాబట్టి రాశిచక్రములోని ముప్పాతిక భాగము (270 దినములు) అవ్యక్తస్థితిలోనూ, జీవునికి తెలియని అజ్ఞాతస్థితితో గడుచును. మిగతా జీవితమంతయు (9 మాసముల తరువాత జన్మించిన) మిగిలిన నాల్గవభాగము (పాదము). ఇట్లు మనిషియగు పురుషుడు కూడా మూడుపాదములూ తల్లి గర్భమున అమృతస్థితిలోనూ, ఒక పాదము జన్మించిన తరువాత జీవించు చున్నాడు. (పాదము = 90)

1 గర్భధారణ నెల మొదలుగా 9 మాసములు పిండముగా నుండు దినములు $9 \times 30 = 270$ రోజులు. జన్మించు 10వ నెల మొదలు జీవితాయుష్షు 90 సం॥లు.

మంత్రము :— "అత్యతిష్ఠత్ దశాంగుళం"

## వివరణ :

సర్వసృష్టి యంతయూ నిండి తానై వ్యాపించిన 'విరాట్

పురుషుడు' పది అంగుళములతో ఈ సమస్త సృష్టిని అతిక్రమించి యున్నాడని చెప్పుచున్నదీ మంత్రము. "పది అంగుళము" లనగా నేమి? దీనిలో ఎంతో నిగూఢమైన అర్థము సూత్రప్రాయముగా పై మంత్రములో ఇమిడి యున్నది.

ఇది యేమిటో గమనిద్దాము. ఒకటి – పురుషుడే జీవుడుగా ఈ శరీరమునందు ప్రవేశించియున్నాడు అని పై మంత్రములో తెలుసుకున్నాము. శరీరములోనున్న పురుషుడు తనకున్న ఆధిక్యతను. లేక ఆధిపత్యమును (మహిమను) పది అంగుళముల న్యాయములో తెలిపియున్నాడు. ఇక్కడ అంగుళములు" అంటే "వ్రేళ్ళు" అని అర్థము. మనిషికి వ్రేళ్ళు 'పది'. ఇది ఒక నిగూఢమైన 'సంఖ్యాశాస్త్ర' రహస్యమును తెలుపునది. లెక్కలలో వున్న మొత్తము అంకెలుకూడా (10) పదియే, ఎందుకనగా 1,2,3,4,5,6,7,8,9 తరువాత '0' (సున్నా) ఇవి అన్నీ కలిపి పది అంకెలగు చున్నాయి. పై పది అంకెలతోనూ అపరిమితమైన సంఖ్యలను ఎన్నో లెక్కలకు పైన లెక్కలు, కోట్లకుపైన కోట్లు సహితము మనము లెక్కించ గలుగుతున్నాము గదా! ఇది మహాశ్చర్యము! అపరిమితమగు సంఖ్యలన్నింటిని పరిమితమగు ఈ 'పది' అంకెలతో అధిగమించి దశాంగుళన్యాయము చేతనే ఈ జీవ రూపములోనున్న "పురుషుడు" తన అధిక్యతను ఈ విధముగా వెల్లడిచేయుచున్నాడు. ఇట్లు తన పదివేళ్ళ చేతనే అనంత సంఖ్యలను అధిగమించి (అత్యతిష్ఠత్) పురుషుడు దశాంగుళ న్యాయమును వెల్లడి చేసినాడు!

22)

ఇంతేగాదు, గర్భస్తుడగు జీవుడు గూడ 'పది' (10) మాస ములే తల్లి గర్భములో పెరిగి పదియవ మాసములోనే పరిపూర్ణ వ్యక్తిగా జన్మించుచున్నాడు. ఇట్లు 'దశ' అను సంఖ్య పరమాత్మ స్వరూపుడగు జీవుని పది అవతారములలా గర్భములో నడుచు చున్నవని కూడా తెలుపును.

ఇట్టివే జగత్తులోని పది దశలూ బ్రహ్మాండ పురుషునివి కూడా లెక్కించబడుచున్నవి. జగత్తుయొక్క పరిణామములోని దశలు పది. తొమ్మిది దశలు దాటి పూర్తి పరిణామమును పొంది 'పదియవ' "అవతారమగు" "కల్క్యావతారము" ఇప్పుడు రాను న్నది కదా ! అట్లే జీవుడునూ పిండముగా కడుపులోని పదిమాస ముల వంటివే ఈ బ్రహ్మాండ పురుషుని దశావతారములలా ! ఇట్లు "దశాంగుళము"ల వలన (పది అను సంఖ్యయొక్క ఆధిక్యతవలన) ఈ విశాల విశ్వమునకు సర్వత్రా అధిష్ఠించి యున్నాడు. గనుక "అత్యతిష్టద్దశాంగుళమ్" అని మంత్రము చెప్పుచున్నది.

ఈ "సంఖ్యాత్మకుడ"గు భగవంతుని సంపూర్ణ రూపమే పది (10) అను అంకె. అందువలననే మానవశరీరములో కూడా "నవద్వారములు" శిరస్సు పైనుండు బ్రహ్మరంధ్రములతో పాటు కలసి మొత్తము పది (10) ద్వారములు ఏర్పడుచున్నవి. (దశీ వస్ ద్వార్, అని శిక్కుల మతగ్రంథములో చెప్పబడియున్నది.) జీవునికి కర్మేంద్రియములైదు (5), జ్ఞానేంద్రియములైదు (5) కలిపి మొత్తము దశేంద్రియములు (10) కలవాడై రహస్య పరి భాషలో దశరథుడని "పిలువబడు" చున్నాడు, ఇలా "రామాయణ రహస్యము"లో జీవుడే దశరథుడని చెప్పబడినది.



అలవాటుపడుతుంది. ఇది కాలనియమం ! కాబట్టి ఈ అభ్యాసము ద్వారా కూడా కొంత సహాయం ఉంటుంది. శరీరంతో చేసే క్రమశిక్షణాభ్యాసాన్ని "యమం" అంటారు. ఈ శరీర శిక్షణకు ఆసనాలు ఎంతో ఉపయోగ పడతాయి. ఆసనాలు 84 ఉన్నాయి. అందులో ముఖ్యమైనవి 18. వానిలో తప్పక ఆచరించదగినవి 9. ఈ తొమ్మిది ఆసనాలలో హలాసనం, పశ్చిమోత్తాసనం, పవన్ముక్తాసనం ముఖ్యమైనవి. వీటివల్ల నడుము, చట్టకి, నరాలవల్ల దోషాలు, కడుపులో ప్రేవులలోని దోషాలు పోవడం, శరీరంలోని వాతదోషం పోవడం, వెన్నెముకలోని దోషాలు పోవడం జరుగుతుంది. ధర్మాన్ని సాధించడానికి శరీర నియమం అవసరము. అది ఆసనాల వల్లనే వీలవుతుంది అంతవరకూ ఆసనాలు వెయ్యాలి !

## వజ్రాసనం :

మోకాళ్ళమీద కూర్చుని పాదములు వెనుకకు చాచి మడమలపై నిటారుగా కూర్చొని రెండుచేతులనూ మోకాళ్ళకు పైగా ఉంచాలి. ఆ స్థితిలో మూడుసార్లు ప్రాణాయామము చెయ్యాలి ! ఆ స్థితిలో ఉండగనే రెండుచేతులనూ వెనుకకు పట్టుకొని తలను ముందుకు వంచి నుదుటిని నేలకు ఆనించాలి. ఇది రెండవదశ. మొదటి స్థితిలోనికి వచ్చి రెండు మోచేతుల ఆధారముగా వెనుకకు వాలి, తలను వెనుకకు వంచి రెండు చేతులతో మడమలను పట్టుకోవాలి ఇది మూడవదశ. అలా మూడుసార్లు చెయ్యాలి.

## పవన్ముక్తాసనము :

వెల్లకిల్లా పరుండి కుడికాలును 30 డిగ్రీలలో చాచి బొటన వ్రేలును మూడుసార్లు. ముందుకు వెనుకకు వంచుట, పాదమును కుడి ఎడమలకు త్రిప్పుట, తరువాత గుండ్రముగా త్రిప్పుట చేయాలి, అలాగే ఎడమ కాలితోనూ, ఆ తరువాత అలా రెండు కాళ్ళతోను చేయాలి.

## పశ్చిమోత్తానసనము :

కూర్చొని రెండు కాళ్ళనూ చాచి, రెండు చేతులతో రెండు కాళ్ళ బొటన వ్రేళ్ళను పట్టుకొని, నుదుటిని మోకాళ్ళ మీద అన్చుట.

## పద్మాసనము :

కుడిపాదమును ఎడమ తొడపై, ఎడమపాదమును కుడితొడ పైన ఉంచి కూర్చుండుటను పద్మాసనమందురు. ముందు ఎడమ పాదమును కుడితొడపై పెట్టుట. పిదప కుడిపాదమును ఎడమ తొడపై పెట్టుటను "అపసవ్య – పద్మాసనం" అంటారు.

## ప్రాణాయామము :

ప్రాణాయామము రెండు విధములుగా ఉంటుంది. సుఖ ప్రాణాయామము, భస్త్రిక ప్రాణాయామము. సుఖప్రాణాయా మమువల్ల శరీరములోని నాడులలోని దోషాలు పోతాయి. కళ్ళు

మూసుకొని మనస్సుతో కలిసి "ఓం" అంటూ చేయాలి. దీనికి ముందు భస్త్రిక ప్రాణాయామము చేయాలి. భస్త్రిక యనగా కొలిమి తిత్తి ! కొలిమి తిత్తిలాగా కుడి శ్వాసరంధ్రం ద్వారా శ్వాసను పీల్చి మరల దానినుండే వదలాలి. అలా అరుసార్లు చేయాలి. తరువాత రెండింటితోను శ్వాస పీలుస్తూ విడుస్తూ క్రమేపి తీవ్రంగా, వేగంగా చేయాలి, ఇలా చెయ్యడంవల్ల శరీరంలో వేడి తయారయి యోగాగ్నిని రగులుస్తుంది. ఇది శరీరంలోని నాడులలోగల మాలిన్యాన్ని పోగొడుతుంది. మనస్సులో గల మాలిన్యంకూడా పోతుంది. దీని వలన ఊపిరితిత్తుల నిండుగా గాలి పీల్చటం జరిగి శరీరం ఆరోగ్యవంతమవుతుంది. పూర్ణాయుర్దాయం కలుగుతుంది. శీతాకాలంలో భస్త్రిక ప్రాణాయామం కుడిముక్కురంధ్రంద్వారా చేస్తే శరీరం వేడెక్కుతుంది. ఈ విధంగా నార్మల్ టెంపరేచర్ మైన్‌టైన్ అవుతుంది. హిమాలయాలలో యోగులు ఈ విధంగా తమ శరీరాన్ని సామాన్య ఉష్ణోగ్రతలో ఉంచగలుగుతారు వేసవిలో ఎడమ ముక్కు రంధ్రముగుండా భస్త్రిక ప్రాణాయామం చేయడంవల్ల శరీరం చల్లబడుతుంది.

మనకు సంతోషము, కోపము నాడులవల్ల కలుగుతాయి. నాడులను కంట్రోలు చేసినచో అన్నింటిని కంట్రోలు చెయ్యగలము. ఈ నాడులు శ్వాసపై ఆధారపడి ఉన్నాయి. కుడి ముక్కులో ఉండేది "సూర్యనాడి" లేక "పింగళనాడి". దానినే ఉత్తరాయణం" అనికూడా అంటారు. ఈ 'ఉత్తరాయణం'లో అంటే కుడిముక్కు ద్వారా శ్వాస పీలుస్తూ మరణిస్తే మోక్షం పొందుతాడు. మనిషి కొంతసమయం కుడిముక్కు ద్వారాను

గాలి పీలుస్తాడు. ఎడమ ముక్కులో ఉండే నాడిపేరు చంద్రనాడి లేక ఇడానాడి. దీనినే "దక్షిణాయనం" అంటారు. ఈ దక్షిణా యనంలో శ్వాసపీలుస్తూ మరణిస్తే తిరిగి జన్మ వస్తుంది.

## బ్రహ్మదండము :

బ్రహ్మదండమనే వెన్నెముకకి, కుడి ఎడమ ముక్కుల నుండి నాడులు బయలుదేరి వెన్నెముక క్రింద చివర భాగమున కలుస్తాయి. ఇవి నుదుటవద్ద కలిసి కనుబొమ్మలవైపు వెళతాయి నుదుట దగ్గరనున్నది అజ్ఞాచక్రము, వెన్నెముక క్రిందనున్నది మూలాధారము. ఈ రెండింటినీ కలిపేనాడి "బ్రహ్మనాడి." మన శరీరంలో 72,000 నాడులున్నాయి. లక్షల ఉపనాడులున్నాయి. సామాన్యంగా నాడులంటే నరాలు అనుకుంటారు కాదు. నాడులు వేరు, నాడులు కంటికి కనిపించవు. నాడులు సూక్ష్మ శరీరంలో కూడా ఉంటాయి. ఈ స్థూల శరీరంలో ఇంకొక సూక్ష్మశరీరం ఉంటుంది. ఈ రెండూ బొడ్డుద్వారా కలుపబడతాయి. సూక్ష్మ శరీరంలో కూడా ఇంద్రియాలుంటాయి. స్థూల సూక్ష్మశరీరాలు కాక ఇంకా మూడు శరీరాలున్నాయి. మన శరీరానికి అంటిపెట్టు కునే స్వార్థం వల్ల సూక్ష్మశరీరం విడివడి బయటకు రాదు. భయం వలన కూడా బయటికి రాదు. మనలో ఐదు శరీరాలున్నవని యోగశాస్త్రం తెలుపుతోంది. అవియేవంటే :—

## 1. స్థూలశరీరం :

కంటికి కనిపించే శరీరమే స్థూలశరీరం, ఇది అన్నమయము. అంటే అన్నంతో నిర్మాణం అయిన శరీరం !

## 2. సూక్ష్మ శరీరం :

ఇదే ప్రాణమయ శరీరం. ప్రాణాయామం వలన దీనికి బలం వస్తుంది. అప్పుడది శరీరాన్ని బ్రతికిస్తుంది. ఈ 'స్థూల' "సూక్ష్మ" శరీరాలకు రెంటికీ, బొడ్డువద్దగల సంబంధం లేకపోతే మనిషి మరణిస్తాడు. అక్కడ త్రాడువంటి సూత్రం ఈ రెండిటిని కలిపి వుంచుతుంది ! ఇదే – సూత్రాత్మ !

## 3. మనోమయ శరీరం :

ఇది ఆలోచనవల్ల కలుగుతుంది. మనస్సులోని పదార్థంతో తయారవుతుంది. మన "ఆకారము" కూడా మన ఆలోచనల వల్లనే తయారవుతుంది. ఈ మనోమయ శరీరం పోతేగాని జన్మ రాహిత్యం పొందలేము. ఇదే "కారణశరీరం," మన ప్రస్తుత జన్మలకు, శరీరానికి ఇదే 'కారణము' గనుక కారణ శరీరం అంటారు.

## 4. విజ్ఞానమయ శరీరం :

జ్ఞానాన్ని గురించి తెలిపే జ్ఞానం విజ్ఞానం ! ఈ విజ్ఞానం ఇందులో ఉంటుంది. ఈ శరీరంవల్ల 'సంకల్ప సిద్ధి' కలుగుతుంది.

## 5. ఆనందమయ శరీరం :

దీనినే "పరబ్రహ్మ–శరీరం" అంటారు. బ్రహ్మజ్ఞానం

దీనివలన కలుగుతుంది. ఇది మనకు "యమ–నచికేతసంవాదము వల్ల తెలిసింది. ఈ ఆనందమయ శరీరం తరువాత జీవాత్మ, పర మాత్మ ఉంటాయి. ఈవిధంగా మొత్తం 7 ఉన్నాయి కాబట్టి 7 శరీ రాల నిర్మాణాన్ని అనుసరించే గుడి గోపురానికి ఏడు (7) అంతస్థులు పెట్టారు ! వెన్నెముకకు చివర కుండలినీశక్తి ఉన్నది. ఈ ఐదు శరీరాలను బట్టి శివుడికి 5 అక్షరాల నామం (పంచాక్షరి) ఉన్నది. అంటే శరీరములో ఉండేభగవత్ తత్వాన్ని "శివుడు" అంటారు. కాబట్టి ఈశ్వరుడు పంచేంద్రియములకు అధిపతి, జీవుడే–శివుడు ! ఇవిగాక పది (దశ) ఇంద్రియాలున్నాయి !

అవి 5 కర్మేంద్రియాలు – 5 జ్ఞానేంద్రియాలు.

## కర్మేంద్రియాలు :

1) కాళ్ళు – నడవగలశక్తి

2) చేతులు – పనిచేయుశక్తి

3) నోరు – వాక్కు

4) ఆసనం – విసర్జన

5) లింగం – మూత్రవిసర్జన

ఈ ఐదు (5) కర్మేంద్రియాలు. ఇవి శరీరాన్ని బ్రతికి ఉండేటట్లు చేస్తాయి.

## పంచ జ్ఞానేంద్రియాలు :

1) కన్ను – దృష్టి
2) ముక్కు – ఘ్రాణము
3) నోరు – వాక్కు
4) చెవి – శ్రవణం.
5) చర్మము – స్పర్శ

ఈ జ్ఞానేంద్రియాలు బయట ప్రపంచాన్ని గురించి సమాచారం మన మనస్సునకందచేస్తాయి. ఈ జ్ఞానేంద్రియాలు ఐదు శరీరములకు 5 – చొప్పున మొత్తం $5 \times 5 = 25$ తత్వములుగా ఉన్నాయి. వీటినే పంచవింశతి (25) తత్వాలు శరీరంలో గలవు అని అంటారు.

మొదట "అన్నం" వలన స్థూల శరీరం బ్రతికి ఉంది కావున మనయోగులు అన్నం పరబ్రహ్మ స్వరూపం అన్నారు. తరువాత జీవులకు "ప్రాణం" అన్నం ద్వారా కలుగుతున్నది కావున సూక్ష్మశరీరంకూడా పరబ్రహ్మం అన్నారు.తరువాత మనస్సు ఇంద్రియాలను నడుపుతుంది కాబట్టి దానినీ పరబ్రహ్మమని, ఆ తరువాత విజ్ఞానం బ్రహ్మమనీ, చివరకు ఆనందమే (ఆత్మయే) పరబ్రహ్మ మనీ అన్నారు !

ఆలయనిర్మాణం ఈ పంచశరీరాలను గురించే చెప్తున్నది. అనగా గోపురానికి 5 అంతస్థులు తరువాత కలశాలు (ఆత్మ) ఉంటాయి. 6,7లలో జగదాత్మ ఉంటుంది. తిరుపతిలో 7 కొండలున్నాయి. ఎందుకంటే యోగసాధన అంతస్థులు 7 కాబట్టి, కుండలినీ శక్తి సర్పాకారం కావున తిరుపతి కొండలు సర్పాకారంగా ఉంటాయి.

14

# మనశ్శరీరము - ఇంద్రియాలు

స్థూలశరీరమునకు ఆధారము పంచభూతములు. అవి యేవంటే :—

**1. భూతత్వము :**

శరీరములోని ఎముకలు, మాంసము మొదలగు ఘనపదార్థములన్నీ ఈ తత్వమునకు సంబంధించినవి !

**2. జలతత్వము :**

శరీరములోని రక్తము, లాలాజలము, మూత్రము మొదలగు ద్రవపదార్థములన్నీ ఈ తత్వమునకు సంబంధించినవి.

**3. వాయుతత్వము :**

శరీరములోని ప్రాణవాయువు, అపానవాయువూ మొదలగు పంచవాయువులూ ఈ తత్వమునకు సంబంధించినవి.

**4. అగ్నితత్వము :**

శరీరములోని "వేడి," జఠరాగ్ని మొదలగునవి ఈతత్వమునకు సంబంధించినవి. ఈ తత్వమునకు రెండవ లక్షణము దీప్తి

(Brightness). ఈ జఠరాగ్ని కాల్చే లక్షణము (Burning Nature) కలిగి ఆహారమును దగ్ధము చేస్తుంది.

## 5. ఆకాశతత్వము :

మనస్సు ఈ ఆకాశతత్వమునకు సంబంధించినది. దీనికి రెండు లక్షణములు గలవు, 1. వ్యాప్తి (Expansion) 2. సంగము (Contract)

ఎ) ఈ వ్యాప్తిలో మళ్ళీ రెండు రకములు గలవు. 1) ధనాత్మక వ్యాప్తి (ఎక్స్‌పేన్షన్) 2. ఋణాత్మకవ్యాప్తి (కన్‌ట్రాక్షన్.)

## 1) ఎక్స్‌పేన్షన్ :

మనస్సు ఎంత కావాలంటే అంత వ్యాపించగలదు. అంటే బ్రహ్మాండము గురించి ఆలోచించినపుడు బ్రహ్మాండమంత అవగలదు.

## 2) కాన్‌ట్రాక్షన్ :

మనస్సు ఎంత చిన్నది కావాలంటే అంత చిన్నది అవగలదు. అణువు గురించి ఆలోచించినపుడు అణువంత కాగలదు.

ఈ వ్యాప్తివలననే అండముగా మొదలైన మానవుడు పూర్తి మనిషిగా పెరిగి తయారు అవగలుగుతున్నాడు. ఈ వ్యాప్తికి మూడు లక్షణములు గలవు 1. వృద్ధి (Increase) వృద్ధి అంటే

మనస్సు 'సున్నా' నుండి "అనంతము" (Infinity) వరకు వృద్ధి అవగలదు, 2. బృంహణము : అంటే ఈ వ్యాప్తికి ప్రవేశించి "నింపు" – లక్షణము గలదు, 3. క్షయం : (Destructive). క్షయం అంటే మనస్సు అనంతము నుండి సున్నా వరకూ క్షయం అవగలదు. క్షయమునకు 'సంకర్షణ' లేక 'రుద్రశక్తి' అనిపేరు.

ఈ మనస్సుకు దేనిలోకైనా ప్రవేశించు (Enters into) గుణము గలదు. ఈ క్వాలిటీ యే విష్ణుతత్వము (విశ్ + ణు = విశతీతి విష్ణుః) అని సంస్కృతములో అన్నారు.

2. మనస్సుయొక్క రెండవ లక్షణము సంగము. మనస్సు దేనితో సంగం పెట్టుకుంటే దాని లక్షణము పొందుతుంది. నీళ్ళతో పంచదార కలిపితే తీపి లక్షణము నీళ్ళకు వస్తుంది. ఉప్పు కలిపితే నీళ్ళు ఉప్పగా అవుతాయి. అంటే నీరు తను వేరుగా మారకుండా ఉప్పు, పంచదార లక్షణములు పొందుతున్నది ! మన మనసుకు కలుగు సుఖదుఃఖములకు ఈ లక్షణమే కారణము. ఈ లక్షణములో ద్వంద్వము (Duality) గలదు.

## 1. సంయోగము (Attraction) :-

మన కిష్టమైన వాటికి దగ్గర అవ్వాలని వాటితో ఎటాచ్ (Attach) అవుతూ వాటితో జట్టాపట్టాలేసుకుని, అదే జీవితము అనుకొనుట దీనివల్లనే జరుగుతుంది.

## వియోగము :

మనకు ఇష్టముకాని వాటికి "దూరము" అవుతూ వాటిని వదిలేయుట (Detach) దీనివల్ల జరుగుతుంది.

ఈ ద్వంద్వము ఎందువలన వస్తుందంటే మనస్సు ఒక అయస్కాంతము లాంటిది. ఈ అయస్కాంతము యొక్క ధన (పాజిటివ్), ఋణ (నెగిటివ్) ధృవముల (Poles) వలన ఈ సుఖ దుఃఖములు కలుగుచున్నాయి.

**మ న స్సు :**

మనస్సు సుఖదుఃఖములకు చలించని స్థితిని పొందవలెను. దీనినే బ్రాహ్మీస్థితి అంటారు. యోగులయొక్క మానసికస్థితి నిర్మలమై ఆకాశము విధముగా ఉండును. అంటే మనస్సు బ్రాహ్మీ ముహూర్తమున ఆకాశమువలె సుఖదుఃఖములకు అతీతమై నిశ్చలస్థితిలో ఉంటుంది. ఇష్టములను (పాజిటివ్), అయిష్టము (నెగిటివ్) లను కలపగలిగితే మనస్సు ద్వంద్వాతీతమవుతుంది.

పైన చెప్పిన రెండూ ఈ పంచభూతములలోనే బ్రహ్మాండము (యూనివర్స్) పిండాండము (శరీరము) రెండూ తయారవుతాయి. ఈ పిండాండము, బ్రహ్మాండము రెండునూ అండాకారము (Egg shape) లో ఉంటాయి. బయట ప్రపంచములోని పంచ భూతములకు శరీరములోని పంచభూతములకూ గల సారూప్యము క్రింద పట్టికలో చూపబడినది.

| పంచభూతములు | విశ్వము<br>(బ్రహ్మాండము) | శరీరము<br>(పిండాండము) |
|---|---|---|
| 1. భూతత్వము | పర్వతములు | ఎముకలు, మాంసము |
| 2. జలతత్వము | నదులు,<br>సెలయేళ్ళు | రక్తనాళములూ,<br>లాలాజలము |
| 3. అగ్నితత్వము | తేజస్సు<br>(సూర్యునిది) | జఠరాగ్ని, వేడి,<br>కంటిలోని తేజస్సు. |
| 4. వాయుతత్వము | గాలి | శ్వాసములోని ప్రాణ<br>వాయువు, పొట్టలో<br>వాయువులు. |
| 5. ఆకాశతత్వము | ఆకాశము<br>శబ్దము | మనస్సు<br>శబ్దము : (నోటినుండి<br>వచ్చినది. చెవిద్వారా<br>వినేది.) |



15

# శరీరము - దేవాలయము

శ్లో॥ దేహం దేవాలయం ప్రోక్తం శివోజీవస్సనాతనః

శరీరము ధాతువులతో తయారైంది. అట్లే దేవాలయమున ప్రాకారములు గలవు. అట్లే బయట ప్రపంచంలో సూర్యుని చుట్టూ గ్రహాలు ఉన్నాము.

అలాగే కంటికి కనిపించే కాంతిలో రంగులు ఉన్నాయి. అలాగే కాలములో 7 రోజులు. దేవాలయంయొక్క 7 ప్రాకారములలాగా శరీరంలో చర్మము, మాంసం, రక్తం, ఎముకలు, క్రొవ్వు మొదలైనవి 7 పొరలుకలవు. దేవాలయములో మొదటిది ముఖమండపము – శరీరములో ముఖము. గర్భాలయము – శరీరములోని గర్భాశయం, ఆలోపల అంతరాళము – మనహృదయాంతరాళము (అక్కడ చీకటిగా ఉండును.), గర్భాలయంలోని దీపారాధనము – మనలోని జ్యోతి, శరీరంలోని వెన్నెముక (బ్రహ్మదండం) – దేవాలయంలోని ధ్వజస్తంభము. హృదయములోని స్పందన – దేవాలయంలోని గంటారావము. దేవాలయంలోని బలిపీఠం – శరీరంలోని జఠరాగ్ని, శరీరంలోని జీవుడు – గర్భగుడిలోని శివుడు.

## పంచోపచారములు :

| పంచభూతములు | పంచోపచారములు |
|---|---|
| 1. భూతత్వము | చందనము |
| 2. జలతత్వము | తీర్థము, అర్ఘ్య పాద్యాదులు |
| 3. వాయువు | ధూపం |
| 4. అగ్ని | దీపం |
| 5. ఆకాశతత్వము | పుష్పము (మనస్సు) |

ఈ పంచోపచారముల తరువాత అమృతత్వము గల ఆత్మ సమర్పణ సూచనగా నైవేద్యమును సమర్పించవలెను. ఆత్మను సమర్పించుట సాష్టాంగముద్వారా సూచించును. అష్టాంగములు : 1) కణతలు 2) శిరస్సు 3) హృదయము 4) మోకాళ్ళు 5) ఉదరము 6) పాదములు 7) మోచేతులు 8) చేతులు దేహములో బ్రహ్మస్థానము మూలాధారము. ఈ మూడు గ్రంధులను కలిపి గ్రంధిత్రయము అందురు. ఈమూడు గ్రంధులు 3 గుణాలకు ప్రతీకలు :

## శివుడు - జీవుడు

| | |
|---|---|
| 1) త్రినేత్రములు | కుడి ఎడమ జ్ఞాననేత్రాలు, సూర్య చంద్ర, సుషుమ్న (అగ్ని) నాడులు. |
| 2) త్రిశూలం | సత్త్వ రజస్తమో గుణములు |

3) అర్థనారీశ్వరత్వము — సూర్య చంద్ర నాడులు.
4) శివుడు చర్మం ధరించుట — జీవుడు చర్మములో కప్పబడుట
5) సర్ప యజ్ఞోపవీతం — నాడులు (ఇడ, పింగళ, సుషుమ్న)
6) "ఓం నమశ్శివాయ" పంచాక్షరం. — పంచభూతములు, ఆత్మ.

కాచచక్రంలో 360 డిగ్రీలు గలవు. అవే శరీరంలో 360 ఎముకలు. చంద్ర సూర్యనాడులే పగలు, రాత్రులు! సూర్యుడు కాలచక్రంలో సగం భాగం దక్షిణాయణము. సగభాగం ఉత్తరాయణములోనూ ప్రయాణ దిశ మార్చినట్లుగా శ్వాస కుడి ఎడమలకు మారును. అందువలన శ్వాసయే కాలము. (బ్రీతింగ్ = టైమ్.)

సంవత్సరమును సూర్యునితోను, మాసమును చంద్రునితోను, రోజును భూమితోను కొలిచెదము. విష్ణు సహస్రనామంలో "ఋతుస్సుదర్శనః కాలః" అని చెప్పబడినది. ఇదే అంటే సుదర్శన చక్రమే కాలచక్రము. దీనికి ఆరు అంచులు ఉండును.

$6 \times 1 = 6$ ఋతువులు (6 అంచులు)
$6 \times 2 = 12$ మాసములు, రాశులు
$6 \times 3 = 18$ (180 రోజులు సంవత్సరములో సగం)
$6 \times 4 = 24$ గంటలు, 12 పౌర్ణములు, 12 ఆమావాస్యలు
$6 \times 5 = 30$ రోజులు మాసంలో.
$6 \times 6 = 36 \times 10 = 360$ రోజులు సంవత్సరంలో
(దశాంశము)

16

# పూజా విధానం



**పూజకు కావలసినవి 7 అంగవులు అవి యేవనగా :**

మంత్రం, మూర్తి, న్యాసం, ధ్యానం, అర్చన, నీరాజనం ఇది లఘుపూజా విధానంలో !

## 1. మూర్తి :

పటంకన్నా విగ్రహాన్ని (మూర్తిని) అర్చించటానికి నిష్ట ఎక్కువ వుండాలి. ఎందుకంటే పటంకన్నా విగ్రహాన్ని అర్చించడంవల్ల శక్తి ఎక్కువ వస్తుంది. ఫలితం కూడా ఎక్కువవుంటుంది.

## 2. న్యాసం :

మంత్రాక్షరములను శరీరంలో ఒక్కొక్క భాగమున స్థాపించుట.

## 3. ధ్యానం :

ఎవరిని ధ్యానిస్తున్నామో ఆమూర్తిని మనస్సులో నిలపాలి. అపుడు ధ్యానములో ఆరాధించే దేవత మనలో ప్రవేశించుట జరుగుతుంది ! అందుచే ఒక విధమైన మత్తు, ఆనందం కల్గుతుంది.

పూజ అనేది రెండు విధాలు — కామ్యంతో చేసేది. నిష్కామంతో చేసేది. మనం పూజచేయుటమేగాని ఏదో ఒకటి కావాలి అని భగవంతుడ్ని కోరరాదు. కోరితే మనం ఏది కావాలంటామో అదే లభ్యమవుతుంది. అదే గనుక మనం ఏదీ కోరకుండావుంటే మనకేది అవసరమో అది భగవంతుడే ప్రసాదిస్తాడు

## 4. ఆచమనపాత్ర

రాగిగాని, పంచలోహలదిగాని అయివుండాలి. ఉద్ధరిణ అనగా నీరు పైకి తీసేది. హరివేణం (పళ్ళెము) తీసిననీరు వదలుటకు.

## 5. పుష్పములు :

ఎక్కువ ఫలితానిచ్చేవి మాత్రమే పూజకుపయోగించాలి. అవి – తెల్లజిల్లేడు సూర్యుని, గణపతిని పూజించటానికి ఎక్కువ మంచిది. కృష్ణతులసి అందరికి మంచిది. ఎర్రగన్నేరు, జాజులు అన్ని పూజలకు కూడా మంచివి.

## 6. ధూపం :

అగరవత్తులు, దశాంగం, సాంబ్రాణి, చందనం పొట్టు, అగరవత్తుల్లో చందన వత్తులు మంచివి. ఘాటు సువాసనలున్న అగరవత్తులు పనికిరావు.

7. కర్పూరం :

ముద్దకర్పూరం మంచిది. దీనివల్ల వాతావరణంలోనిదోషం హరిస్తుంది, ఆ ప్రదేశం పవిత్రంగా వుంటుంది. కనీసం పర్వదినాలలో నైనా ఆవిధంగా చేయాలి.

8. ప్రదేశం :

రోజుకో ప్రదేశం మార్చరాదు. ఇంట్లో ఉత్తరానగాని, ఈశాన్య దిశనగాని, తూర్పునగాని ఎత్తయిన పీఠంమీద పటం పెట్టాలి, మనం నేలమీద కూర్చోరాదు. ఎందుకంటే మనకివచ్చే దైవశక్తి భూమిలోకి పోతుంది. జింకచర్మంగాని, పీటగాని వేసుకోవాలి. పీట ఇరుకుగా వుండరాదు. ధర్భాసన మయితే ఇంకా శ్రేష్ఠం.

9. వస్త్రం :

స్నానం చేసిన తర్వాత బట్ట అరవేసుకోవాలి. ఆచమనానికి స్నానంచేసిన తరువాత నీరు తెచ్చుకోవాలి. అందులో తులసి, యాలకులు లవంగాలుగుండ, పచ్చకర్పూరం వేయాలి. అదే నిజమైన తీర్థం.

పాత్రకు ఒకచేయిపైన, ఒకచేయి క్రిందవుంచి భగవత్‌శక్తి జలంలోనికి వెళ్ళిందని భావించి 10 సార్లు మనం జపించ వలసిన మంత్రం చదవాలి. ఆ మంత్రజలం పూజాసామాగ్రిపైన, మనపైన, భగవంతునిపైన చల్లాలి. పూజాద్రవ్యాలపై చల్లటంవల్ల

వాటిలోవున్న దోషాలు నివారణ అవుతాయి. దీపమూ, అగరు వత్తులూ వెలిగించాలి. తరువాత ఆచమనం చెయ్యాలి. ఆచమనం చేయునపుడు, తీర్థం క్రింద పడరాదు. ఆచమనం శబ్దం రాకుండా పెదవులతో తీసుకోవాలి. తులసీదళం, అక్షింతలు తీసుకుని మంత్ర జలంతో "ఉత్తిష్ఠంతు భూతపిశాచాః" అని కుడివైపునుంచి వెనుకకు వేయాలి. ఒక పుష్పం తీసికొని విగ్రహంపైని పెట్టి ఆవాహన చేయాలి. కరెంటు రూపంలో భగవత్‌శక్తి విగ్రహంలోకి అవాహన చేసి న్యాసం చేయాలి. తర్వాత జపమాలతో మంత్రం ఉచ్చరిస్తూ పూలతో అర్చన చేయాలి.

భగవంతుడికి నివేదనగా మాంసాహారము పెట్టరాదు. పూజ చేయువారు శాకాహారమే భుజించాలి. వండిన పదార్థములే నైవేద్యం పెట్టాలి. పండ్లు పెట్టి ఊరుకుంటే భగవంతునికి ఉపవాసంతో సమానం. మహనైవేద్యం పెట్టేటప్పుడు ఎవరూ చూడరాదు. నైవేద్యం పెట్టిన తర్వాత మరల ఒక్క నిమిషం ధ్యానించాలి.

నీరాజనం ఇవ్వాలి. ఆ తరువాత అక్షింతలు తీసుకొని "నారాయణాయేతి సమర్పయామి" అని అర్పించాలి. మంత్ర పుష్పం బదులుగా కొన్నిసార్లు మనం చేస్తున్న మంత్రం జపించి పుష్పములను భగవంతుని పాదాలపై వుంచాలి. తరువాత ప్రదక్షిణం చేయాలి. పూజగదిలో అయితే ప్రదక్షిణం చేయరాదు. సాష్టాంగ నమస్కారం చేయాలి. స్త్రీలు నేలమీద మోకాళ్ళు, చేతులు, నుదురు ఆన్చి మాత్రమే నమస్కారం చేయాలి. దేవుని ముందు ప్రసాదం తినరాదు. ప్రసాదం పుచ్చుకొన్నప్పుడు వెంటనే చేయి కడగరాదు.

17

# ధ్యానము

ధ్యానము రెండు రకములు. ఒకటి పూజలో చేసేధ్యానము. రెండు యోగసాధన మార్గములోచేసే ధ్యానము. ధ్యానము అంటే ఒక వస్తువుమీద మనస్సును ఏకాగ్రంగా నిలుపుట. ధ్యానము అంటే ధ్యాస ధ్యాస దేనిమీదకుపోతే దానిమీద మనస్సు లగ్న మవుతుంది. పూజలో ధ్యానం ఉపాంగం. యోగసాధనలో చేసే ధ్యానం ఆత్మసాక్షాత్కారం కొరకుచేసేది. యోగసాధనలో ధ్యానం చేయడానికి మన శరీరంలో ఏయేపనులు చేస్తామో మనం తెలుసు కోవాలి. దేహత్రయానికి ఈ పనులు వర్తిస్తాయి. ముందు స్థూల శరీరానికి బయట ప్రపంచ సమాచారాన్ని ఇంద్రియాలు చేరుస్తాయి.

శరీరంలోవున్న ఆత్మకు జీవుడు అనిపేరు. ప్రపంచం అంతటా వ్యాపించి ఉండే పరమాత్మ జీవాత్మరూపంలో శరీరంలో బంధించబడింది. ఆ పరమాత్మ, మనస్సూ శరీరమూనుండి విడి పించుకొని బయటికి రావడమే మోక్షంఅంటే. శరీరంనుండి ఆత్మను వేరుగా చూడగలిగినపుడు శరీరంమీద భ్రాంతి పోతుంది. శరీరంలో ఉన్న దోషాలను గమనిస్తూ మనస్సుతో వేరుచేయఃడం అలవాటు చెయ్యాలి. మనస్సును పావనం చేయుటకు సాధకుఃడు తన మన స్సును అంతర్ముఖంగా చేయుట లేక మనస్సును మరల్చి ధ్యానం చేయుటయే మార్గము. మనం నిశ్చలంగా (కదలకుండా) ఒక ఆసనముమీద 3 గం॥ల సేపు కూర్చొనగలిగితే మన శరీరంమీద

మనం విజయాన్ని సాధించినట్లు అవుతుంది. దీనినే అసనసిద్ధి అంటారు. ఈ విధంగా ప్రయత్నిస్తున్నప్పుడు జాయింట్స్ నొప్పి, మత్తువస్తే అది తామసగుణం. తామసగుణాన్ని పోగొట్టి శరీరం మీద విజయము సాధించాలంటే రోజూ ఒక వేళ శరీరానికి అల వాటుచేసి యోగఆసనాలు వేయడం అలవాటు చేసుకోవాలి, దీని కోసం ఆహారనియమాలు కూడా పాటించాలి. ఇదే సాధనలో తొలి మెట్టు.

శరీరంలోని ఆత్మకు శరీరం ఒక కవచం వంటిది. శరీరానికి కలిగే సుఖదుఃఖాలు ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మను, శరీరాన్ని వేరుగా చూడటంవల్ల మాయ తొలగిపోతుంది. శరీరమే ఆత్మ అనే భ్రాంతికి మాయ అనిపేరు. శరీరాన్ని "మనం" అను కొనేటట్లుగా నడిపించడంవల్ల. ఈ శరీరానికి కలిగే సుఖదుఃఖాలు మనకు కలుగుతున్నట్లు యీ మాయ వల్లనే భావిస్తాము. మనమే శరీరం అనుకోవడానికి కారణం మనస్సుయొక్క కాంటాక్టు వల్లనే, మనస్సు పరిశుద్ధమైనది. గాలి ఎటువంటిదో మనస్సు అటు వంటిది. స్వచ్ఛమైనగాలికి వాసనలేదు. శరీరంలోని దోషాలే మనకు పట్టుకొన్న వాసనలు, ఈ మనసుకు పట్టుకొన్న వాసనలు ఫిల్టర్ చేయడంవల్ల మనస్సు నిర్మలమై స్ఫటికంవలె స్వచ్ఛంగా వుంటుంది. తరువాత మనస్సుని పావనం చేయాలి. ఇది రెండు విధాలు.

## 1. మనస్సును ఇంద్రియములను అంతర్ముఖం చేయుట

మనస్సును వశంచేసుకోవడం అనేది ధ్యానం వల్లనే సాధ్య పడుతుంది. మామూలుగా మనస్సు అంతర్ముఖం కాదు. విశ్వం చేసే పనులు మార్చాలి. అంటే మనసుకు వ్యతిరేకంగా పని చేయాలి. ఇది చేయాలంటే "నామనస్సు"ను అని గాకుండా "నేను + మనస్సుగా" మార్చాలి.

## 2. వైరాగ్యము :

శరీరంచేసే పనులను, మనం పరిశీలన చేస్తూ ఒక పరిశీల కునిగా ఉండాలి. ధ్యానం చేస్తూనే తన శరీరంలో ఏమి జరుగు తుందోకూడా గమనించాలి. మనసులో ఏ ఆలోచనా లేకపోవడమే ధ్యానం. తన మనస్సులో వచ్చే ఆలోచనలో తాను లీనం కాకుండా ఆ ఆలోచనకీ – ఆలోచనకీ మధ్యవుండే ఇంటర్వెల్ ని గమనించాలి. ఈ విధంగా చేస్తే ధ్యానం కుదురుతుంది. ఈ ఇంటర్వెల్లే పరిశుద్ధ మైన మనస్సు అంటే ఏమిటో తెలియవస్తుంది. అదే పరిశుద్ధమైన చిత్తం, మబ్బులవంటివి ఆలోచనలు. ఆకాశంవలె నిర్మలంగా ఉండేది మనస్సు. ఈ వచ్చేపోయే మబ్బులను గమనించినట్లు ఆలోచనలను కూడా గమనిస్తే నిరాలోచన (శూన్య) స్థితి ఏర్పడు తుంది. ధ్యానంలో కూర్చుంటే వచ్చే చెడు ఆలోచనలన్నీ సహ వాస దోషంవల్ల మనసు మీద ఏర్పడినవే! అవిగాక మనం చేసే పాప (చెడు) కార్యాలవల్లకూడా మన మనసుపై చెడ్డముద్రలు ఏర్పడతాయి. వాటిని తొలగించుకోవాలి. అలా తొలగించుకోవడం ఎలాగో తెలుసుకోలేకపోతే ధ్యానం కుదరదు. ఆ రోజు ధ్యానం

కుదరలేదని తెలియక బాధపడతాం. నీళ్ళను బాయిల్ చేస్తే అందలి దోషం పోయినట్లుగా నిస్వార్థసేవమాత్రమే మనస్సును పావనం చేయడానికి ఉపయోగపడుతుంది. అసలు మనస్సు నిర్మలంగా ఉండక పోవడానికి కారణాలు ఏమిటో తెలుసుకోవాలి. మనలో ఉన్న దోషాలను సమర్థించకపోవడం వలన మనస్సును నిర్మలంగా ఉంచవచ్చును. మనసులో ఏ దోషాన్నీ దాచుకో కూడదు. గురువువద్ద తన తప్పును ఒప్పుకొని క్షమాపణ కోరాలి. క్రైస్తవ మతంలో పాపములను పోగొట్టుకొనుటకు మతగురువు వద్దకు వెళ్తాడు. ఆ విధంగా గురువుకు నివేదనలు చేస్తే మనసుకు వుపశమనం కలుగుతుంది. అలా చేయకపోతే లోపలనే కుమిలి పోతారు. గురువుకు సంపూర్ణ శరణాగతి చేసి వారికి నివేదన చేయాలి. అలా బ్రతికుండగా తప్పులు ఒప్పుకోక (పశ్చాత్తాపము పొందక) పోతే చనిపోయాకయినా యమలోకంలో బాధపడాలి. మనస్సుటేపు రివర్స్ అయి యమలోకంలో మన పాపాలన్నీ తెరపై కనిపిస్తాయి. ప్రతిపనీ మనం చేసేదీ, చూసేదీ మనస్సులో ముద్రింపబడి వుంటాయి. చిత్రగుప్తుడనగా చిత్రమైన మనస్సునుబట్టి

జీవుడు

| |
|---|
| బుద్ధి |
| మనస్సు |
| ఇంద్రియాలు |

గుప్తమైన విషయములను దాచి యుంచేవాడు. ఏరోజుకారోజు మనసుమీది చెడు ముద్రలు తుడిచి వేయగలిగితే మనసు నిర్మలంగా వుంటుంది.

తరువాతిమెట్టు బుద్ధిస్థానం. దీనిలో ఆలోచనలు వుండవు బుద్ధి ఆజ్ఞలు జారీ చేస్తూంటుంది. తక్షణమే చేసే పనులకు బుద్ధి పనిచేయదు. ఆలోచించే పని బుద్ధిమాత్రమే చేస్తూంది. బుద్ధి సారథి. అనుభవంలో బుద్ధి ఎలావుంటుందో తెలుసుకోవాలంటే మనం కళ్ళు మూసుకొని మనస్సును తట్టి ఎక్కడ ఉందో చూచుకోవాలి. ఒక్కొక్కసారి బుద్ధిమొండికేసి మూర్ఖత్వంలో ఉండిపోతుంది. తానుచేసిన నిర్ణయాల్ని వెనక్కి తిసుకోలేకపోవడం బుద్ధియొక్క రాంగ్‌ఏక్షన్. కాబట్టి మనకి ఏమి చేయాలని ఉందో దానికి వ్యతిరేకంగాచేస్తే ఈబుద్ధియొక్క జబ్బు నయమైపోతుంది. అంటే ముందు ముఖ్యంగా చేయవలసింది – ఇంద్రియాలను నిగ్రహించుట. మనస్సులోని భావాలను లోపలకు ఉపసంహరించుకొనుట. ఇంద్రియములను మనసులో నిగ్రహించుకొనుట ముఖ్యమైన పని.

## ధ్యానంలో ప్రకాశించే దశలు :

మనస్సు దట్టమైన పొగమంచులా ఉంటుంది. దోషములు ఎక్కువగా ఉంటే నల్లగా వుంటుంది. ఇది తమోగుణ లక్షణం. సాధన చేస్తున్న కొద్దీ దానియొక్క రంగు తెల్లగా మారుతూంటుంది. ఇది రజోగుణ లక్షణం. సాధన తీవ్రమయ్యేకొద్దీ క్రమక్రమంగా ప్రకాశవంతమవుతుంది. తరువాత వెలుగులా ఉంటుంది. తరువాత ఒక చిన్న నక్షత్రంలా వెలుగుతుంది. తరువాత ఏదో ఒకమార్గంనించి వచ్చి జ్యోతిలా కనిపిస్తుంది. తరువాత చంద్రుడిలాగ ప్రకాశిస్తుంది. తరువాత వెన్నెలలా వెలుగుతుంది. ఆపైన

సూర్యునిలా ప్రకాశిస్తుంది ఈ ప్రకాశం పెరిగినకొద్ది యోగిసాధనలో పై మెట్టుకి వెళ్ళినట్లు తెలుసుకోవాలి. ఆ లోపలనించి ప్రకాశం ఎప్పుడైతే వస్తుందో నిర్భయత్వాన్ని పొందుతాడు. చావుని గురించిన భయంకూడా పోతుంది. ఆత్మ సాక్షాత్కారం పొందినప్పుడు మనస్సు నిర్భయమై పిదప నిర్మలమౌతుంది. ఒక విషయాన్ని గురించి ఆలోచనకు ప్రయత్నించునపుడు ఒకటే సరియైన ఆలోచనవస్తుంది. అంటే నిర్మలమైన మనస్సుకు రకరకాల అభిప్రాయాలుండవు. అపుడు యోగి నిజాయితీగా వుండడం ఆత్మకు బలం చేకూరుస్తుంది. (ఆత్మకు నష్టంవస్తే జన్మజన్మలకూ ఉంటుంది). అప్పుడు సాధకుడు తనకు వున్న సుఖదుఃఖాలకు సాక్షీభూతుడుగా నిలబడ కలుగుతాడు, రూపొందగలుగుతాడు.

కొన్ని సంవత్సరాలు ధ్యానం చేయడం వలన తరువాత జన్మలో కూడ మన ఆత్మ ధ్యానస్థితిలో వుంటుంది. ఎలాగంటే రాత్రి పడుండబోయేముందు ధ్యానస్థితిలో మనస్సు ఉంటే, తెల్లవారే వరకూ నిద్రలోకూడా అలా ధ్యానిస్తూనే ఉంటాడు. దానివల్ల ఆత్మ ప్రోగ్రెస్ అయి తరువాత జన్మలో ఆత్మశరీరంలో తిరిగి ప్రవేశించినపుడు తనకు కావలసిన స్థితిని ఎన్నుకొంటుంది. జన్మతః వచ్చిన ధ్యానం వలన మోక్షం వస్తుంది. ధ్యానం వలన తన శరీరాన్ని వేరేగా చూడగలుగుతారు. మనం చేసే పనులన్నీ సాక్షిభావంగా చేయాలిగాని, ఆత్మభావంతో చేయరాదు. సాక్షీభావంతో పనిచేస్తే పాపం, పుణ్యం మనకి సంప్రాప్తించదు. యోగి తనలో ఉన్న ఆత్మను చూచి ఆనందిస్తాడు. తనకు అతిముఖ్యమైన వస్తువిచ్చి సంతోషించినవారు గొప్పవారు! దానం వల్లనే దైత్యులు.

దానం వల్లనే మానవులు సాక్షీభావం పొందుతారు. ఒకలాభం పొందినపుడు సంతోషించకుండా, ఒక నష్టం జరిగినపుడు క్రుంగ కుండా ఉండడం బ్రాహ్మణధర్మం. ఇది పరిపూర్ణమైన మనస్సు యొక్క లక్షణం, ధర్మంకూడా. వృద్ధిక్షీణతలకు అతీతుడైనవాడు సుఖదుఃఖాలను జయిస్తాడు. జీవితాన్ని జయించుతాడు. ఏదీ అవస రంలేని స్థితిలోవుండి, అన్నీ అందరికీ యివ్వగల్గిన స్థితిలో వుంటాడు. ఆత్మ సాక్షాత్కారం పొందినవాడు, (ఉపసంపద వలన ఆత్మ సాక్షా త్కారం పొందవచ్చు) అనుభవంతో మననాన్ని జోడించుకోవాలి. వేదానికి జ్ఞానకాండ, కర్మకాండలున్నాయి. మానసిక కర్మ శ్రమం.

శారీరకకర్మ అనుష్ఠానం లేక కర్మాచరణ. రోజూచేసే సాధన కర్మకాండ. తనకు తానే తెలియని స్థితి ధ్యానస్థితి.

ఆధ్యాత్మికశక్తిగి ప్రసారం చేసినపుడు అది తమోగుణ లక్షణం. అది చీకటిగా ఉంటుంది. తేజస్సుగా ఉండేది ధ్యానం. ధ్యానం వలన ఎటువంటి వాడికైనా కొన్ని ఫలితాలైనా కనిపిస్తాయి. ఇది ముఖ్యంగా ప్రయత్నం మీద ఆధారపడి యుంటుంది ధ్యాన మునకు సంధ్యాకాలము శ్రేష్ఠం. అంటే నీలపుకాంతిలోనే ధ్యానిం చాలి. సాధనారంభంలో అన్నీ త్యజించాలి. అహంకారాన్ని, విడిచి పెట్టాలి. భగవంతుని మీద పూర్తి విశ్వాసముంచాలి. సుఖంలో గాని దుఃఖంలో గాని సంతోషించినా, దుఃఖించినా భగవంతుడి మీద విశ్వాసం లేనట్టే. సాధన చేస్తున్నామనే అహంకారం లేనప్పుడు పూర్తి ఫలితాలుంటాయి. ఈ అహంకారం మనస్సులో తెలియ కుండా నాటుకుంటుంది దీన్ని త్యజించాలంటే దానము, నిస్వార్థ

సేవ చేయడమే మార్గము. తనకు తెలిసిన (విద్యను) దానం చేయనివాడు బ్రహ్మరాక్షసు డవుతాడు.

ఓం "నమోనారాయణాయ" అనే మంత్రంలో "ఓం" ఆత్మ స్వరూపాన్ని, "నమో" బుద్ధినీ, మనస్సునీ· "నారాయణాయ" అనే అక్షరాలు పంచేంద్రియముల గురించీ, జీవుని గురించీ తెలియ చేస్తాయి. యిదీ వ్యాపకమంత్రము. ఆకాశతత్త్వంపై ఆధారపడి ఉంటుంది. ఈ మంత్రాన్ని జపించినపుడు మనసంతా ఈమంత్రం వ్యాపిస్తుంది.



18

# యోగ రహస్యాలు-హిందూదేవతలు

హిందువులు అనేకమంది దేవుళ్ళను కొలుస్తారని ఇతర మత స్థులు మనల్ని ఆక్షేపించటం తరచు వింటూ వుంటాము. దేవు డొక్కడేకదా! ఆలాంటప్పుడు ఇంతమంది దేవుళ్ళను – హిందు వులు ఎందుకు పూజిస్తారు?

ఈ ప్రశ్నకు సమాధానం ఈనాటి హిందువుల క్కూడా తెలి యదు. అందుకనే సరియైన సమాధానం తెలియక ఇవి అటవిక దశలో వున్న మానవుని "మూఢవిశ్వాసా" లని కొందరూ, కవితా కల్పనలని మరికొందరూ ఇలా ఉహాగానాలతో నింపివేసి పుస్తకాలు కూడా వ్రాసేస్తున్నారు. మరికొందరు తమకు తోచిన ఊహలతో ఈ దేవుళ్ళ అర్థాలను నింపేస్తున్నారు.

ఉదాహరణకు శ్రీ తిరుమల రామచంద్ర, మన పండుగల గురించి వ్రాస్తూ "గణపతి" "వ్యవసాయదేవుడని" వ్రాశారు. దీనికి వారు చెప్పిన ఉదాహరణ చేటల్లాగ చెవులు. ఎలుక వాహనం అని యిలా వ్రాయడము. అంతేగాక పెద్ద పొట్ట లేక 'లంబోదరం' ధ్యానం పోసుకొనేగాదె వల్లనే ఏర్పడిందని ఊహా గానాలు చేశారు. ఇది ఏశాస్త్రప్రమాణంమీదా ఆధారపడ్డ వివరణ కాదు. కేవలం ఊహాగానం! యిలా వ్రాయడంవల్ల అటువంటివిచదివి ఈనాడు ప్రతివారూ ఎవరికి తోచినట్లు వారు ఊహించి హిందువుల దేవుళ్ళను

గురించి వివరణలు వ్రాసేస్తున్నారు. ఇలాంటి వ్రాతలు నిర్దుష్ట మైన విజ్ఞానంతో వ్రాసినవి కావు. ప్రాచీన శాస్త్రాలలోని అర్థాన్ని గురుముఖతః సక్రమ పద్ధతిలో తెలుసుకొని ఆ శాస్త్రాల దృష్ట్యానే వ్రాయాలి. లేకపోతే వ్రాసేవారి అజ్ఞానాన్ని ఊహాగానాల రూపం లోనూ, పత్రికలో ప్రచురించే రచనల ద్వారానూ ప్రజలకు అంటించడం జరిగి వాళ్ళు అవి చదివి నిజమైన, శాస్త్రీయమైన అంతరార్థం ఒకటుందని గాని, దాన్ని తెలుసుకోవాలనిగానీ ప్రయ త్నంకూడా చేయలేకపోవటం జరుగుతోంది. దీనివల్ల హిందూమతా నికి తీరని అన్యాయం జరుగుతున్నది. ఇది ఆపాలంటే ఈ దేవుళ్ళ గురించిన శాస్త్రీయ రహస్యాలు ప్రజలకు బోధించాలి – రహస్యంగా, దాచకుండా ! అదే యిప్పుడు ఈ అధ్యాయంలో ప్రారంభిస్తు న్నాము !

అయితే హిందూమతం దేవుడొక్కడే అని వేదాల్లో చాటి చెపుతూ మరి రకరకాల రూపాలు, వివిధ ఆకారాలతో ఈ దేవు ళ్ళను పూజా విగ్రహాలుగా ఆలయాల్లో ఏర్పాటు చేసిన కారణం ఏమిటి ? ఆధ్యాత్మిక సాధనలో శిక్షణ పొందే మనకి సాధనకు, వాటిగురించిన నిర్దుష్టమైన "విజ్ఞానం" ఒకటి ఉన్నదని తెలియాలి. ఆ విజ్ఞానంయొక్క సరిహద్దు లేమిటో (అవుట్‌లైన్స్), దాని మూలసూత్రము లేమిటో కనీసం పరిచయం చేయడం అవసరం.

ప్రాచీనఋషులు మన హిందూ దేవతల ఆకారాలలో కొన్ని రహస్య సంకేతాలను ఇమిడ్చారు. ఈరహస్య సంకేతాలకు అర్థం ఏమిటో కేవలం ఊహాగానాలుచేసి చెప్పడానికి వీలులేదు. ఎందు

కంటే ఈ సంకేతాలేమిటో తెలియాలంటే 1) మొదట జ్యోతిశ్శాస్త్ర పరమైన గూడార్థం, 2) మంత్రశాస్త్రపరమైన సాంకేతిక విజ్ఞానం, 3) యోగశాస్త్రపరమైన నాడులు, చక్రాలు, ఇలాంటి విషయముల గురించి విజ్ఞానం, 4) సంఖ్యాశాస్త్రము, 5) శుల్బశాస్త్రము లేక యంత్రములో ఉపయోగించే కోణములు, భుజములయొక్క రహస్య అర్థములు తెలిపే విజ్ఞానం, 6) ఔషధీసంబంధమైన సాంకేతిక రహస్యములు, మంత్రాయుర్వేదం, 7) తాంత్రిక సంకేతవిద్య ఈ ఏడు శాస్త్రములలో కనీసపరిచయమైనా లేకుండా, మనహిందూదేవతల ఆకారాల గురించి ఇష్టం వచ్చినట్లు ఊహలు చేయడం శుద్ధ అవివేకం అన్నమాట వేరే చెప్పనక్కరలేదు.

దీనికి కొన్ని ఉదాహణలు తెలుపుతున్నాను. మన దేవతలకు మనిషికంటే ఎక్కువ తలలూ, ఎక్కువ చేతులు వున్నట్లు వర్ణించబడటం పెద్ద ఆశ్చర్యకర విషయం! ఇలా బ్రహ్మకు నాలుగు తలలూ, కుమారస్వామికి ఆరు ముఖాలూ, ఆంజనేయుడికి పంచముఖాలు, దత్తాత్రేయునికి ఐదు శిరస్సులూ, నారాయణునికి వేలకొద్ది శిరస్సులూ వర్ణింపబడి ఉండుట మనకు తెలుసు. అలాగే విష్ణువునకు నాలుగుచేతులు, దుర్గకు అష్టభుజములూ ఈ విధంగా వర్ణించబడి ఉండటం కూడా మనకు కనబడుతుంది. ఇక్కడ "భుజములు" అంటే మనకు కేవలం మనిషికి ఉండే చేతులు అని మాత్రము అర్థం తీసుకొంటాము! కాని అదికాదు ఇక్కడ సాంకేతిక రహస్యము (టెక్నికల్ సీక్రెట్) గణితములో 'త్రిభుజం' అంటే (ట్రయాంగిల్) మూడు వేపులా కోణములు కలిగిన ఆకారం అని అర్థం! ఇక్కడ "భుజం" అంటే చేతులు అనికాదు. అర్థం! ఏ దేవతకు ఎన్ని "భుజములు" వర్ణించబడి

వున్ననూ దానిరూపాన్ని మంత్రశాస్త్ర పరంగా యంత్రము (జ్యామెట్రిక్ షేప్) లాగ విభజించాలంటే ఎన్ని కోణములు పెట్టాలో తెలిపే సంకేత రహస్యం.

## దేవతల భుజములు, ముఖాలు :

భుజములు అంటే కోణములు (ఏంగిల్స్) అని అర్థం. "ముఖములు" అంటే తలము (ఫేస్) అని అర్థం. అందుకనే బ్రహ్మకు నాలుగు ముఖములు. విష్ణువునకు నాలుగుచేతులూ వర్ణించారు. అంటే నాలుగువైపులా సమతలంగా వుండే చతురస్రము వేయాలని అంటే చతుర్ముఖంగా వుండే చతురస్రము వేయాలని అనే మాటకు అర్థం ! నాలుగువైపులా భుజములు లేక కోణములు ఏర్పడేలాగ క్రాస్‌వలె (గణితంలో కూడిక చూపే ప్లస్ వంటి ఆకారము) వేయాలనే 'చతుర్భుజం' అన్న మాటకు అర్థం! ఈతేడా తెలియక ఏవేవో వూహలు చేసేస్తున్నారు – పెద్ద పండితులనిపించుకునే మన రచయితలు !

## దివ్యాయుధాలు :

అలానే ఆయుధాలూనూ ! ఒక్కొక్క దేవత చేతిలో వివిధాయుధాలు పట్టుకొన్నట్లు వర్ణింపబడివున్నది. ఉదాహరణకు-అంకుశము, పాశము, అగ్ని ఇవి వర్ణింపబడిన ఆయుధాలలో కొన్ని ! ఇవికూడా మంత్రశాస్త్రమునకు సంకేతములు, మంత్రశాస్త్రములో బీజాక్షరములు, వాటి శక్తులు తెలుసుకోవాలంటే దానికి సాధకునికి "బీజాక్షరనిఘంటువు" (డిక్షనరీ ఆఫ్ సౌండు ఆఫ్ పవర్) తెలి

యాలి. బీజాక్షరముల రహస్యము తెలిపే శాస్త్రప్రకారము "క్రోం" అనే బీజాక్షరమునకు "అంకుశము" అనిపేరు. అలానే "రాం" బీజాక్షరమునకు "అగ్ని" రహస్య సంకేతము! ఇలాగ మంత్రశాస్త్ర పరమైన సంకేతాలు తెలియనిదే ఏ దేవతకు ఎన్ని భుజములు? ఎన్ని ఆయుధములు ? అవి ఎందుకు పెట్టారో తెలియదు. వాటి ఉపయోగాలు అంతకంటే తెలియదు ! ఇటువంటి వారే ఊహా గానాలు చేసేది !

## యోగశాస్త్రి సంకేతాలు :

ఇక యోగశాస్త్ర సంబంధమైన సంకేతాలు ఏమిటో చెపుతాను. ఇందులో మనదేవతలు నుదుట అర్ధచంద్రునితో వర్ణించబడడం మనకు పరిచయమైనదే. శివునకు అర్ధ చంద్రుడు, గణపతికి ఫాల చంద్రుడు, లలిత, త్రిపురసుందరికీ నుదుట చంద్రకళ. ఇలాగ దేవతలకు అర్ధచంద్రుడే ఎందుకు వర్ణించారు? ఏ దేవునికీ నుదుట పూర్ణచంద్రుడు ఎక్కడా చెప్పలేదు. దీనికి కారణమేమిటి ? ఇది ఊహగానాలవల్ల తెలిసేది కాదు. ఎందుకంటే ఇది ఒక శాస్త్రీయ మైన సంకేతము (టెక్నికల్ సీక్రెట్)

యోగశాస్త్రము మన శరీరానికి కుడి, ఎడమ వైపుల రెండు నాడులు ఉన్నాయని తెలుపుతోంది. ఎడమవైపు చంద్రనాడి, కుడి వైపు సూర్యనాడి. చంద్రనాడి ఎడమముక్కు ద్వారా ప్రయాణించి భ్రూమధ్యంలో (అనగా బొట్టు పెట్టేచోట) ఎడమవైపుని అర్ధచంద్రా కారమైన అర్ధవృత్తము (అఫ్ సర్కిల్)గా అంతమవుతుంది. యోగికి, సాధకులకూ ధ్యానంలో నుదురు సగమువైపు చంద్ర

కాంతిలో ప్రకాశించే చంద్రనాడియొక్క అనుభూతిని ఈ నుదుట వుండే చంద్రకళ సూచిస్తుంది. శరీరంలో ఉండే జీవుడే శివుడు, కనుక దేవునికికూడా జీవునిలాగే నుదుట చంద్రకళ చెప్పబడింది. అలానే శరీశంలో ఎడమవైపు శక్తిస్థానం కాబట్టి స్త్రీ దేవతలకు నుదుట చంద్రకళ చెప్పబడింది. "చతుర్భుజే ! చంద్రకళావతంసే ! కుచోన్నతే కుంకుమ రాగశోణే" ! అని ధ్యానమూర్తి వర్ణింపబడింది. స్త్రీ శక్తి స్వరూపిణి గనుక గణపతి శక్తి కుమారుడు గనుక, గణపతికి కూడా నుదుట చంద్రరేఖ వర్ణింపబడింది. అలా విష్ణువునకు, బ్రహ్మకు, తదితర దేవతలకు చంద్రకళ వర్ణింపబడలేదు. దాని రహస్యమిదే !

ఇలాంటి సంకేతాలలో పద్మం ఒకటి ! బ్రహ్మ పద్మాసనం మీద కూర్చునట్టు వర్ణించారు. విష్ణువు నాభిలోంచి "పద్మం"కాడతో పొడవుగా వచ్చినట్లు వర్ణించబడింది. ఇక్కడ కూడా శాస్త్రపరమైన సాంకేతిక విజ్ఞానం ఉంటేనేగాని విష్ణువు నాభికమలంయొక్క అర్థం తెలీదు.

యోగికి శరీరంలో నాడులు కలిసేచోట ఏడుచక్రాలు శరీరంలో ఉంటాయి. అవి సాధనతో కుండలినీ శక్తివల్ల మేల్కొల్పబడి విచ్చుకొన్నపుడు అవి "పద్మాల" లాగ ఉంటాయి. అందులో బొడ్డుదగ్గరవుండే 'మణిపూరక' చక్రానికి విష్ణువు అధిపతి! కాబట్టి అదే బ్రహ్మకు పద్మము ఆసనంగానూ, విష్ణువుకు నాభివద్దను పద్మం వర్ణించడానికి కారణము. ఈ యోగశాస్త్ర రహస్యము తెలియనివారికి ఈ దేవతల వర్ణనలు అంతుపట్టవు.

పైన తెలిపినవి కేవలము ఉదాహరణలు మాత్రమే (illustrations.) పూర్తిగా చెప్పాలంటే ఒక్కొక్కటి ఒక్కొక్క శాస్త్రము. ఆ శాస్త్రముయొక్క సాంకేతిక పారిభాషిక పదాలు తెలియనిదే ఈ విజ్ఞానము అంతుపట్టదు. ఎలాగైతే ఈనాడు సైన్సులో ప్రతి లోహానికి (మెటల్స్) ఖనిజములకు (మినరల్స్) ఒక్కొక్క గుర్తు (సింబల్స్ మరియు ఫార్ములాస్) చొప్పున ఎలా ఉన్నాయో పూర్వకాలపు గుణితం, జ్యోతిషం వంటి సైన్సులోని సాంకేతిక విజ్ఞానము కూడా అంతే !

మన "పండగల" గురించి వివరంగా వర్ణించిన సందర్భములో ఇలాంటి జ్యోతిష సంబంధమైన వివరాలు తెలిపాను. వినాయకచవితి గురించి వ్రాసినపుడు గణపతి రూపానికి అర్థం, కార్తీక మాసము గురించి వ్రాసినపుడు కార్తికేయునికి రహస్యార్థము. ఇలాగే వేరే గ్రంథంలో అని తెలుపబడ్డాయి. ఇక్కడ మనకు కావలసినదల్లా మీరు ఒక ముఖ్యమైన సూత్రాన్ని గ్రహించిడమే !

అది మనదేవతల రూపాలు తెలుసుకోవాలంటే మంత్ర శాస్త్రము వంటి ప్రాచీన శాస్త్రములలోన రహస్య విషయాలు కరతలామలకంగా తెలియాలి.

ఆ విజ్ఞానంతో మన దేవుళ్ళని పరిశీలించినపుడే వారి అనుగ్రహంతోనే ఈ రహస్యాలు మన మనస్సునకు విశదమవుతాయి. దీనికి గురువు ద్వారా ఈ శాస్త్ర సంకేతాలు పవిత్రమైన మనస్సుతో గ్రహించాలి.



19

# యోగరహస్యాలు - II

## (శ్వాస)



"శ్వాస" – మన శరీరానికీ ఆత్మకూ మధ్యన ఉండే లింకు (Link). శ్వాసవల్లనే మనస్సు శరీరములో బంధించబడి వుంటుంది. పరుపులో ప్రత్తి – గుడ్డ కవరులో టాకాలు ద్వారా బిగించబడినట్లుగానే – శరీరంలో కొన్ని కేంద్రాలు "కుట్లు" వేయ బడి శ్వాస మనస్సును, శరీరాన్ని కుట్టి వుంచుతుంది. ఈ ముడి విడిపోతే శరీరానికీ, మనస్సుకూ "కనెక్షను" వూడిపోతుంది. (ఈ ముడులనే "గ్రంధులు" అంటారు యోగులు).

మనస్సు పనిచేస్తున్న వేగాన్ని బట్టే శ్వాసకూడా నడుచు కుంటుంది.

ఆవేశాలు (కోపం, భయం, సెక్సు) కలిగితే శ్వాస చాలా వేగంగా నడుస్తుంది – మనస్సులాగే! మనస్సు శాంతిగా నిశ్చలంగా వున్నప్పుడు శ్వాసకూడా వేగం తగ్గి. నిదానంగా నడుస్తుంది.

నిద్రలో వున్నవాడికి శ్వాస – నెమ్మదిగా, దీర్ఘంగా, లయ బద్ధంగా (Rythomic), తాళం లాగా పనిచేస్తుంది!

సమాధిలో పూర్తిగా నిలిచిపోతుంది. మరణించినప్పుడు కూడా శ్వాస నిలిపోతుంది– శరీరానికి, మనస్సుకూ "లింకు" విడిపోతుంది. కనుక యోగంలో జరిగేది అదే – మనస్సుకూ శరీరానికి "లింకు" విడిపోయి మనస్సు విశ్వవ్యాప్తంగా వ్యాపిస్తుంది. అందుకే శ్వాస ధ్యానంలో కూడా ఆగిపోవటం !

ఈ సూత్రాన్ని ఉపయోగించి – శ్వాసద్వారా, మనస్సును విడుదల చేయుటం ద్వారా, క్రియాయోగం శరీరంలోని బంధంనుంచి ఆత్మకు విముక్తి లభించేలాగ చేస్తుంది ! చచ్చిన తర్వాత కాదు బ్రతికి వుండగనే చేస్తుంది ! ఇదే జీవన్ముక్తికి మార్గం.



# క్రియా యోగం



మనస్సు ఒక "కరెంటు" వంటిది. అది "మెదడు" (Brain) నుంచి నరాల ద్వారా శరీరం అంతటా ప్రవహిస్తూం టుంది. అప్పుడు దీనికి "ప్రాణం" అనిపేరు. దీనివల్ల శరీరంలో చైతన్యం ప్రవహించి సజీవంగా వుంచుతుంది.

మనస్సు ఇంద్రియాల నుంచి (కన్ను, ముక్కు, చెవి) బైటికి ప్రవహించి – మనకు తెలివి (బైట ప్రపంచం వున్నదనే ఎరుకని) కలిగిస్తోంది.

అదే మనస్సు ఇంద్రియాలలోంచి "కరెంటు"లా ప్రవహిం చటం నిలిచిపోతే – ఇంద్రియాలకు బైటిప్రపంచం కనిపించదు. అప్పుడు మనిషి 'స్పృహ" తప్పిపోతాడు.

అలా మనస్సు లోపలికి – ఆత్మవైపుకి ప్రవహించినా – అంతే జరుగుతుంది. ఇంద్రియాలకు "కరెంటు" (మనస్సు) ప్రవ హించక బైటి ప్రపంచము కనిపించదు. అప్పుడు కూడా బైటి "స్పృహ" కోల్పోతాడు యోగి. దీనినే ధ్యానసమాధి అంటారు.

పై రెండు పరిస్థితులలోనూ మనస్సు ఇంద్రియాలలో ప్రవహించదు. "స్పృహ" పోతుంది. స్పృహ (యోగం, నిద్ర, మృత్యువూ) వుంటేనే బైటి ప్రపంచం కనపడుతుంది.

ఈ "స్పృహ"యే – ప్రపంచము. ఎందుకంటే అయిదు ఇంద్రియాల్లో (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం) మనస్సు "కరెంటు" లాగ ప్రవహిస్తే – ఈ ఐదు ఇంద్రియాల జ్ఞానం వల్లనే ఈ ప్రపంచం అనే అనుభూతి ఏర్పడుతుంది. (ప్ర + పంచ + ము) = అయిదు అనుభవాలవల్ల కలిగే అనుభూతియే – ఈ జగత్తు వున్నట్టుగా అనుభూతి కలుగచేస్తుంది.

ఈ మనస్సును లోపలికి ప్రవహింపజేసి ఆత్మ వైపు భగవానుని వైపుకి మళ్ళేటట్టు చేయగలిగితే – ఈ ప్రపంచం దాటి (ఇంద్రియాలనుదాటి) అంటే – ప్రపంచం అనే భావంలోంచి బైటపడతాడు. అదే మోక్షంఅంటే, ఇలా శ్వాసను లోపలికి త్రిప్పే (నివృత్తి) విధానమే – క్రియాయోగము.



